# త్రిపురా రహస్యదీపిక

(త్రిపురా రహస్యము అను జ్ఞానఖండము)




గ్రంథకర్త :

కనకాభిషేక గ్రహీత, సువర్ణఘంటాకంకణ, శ్రీవిద్యా నిధి,

చక్రవిద, శ్రీవిద్యా రత్నాకర, శ్రీవిద్యా విశారద,

**క్రోవి పార్థసారథి**

త్రిపురా రహస్యదీపిక

ప్రథమ ముద్రణ : మార్చి, 2002

ప్రతులు : 1000



**వెల : రూ. 60-00**

గ్రంథకర్త :
**కె. పార్థసారథి**
వాణిజ్యశాస్త్రోపన్యాసకులు
శాతవాహన కళాశాల
విజయవాడ.

ప్రాప్తి స్థానము :
**కె. మంజూష**
23-11/1-10/2, దేవీ నిలయం
ఓగిరాలవారి వీధి, సత్యనారాయణపురం,
విజయవాడ - 520 011.
ఫోన్స్ : 530672, 634571

ముద్రణ :
**నిర్మలా ఆఫ్‌సెట్ ప్రింటర్స్**
26-6-3, పాపయ్య వీధి,
గాంధీనగర్, విజయవాడ-3.
ఫోన్ : 0866 - 574828

## క్రోవి పార్థసారథిగారి పరిచయం

పూర్తిపేరు : క్రోవి పార్థసారథి

వృత్తి / ఉద్యోగము : వాణిజ్యశాస్త్ర ఉపన్యాసకులు,
శాతవాహన కళాశాల, విజయవాడ.

ఇంటి అడ్రస్ : 23-11/1-10/2, దేవీ నిలయం,
ఓగిరాలవారి వీధి, సత్యనారాయణపురం,
విజయవాడ - 520 011. ఫోన్ : 634571

**రచించిన గ్రంథాలు :**

1. శ్రీవిద్యా దర్శనము
2. శ్రీవిద్యా దర్పణము (గౌడపాదుల సుభగోదయస్తుతికి తెలుగు వ్యాఖ్య)
3. శ్రీవిద్యా రహస్యము
4. దేవీ కథాసుధ
5. శ్రీవిద్యా సర్వస్వము (కామకలావిలాసానికి వ్యాఖ్య)
6. శ్రీవిద్యా మహాయంత్రము (శ్రీచక్రానికి విశేష వ్యాఖ్య)
7. శ్రీవిద్యా హృదయము (యోగినీ హృదయానికి వ్యాఖ్య)
8. శ్రీవిద్యా పంచదశి (పంచదశీ మహామంత్రానికి వివరణ)
9. భావనోపనిషత్తు
10. ఉపనిషత్సర్వస్వము
11. శ్రీచక్ర సర్వస్వము
12. త్రిపురా రహస్యదీపిక
13. బ్రహ్మసూత్రమంజరి
14. శ్రీచక్రము
15. శ్రీవిద్యాసారధి (లలితా సహస్రనామ భాష్యము)
16. ఉపనిషద్దర్శనము (దశోపనిషత్తులపై ఆడియోక్యాసెట్లు 14 Volumes)
17. శ్రీవిద్యా దర్శనము (ఆడియో క్యాసెట్లు 4 Volumes)

సత్కారాలు : 1. 13-12-1999 కనకాభిషేకము

2. 1-8-1998న సువర్ణ ఘంటాకంకణ ప్రదానము.

బిరుదులు : 1. చక్రవిద, శ్రీవిద్యారత్నాకర, శ్రీవిద్యా విశారద, శ్రీవిద్యానిధి.

2. ఉత్తమ ఉపాధ్యాయ, ఉపాధ్యాయరత్న, విశిష్ట ఉపాధ్యాయ, విద్యార్థిబంధు

సన్మానాలు : 1. అవధూత దత్త పీఠాధిపతి శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామి

2. కుర్తాళం సిద్ధేశ్వరీ పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ శివచిదానంద భారతిస్వామి

3. గన్నవరం భువనేశ్వరీ పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ చిదానంద భారతి స్వామి

4. గుంటూరు శృంగేరి శ్రీ విరూపాక్ష పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ శివకళ్యాణానంద భారతి మహాస్వామి

5. విశ్వబంధు తపోవనం ట్రస్ట్ అధిపతులు శ్రీశ్రీశ్రీ వాసుదేవానందగిరి స్వామి

6. చైతన్యతపోవనం ట్రస్ట్ అధినేత శ్రీశ్రీశ్రీ మాతా శివచైతన్య

7. కాళీగార్డెన్స్ అధిపతులు శ్రీశ్రీశ్రీ చంద్రకాళీ ప్రసాదమాతాజీ

8. విజయవాడ లలితా పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ మాతా శివలీల

9. గౌ॥శ్రీ॥డి. శ్రీపాదరావు, స్పీకర్, ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీ

10. గౌ॥జనాబ్ ఎమ్.కె. బేగ్ (మంత్రివర్యులు)

11. గౌ॥శ్రీ॥దేవినేని రాజశేఖర్ (నెహ్రూ) (మంత్రివర్యులు)

12. గౌ॥శ్రీ॥ జలగం ప్రసాదరావు (మాజీ మంత్రివర్యులు)

ప్రశంసాపత్రాలు : కంచి, శృంగేరి, ద్వారక, పుష్పగిరి, కుర్తాళం తదితర పీఠాధిపతులచే

ఆర్థికసహాయం : పై గ్రంథాలలో 2,3,5 గ్రంథాలకు తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థిక సహాయం

కొనుగోలు ఆర్డరు : పై గ్రంథములు కొని దేవాలయాలలో భద్రపరుచమని దేవాదాయశాఖ కమీషనరు వారి ఉత్తర్వులు.

వ్యాసాల ప్రచురణ : దేవాదాయశాఖవారు ప్రచురించే "ఆరాధన" పత్రికలో ఎనిమిది వ్యాసాల ప్రచురణ, ఇంకా అనేక పత్రికలలో

# ప్రణతులు

త్రిపురా రహస్యము అనేది పూర్తిగా జ్ఞానఖండము. ఇందులో కారణజన్ముడైన పరశురాముడు ఇరవై ఒక్కసార్లు దండయాత్ర చేసి బాలురను, వృద్ధులను వదిలి రాజులందరినీ సంహరించాడు. ఈ రకంగా క్షత్రియ కులాన్ని నాశనం చేసిన పరశురాముడు మోక్షగామియై దత్తాత్రేయుని పాదాలనాశ్రయించాడు. దత్తాత్రేయుడు ముందుగా పరశురాముడికి దేవి మాహాత్మ్యము అంతా వివరించాడు. అంటే ముందుగా సాకారాన్ని భక్తిశ్రద్ధలతో జపింపచేశాడు. ఏకాగ్రత కుదిరిన తరువాత ఆత్మతత్త్వాన్ని వివరించాడు.

ఈ గ్రంథం మొత్తం మూడు భాగాలు అని చెప్పవచ్చు. మొదటి భాగంలో హేమలేఖ హేమచూడుడికి ఆత్మతత్త్వాన్ని వివరిస్తుంది. రెండవ భాగంలో మహాసేనుడికి మునిబాలకుడైన తంగణపుత్రుడు ఆత్మతత్త్వాన్ని వివరిస్తాడు. మూడవ భాగంలో బ్రహ్మరాక్షసి అయిన వసుమంతుని సందేహాలను రుక్మాంగదుడు తీర్చటం జరుగుతుంది. ఈ విధంగా ఈ గ్రంథంలోని మూడు భాగాలలోనూ అద్వైతసిద్ధాంతాన్ని, ఆత్మతత్త్వాన్ని పూర్తిగా వివరించటం జరిగింది. ఒక రకంగా చెప్పాలంటే ఆత్మవిద్యలో ఉపనిషత్తులకన్న కూడా ప్రశస్తమైన గ్రంథమిది. ఈ గ్రంథాన్ని చదివినవాడికి ఆత్మతత్త్వం ఏమిటో బోధపడుతుంది. ఆత్మజ్ఞానం కలుగుతుంది. అందుకే గ్రంథం చివరలో దత్తాత్రేయుడు "ఈ గ్రంథాన్ని ఒకసారి విన్నంత మాత్రం చేతనే జ్ఞానం కలుగుతుంది." అంటాడు. అటువంటి మహోత్తమమైన గ్రంథమిది.

సామాన్యులకు కఠినశిల లాంటిది ఈ గ్రంథం. అయితే అందరికీ అర్థంకాని విద్య వ్యర్థమనే తలంపుతో ఈ గ్రంథాన్ని పూర్తిగా నా శక్తి మేరకు ఎక్కువమందికి అర్థం కావాలనే తలంపుతో అతిసులభశైలిలో విషయాలను విడదీసి వివరించటం జరిగింది.

మనదేశంలోని వారేకాకుండా ప్రపంచంలోని తెలుగువారందరూ కూడా గ్రంథాన్ని చదువుకునేటందుకు వీలుగా గతంలో 'శ్రీచక్రము' మాదిరిగానే ఈ గ్రంథాన్నికూడా ఇంటర్‌నెట్‌లో ఇవ్వటం జరుగుతోంది.

ఈ గ్రంథముద్రణకు ఆర్థికసాయమందించిన శ్రీమతి బులుసు వసుంధరాదేవిగారికి ఆయురారోగ్య ఐశ్వర్యాలు, సుఖశాంతులు ప్రసాదించాలని ఆ పరమేశ్వరిని ప్రార్థిస్తున్నాను.

పండితులు, శ్రీవిద్యోపాసకులు, తత్త్వవేత్తలు, పరమేశ్వరి భక్తులు అందరూ నా యీ ప్రయత్నాన్ని మన్నించి నన్ను ఆశీర్వదింతురుగాక.

వృషనామ సంవత్సర పుష్య బహుళ
దశమి బుధవారం 6-2-2002

బుధజనవిధేయుడు
కోవి పార్థసారథి

# విషయసూచిక

# త్రిపురా రహస్యదీపిక

## 1. ప్రస్తావన

'నమస్కారం గురుదేవా !' రెండు గొంతులు ఒక్కసారిగా పలికేటప్పటికి ఉలిక్కిపడి తలఎత్తి చూశాడు రత్నాకరుడు. ఎదురుగా వినమ్రులై, చేతులు జోడించి నమస్కరిస్తూ నిలబడి ఉన్నారు తన శిష్యులు కృష్ణశర్మ, నారాయణభట్టు.

చాలాకాలానికి వచ్చిన శిష్యులను చూసి పరమానందభరితుడైనాడు రత్నాకరుడు. కుశలప్రశ్నల అనంతరము అడిగాడు 'ఏ పనిమీద వచ్చారు ?' అని.

"గురువర్యా ! ఇప్పటిదాకా మీ వద్ద ఉపనిషత్తులు చెప్పుకున్నాం, బ్రహ్మసూత్రాలు చెప్పుకున్నాం, శ్రీవిద్యలో అనేక గ్రంథాలను చెప్పుకున్నాం. ఇప్పుడు 'త్రిపురా రహస్యదీపిక' అనే జ్ఞానఖండాన్ని చెప్పుకుందామని వచ్చాం. కాబట్టి, కాదనక మమ్ములను కృతార్థులను చెయ్యండి" అన్నారు శిష్యులు.

ఆ మాటలకు, శిష్యుల యొక్క జ్ఞానజిజ్ఞాసకు ఆనందించినవాడై ఇవాల్టికి సెలవు తీసుకుని రేపు రండి అన్నాడు రత్నాకరుడు. అనుకున్న ప్రకారం మర్నాటి సాయంసమయాన వచ్చిన శిష్యులు, గురువుగారికి సాష్టాంగ ప్రణామాలర్పించి, ఆయన అనుమతితో సుఖాసీనులైనారు. రత్నాకరుడు అమితమైన ఆదరంతో తన శిష్యులకు 'త్రిపురా రహస్యదీపిక' అనే జ్ఞానఖండాన్ని అందించటానికి ఉద్యుక్తుడౌతున్నాడు.

**ఓం నమః కారణానంద రూపిణీ పరచిన్మయీ ।**
**విరాజితే జగచ్చిత్ర చిత్ర దర్పణ రూపిణీ ॥**

ఓంకార స్వరూపమైనది, చరాచర జగత్తుకు కారణభూతమైనది, పరబ్రహ్మ స్వరూపమైనది, దేశకాల వస్తువులచే పరిమితము కానిది, స్థావర జంగమాత్మకమైన జగత్తు అనే చిత్రమును ప్రతిబింబింపచేసే దర్పణము వంటిది, సర్వోత్కృష్టమైనది, మిక్కిలి ప్రకాశవంతమైనది అయిన ఆ త్రిపురాదేవికి నమస్కరిస్తున్నాను.

త్రిపురాదేవి – త్రిపురములకు అధిపతి, ముల్లోకములకు అధిపతి. భూలోక, భువర్లోక, సువర్లోకాలను ముల్లోకాలు అంటారు. మూడు లోకాలకు అంటే, జగత్తులో ఊర్ధ్వలోకాలు ఏడు, అధోలోకాలు ఏడు మొత్తం పద్నాలుగు లోకాలున్నాయి. వాటిలో ముఖ్యమైనవి మూడు. ఆ దేవి మూడు లోకాలకు అధిపతి అంటే మిగిలిన మొత్తం లోకాలకు కూడా ఆధిపత్యం ఆమెదే అనే మాట వేరే చెప్పనవసరం లేదు. కాబట్టి త్రిపురాదేవి అంటే – ఈ జగత్తుకంతటికీ అధిపతి అయిన పరమేశ్వరి అని అర్థం. ఆమె యొక్క మాహాత్మ్య శ్రవణం మోక్షదాయకం. ఆ పేరు తలచినంతనే పాపాలు పటాపంచలై పోతాయి. ఇక త్రిపురారహస్యదీపిక అనేది జ్ఞానఖండము. ఇది మహాద్భుత మైనది. దీనిని విన్నవారికి సుఖదుఃఖాలు ఉండవు. రాగద్వేషాలు నశిస్తాయి. మరుజన్మ ఉండదు. ఇది సర్వవేదాల సారము. సర్వమతాల అంటే శైవము, వైష్ణవము, సౌరము, గాణాపత్యముల యొక్క సారము. దీన్ని దత్తాత్రేయుడు పరశురాముడికి చెప్పాడు. దానిని నేను మీకు వివరిస్తున్నాను వినండి అంటూ త్రిపురా రహస్యదీపిక చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

'ఋచీకుడు' అనే మహర్షి కుమారుడు జమదగ్ని. జమదగ్ని కుమారుడు పరశురాముడు. ఇతని అసలు పేరు 'రాముడు' ఇతడు హిమాలయ పర్వతాలలో ఈశ్వరుణ్ణి గురించి ఘోరతపస్సు చేశాడు. ఆ తపస్సుకు మెచ్చి శివుడు ప్రత్యక్షమై ఈతనికి పరశువును బహుమతిగా ఇచ్చాడు. అప్పటినుంచి ఈ రాముడు పరశురాముడైనాడు.

గాధిరాజు కుమార్తె సత్యవతి. ఈమెను 'ఋచీకుడు' వివాహం చేసుకున్నాడు. ఈమె చాలా పతివ్రత. ఈమె భక్తికి మెచ్చి ఏదైనా వరం కోరుకోమన్నాడు ఋచీకమహర్షి. సత్యవతి ఆలోచించి తనకొక కుమారుడు, తన తల్లికి ఒక కుమారుడు కలిగేటట్లుగా వరమడిగింది. మహర్షి రెండు పాత్రలలో మంత్రజలాన్నిఇచ్చి చెరి ఒక పాత్ర త్రాగమన్నాడు. కాని ఆ పాత్రలను తీసుకునే సమయంలో పొరపాటున ఒకరిపాత్ర ఒకరు తీసుకోవటం జరిగింది. అది తెలుసుకున్న ఋచీకుడు సత్యవతితో, 'నీ గర్భాన క్షత్రియుడు, నీ తల్లిగర్భాన బ్రాహ్మణుడు జన్మిస్తారు అన్నాడు. ఆ మాటలకు విచారించిన సత్యవతి క్షత్రియుడు నా గర్భాన కాక, నా కుమారుని గర్భాన అవతరించేటట్లుగా అనుగ్రహించమని వేడుకున్నది. అనుగ్రహించాడు ఋచీకుడు. అప్పుడు సత్యవతి తల్లిగర్భాన పుట్టినవాడే విశ్వామిత్రుడు. సత్యవతి గర్భాన పుట్టినవాడు జమదగ్ని. జమదగ్ని కుమారుడు పరశురాముడు.

జమదగ్ని, ప్రసేనజిత్తుని కుమార్తె రేణుకను వివాహం చేసుకున్నాడు. ఈమెకు ఐదుగురు కుమారులు కలిగారు. అందులో ఆఖరువాడు రాముడు. రేణుక నీరు

తీసుకురావటానికి నదికి వెళ్ళి, ఆ నదిలో జలకాలాడుతున్న చిత్రరధుడనే గంధర్వుణ్ణి చూస్తూ అలా కొంతకాలము ఉండిపోయింది. దాంతో ఇల్లు చేరటం ఆలస్యమయింది. చిత్రరధునితో ఈమె వ్యభిచరించింది అని జమదగ్ని కోపించి, కుమారులను పిలిచి రేణుకను సంహరించమన్నాడు. వారందకు అంగీకరించలేదు. అందుకని వారిని భస్మంచేసి, చివరగా రాముణ్ణి పిలిచి తల్లిని సంహరించమన్నాడు. తండ్రి మాటకు ఎదురాడకుండా, తల్లిని సంహరించి, ఈ వార్తను తండ్రికి తెలియచేశాడు రాముడు. దానికి జమదగ్ని ఆనందించి ఏదైనా వరం కోరుకోమన్నాడు. తల్లిని, సోదరులను మళ్ళీ బ్రతికించమన్నాడు రాముడు. ఈ రకంగా రేణుక ఆమె పుత్రులు పునర్జీవితులైనారు.

హయహాయుడనే మహారాజు, జమదగ్ని మహర్షిని సంహరించాడు. భర్త శవంమీద పడి రేణుక విలపిస్తూ, ఇరవై ఒక్కసార్లు గుండెలు బాదుకున్నది. అది చూసిన పరశురాముడు ఇరవై ఒక్కసార్లు క్షత్రియులతో యుద్ధంచేసి, వారందర్నీ సంహరిస్తాను అని శపథం చేశాడు. అన్నమాట ప్రకారం ఇరవై ఒక్కసారి దండయాత్ర చేసి బాలురను, వృద్ధులను వదిలి మిగిలిన రాజులందర్నీ సమూలంగా నాశనం చేశాడు. ఈ రకంగా క్షత్రియ కులాన్ని నాశనం చేసిన పరశురాముడు, రామావతారంతో, తన అవతారం పరిసమాప్తి గావించి మోక్షగామియై దత్తాత్రేయుణ్ణి గురువుగా ఎంచుకున్నాడు.

అనసూయ, అత్రిమహర్షుల కుమారుడు దత్తాత్రేయుడు. అత్రిమహర్షి విష్ణువును గూర్చి తపస్సు చేయగా, విష్ణువు 'నేను నీకు దత్తుడనౌతాను' అన్నాడు. ఆ తరువాత త్రిమూర్తుల అంశతో అత్రి మహర్షికి ఒక కుమారుడు కలిగాడు. అతడే దత్తాత్రేయుడు. అందరికీ ఆత్మవిద్య బోధించినవాడు. గురుసంప్రదాయాన్ని లోకానికి అందించినవాడు. సద్గురువులందరికీ మూల పురుషుడు. గురువు అంటే అజ్ఞానపు చీకట్లను పారద్రోలేవాడు అని అర్థం.

**గుకారశ్చాంధకారస్తు రుకార స్తన్నిరోధకః ।**
**అంధకార వినాశిత్వాత్ గురురిత్య భిధీయతే ॥**

'గు' అంటే చీకటి. 'రు' అంటే దాన్ని పోగొట్టేది. అజ్ఞానపు చీకట్లను పారద్రోలి, జ్ఞానాన్నిస్తాడు కాబట్టే అతనికి 'గురువు' అని పేరు వచ్చింది. అందుచేతనే ముందుగా నా గురుదేవులు విరజానందనాథ, సదానందనాథ, శుకానందనాథులకు ప్రణమిల్లి, ధర్మసంస్థాపన కోసం ఏర్పాటయిన శృంగేరీ, బదరీ, ద్వారక, పూరి, కంచి, పుష్పగిరి, కుర్తాళం పీఠాధిపతులకు సాష్టాంగదండ ప్రణామాలాచరించి, గన్నవరం భువనేశ్వరీ

పీఠాధిపతులకు, గుంటూరు శృంగేరీ శ్రీవిరూపాక్ష పీఠాధిపతులకు వందనాలర్పించి, అవధూత శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానందస్వామి వారికి, విశ్వయోగి శ్రీశ్రీశ్రీ విశ్వంజీ మహరాజ్‌వారికి, శ్రీశ్రీశ్రీ వాసుదేవానందగిరిస్వామివారికి, శ్రీశ్రీశ్రీ మాతాశివచైతన్యవారికి, శ్రీశ్రీశ్రీ చంద్రకాళీప్రసాదమాతాజీ వారికి నమస్కరించి, హరితస గోత్రీకుడనైన క్రోవి పార్థసారథి అను నేను 'త్రిపురా రహస్యదీపిక' అనే జ్ఞానఖండాన్ని, అందరికీ అర్థమయ్యే రీతిలో, శులభశైలిలో వ్రాయటానికి ఉపక్రమిస్తున్నాను. జ్ఞానవృద్ధులు, వయోవృద్ధులు, పరమేశ్వరి భక్తులు, ఉపాసకులు, యోగులు, పండితులు, మోక్షగాములు అందరూ నా యీ సాహసాన్ని మన్నించి, నన్ను ఆశీర్వదింతురు గాక.

## 2. త్రిపురోపాసన - దీక్ష

దత్తాత్రేయుని ఎదురుగా కూర్చున్నాడు పరశురాముడు. ఏకాగ్రతతో గురువుగారు చెప్పేది వింటున్నాడు. దత్తాత్రేయుడు కూడా అమితవాత్సల్యముతో పరశురాముడికి త్రిపురా మాహాత్మ్యము అంతా వివరించాడు. విన్నాడు పరశురాముడు. భక్తి పారవశ్యంలో మునిగి పోయినాడు. బాహ్యప్రపంచాన్ని మరచిపోయాడు. తదేక ధ్యానంతో నిశ్చలంగా కూచున్నాడు. బాహ్యజ్ఞానము పూర్తిగా కలిగింది. శరీరంమీద రోమాలు పులకించాయి. నేత్రములనుండి ఆనంద బాష్పములు రాలుతున్నాయి. వళ్ళు జలదరిస్తోంది. తన స్థితి తనకు తెలియటంలేదు. అంతా ఆనందపారవశ్యం. వర్ణింపనలవి కానిది. అనుభవైక వేద్యం. ఆ స్థితిలోనే పరశురాముడు భక్తిపారవశ్యంతో గురువైన దత్తాత్రేయుడి పాదాలు రెండూ పట్టుకున్నాడు. సాష్టాంగప్రణామం చేశాడు. లేచాడు. మాట్లాడలేకపోతున్నాడు. ఆనందపారవశ్యంతో స్వరం గద్గదమవుతున్నది. అప్పుడు అంటున్నాడు "గురుదేవా! నేను ధన్యుణ్ణి. నిజంగా నా జన్మచరితార్థమైంది. మీ అనుగ్రహంవల్ల కృతకృత్యుడనైనాను". ఆ మాటలు విన్న దత్తాత్రేయుడు చాలా సంతోషించాడు. శిష్యుని యొక్క ఆనందముచూసి తాను మహదానందం పొందాడు. గురువు అంటే త్రిమూర్తి స్వరూపుడు. సాక్షాత్తూ పరబ్రహ్మయే. గురువు గనక సంతోషిస్తే మృత్యువుకూడా మన జోలికి రాదు. బ్రహ్మపదవి తృణప్రాయమవుతుంది గురుకృపచేత అంతా సిద్ధించినట్లే.

"ఓ గురుదేవా ! మీ దయవలన త్రిపురామహాత్మ్యము పూర్తిగా విన్నాను. ఇప్పుడు ఆ దేవిని ఉపాసించాలి అనుకుంటున్నాను. కాబట్టి నా మీద దయతో ఉపాసనాక్రమాన్ని వివరించండి" అని ప్రార్థించాడు.

శిష్యుడికి దీక్ష ఇవ్వాలి అంటే, శిష్యుడు ఆ విద్యకు అర్హుడో కాదో ముందుగా తేల్చుకోవాలి. పరశురాముడికి త్రిపురోపాసన మీద అమితమైన భక్తి శ్రద్ధలున్నాయి వాటిని పరిక్షించాడు దత్తాత్రేయుడు. శిష్యుడు దీక్షకు తగినవాడు అని నిర్ణయించుకున్న తరువాత అతడికి దీక్షనిచ్చాడు. త్రిపురోపాసన అనేది చాలా గొప్పది. దీక్షలన్నిటిలోకి చాలా ఉత్తమమైనది. తత్త్వాన్ని సంపూర్ణంగా బోధిస్తుంది. అటువంటి దీక్షను దత్తాత్రేయుడు పరశురాముడికి ఇచ్చాడు. ఉపాసనకు కావలసిన యంత్ర, మంత్ర, తంత్రాలను వివరంగా చెప్పాడు. సాక్షాత్తూ దత్తాత్రేయుడి ముఖం నుండి ఉపాసనాక్రమం తెలుసుకున్నందుకు పరమానందం చెందాడు పరశురాముడు. ఉపాసన ప్రారంభించాడు. గురువుకు ప్రదక్షిణ చేసి మహేంద్రగిరి చేరి అక్కడ పన్నెండు సంవత్సరాలు ఉపాసన చేశాడు. ఉపాసన కాలంలో కూడా నిత్యనైమిత్తిక కర్మలు, జపము, పూజ మొదలైనవన్నీ చాలా శ్రద్ధగా చేసేవాడు. సదా ఆ త్రిపురాదేవినే ధ్యానిస్తూ ఉండేవాడు.

ఈ రకంగా ఉపాసనతో పన్నెండేళ్ళు గడిపాడు. ఒకానొక రోజున ప్రశాంత వాతావరణంలో ఆశ్రమ ప్రాంగణంలో కూర్చుని ఉన్నాడు. ఎందుకో గతం గుర్తుకు వచ్చింది. చాలాకాలం క్రితం సంవర్తుణ్ణి ఏదో ఒక ప్రశ్న అడిగాడు. దానికి ఆయన సమాధానంకూడా చెప్పాడు. ఆయన చెప్పింది ఏమిటో అర్థం కాలేదు. కనీసం తాను అడిగింది ఏమిటో, ఆయన చెప్పింది ఏమిటో కూడా గుర్తు లేదు. ఇప్పుడు దత్తాత్రేయుడు త్రిపురా మహాత్మ్యము వివరించాడు. 'త్రిపురోపాసన' దీక్షనిచ్చాడు. అయినప్పటికీ సంవర్తుడు చెప్పినది అర్థం కాలేదు. ఆయనను సృష్టి విషయమై ఏదో ప్రశ్నించాడు. ఆయన చెప్పింది తనకు అర్థం కాలేదు. ఆలోచిస్తున్నాడు పరశురాముడు.

అంగిరసుడు బ్రహ్మమానస పుత్రుడు. ఇతడికి పదిమంది కుమారులు, ఎనిమిది మంది కుమార్తెలు కలిగారు. దేవగురువైన బృహస్పతి ఇతని కుమారుడే. బృహస్పతి తరువాతి వాడు సంవర్తుడు. పిచ్చివాడిలాగా అడవులలో తిరుగుతూ ఉండేవాడు.

మరుత్తు అనే మహారాజు సుగుణ సంపన్నుడు. ఆ రాజు ఒక యజ్ఞము చెయ్యాలి అనుకుని, ఆ యజ్ఞాన్ని చేయించవలసినదిగా బృహస్పతిని కోరాడు. ఇతడు యజ్ఞం చెయ్యటం ఇంద్రుడికి ఇష్టం లేదు. అందుకని ఇంద్రుడు ముందుగానే బృహస్పతి దగ్గరకు వెళ్ళి ఆ యజ్ఞం చేయించవద్దు అని చెప్పాడు. ఇంద్రుని మాట ప్రకారం బృహస్పతి యజ్ఞం చేయించను అన్నాడు. ఆ మాటలువిన్న మరుత్తు విచారంతో తిరగసాగాడు. అప్పుడు నారదుడు వచ్చి సంవర్తుణ్ణి అర్థించు. అతడు మహాపండితుడు, జ్ఞాని. అతడు వచ్చి నీ యాగం చేయిస్తాడు అని చెప్పాడు. మరుత్తు సంవర్తుణ్ణి ఆశ్రయించాడు. సంవర్తుడు సరేనన్నాడు. సంవర్తుడు యాగం చేయించటం ఇంద్రుడికి ఇష్టం లేదు. అందువల్ల

అనేక ఆటంకాలు కలిగించాడు, బెదిరించాడు. భయపెట్టాడు. అయినా బెదరలేదు. యజ్ఞం పూర్తి చేయించాడు సంవర్తుడు.

అసలు ఈ ప్రపంచం దేని నుంచి పుట్టింది ? ఎక్కడకు వెడుతోంది ? దేనిలో లయమవుతున్నది ? ఈ జగత్తు అంతా మిధ్య. ఈ మాట తెలిసికూడా జనులు వారి పనులు వారు చేస్తున్నారు. బాగా ఆలోచించి చూస్తే లోకవ్యవహారమంతా కూడా ఒక గ్రుడ్డివాడి చెయ్యి పట్టుకుని ఇంకొక గ్రుడ్డివాడు నడిచి వెడుతున్నట్లుంది. వాళ్ళందరిదాకా ఎందుకు? నా సంగతి చూస్తేనే తెలుస్తున్నది. బాల్యం ఎలా గడిచిందో గుర్తు లేదు. కౌమార, యవ్వన దశలు వేరువేరుగా ఉన్నాయి. ఇప్పుడు ఇంకొకరకంగా ఉన్నది. ఆ రోజుల్లో ఇరవై ఒక్కసార్లు రాజులమీద యుద్ధం ప్రకటించి, వారి వంశనాశనం చేశాను. పరమేశ్వరుణ్ణి గురించి తపస్సు చేసి భార్గవాస్త్రము, గండ్రగొడ్డలి పొందాను. మరి ఇప్పుడు ఈ రకంగా ఉన్నాను. ఎప్పుడు ఏ పని చేసినా అది మంచిపనే అని నమ్మి చేశాను. దేనివలన నాకు సుఖము కలగలేదు. మనం చేసిన పనికి ఫలితము ఏది అని భావిస్తున్నామో, అది ఫలితము కాదు. విమర్శ చెయ్యనంతవరకే ఆ ఫలితము. ఒక ఫలితము వచ్చిన తరువాత ఇంకొక దానికి ప్రయత్నిస్తున్నాము. అంటే మొదటిది ఫలం కాదనే కదా అర్థం. అది సంపూర్ణ ఫలాన్నిస్తే, ఇంకొకటి ఎందుకు ? అసలు ఈ పనులు మనం ఎందుకు చేస్తున్నాము ?

ఆ రకంగా కర్మలు చేసినందువల్ల దుఃఖనాశనము జరుగుతుందా ? కర్తవ్య శేషం ఉన్నంతవరకు దుఃఖం నాశనం కాదు. ఈ 'కర్తవ్యము' అనేది ఉన్నదే, అదే దుఃఖాలన్నింటికి మించిన మహాదుఃఖము. అది ఉన్నంతవరకు సుఖం కలగదు.

అయితే కర్తవ్యతాశేషమున్నప్పటికీ సుఖము కలుగుతున్నది కదా ? అంటారు. అది నిజం కాదు. ఒక వ్యక్తికి శరీరమంతా కాలిపోయింది. ఇప్పుడు అతడి పాదాలకు చల్లని మంచి గంధం రాస్తే అతడికి సుఖము కలుగుతుందా ? గుండెల్లో బాకు దిగబడి చావుబతుకుల్లో కొట్టుమిట్టాడుతున్న వాడిని అప్సరాంగన వచ్చి కౌగిలించుకుంటే అది సుఖంగా ఉంటుందా ? రోగంతో ఊపిరాడక దగ్గుతున్నవాడికి మంచి సంగీతం వినిపిస్తే అది వాడికి సుఖంగా ఉంటుందా ? లేదే ? మరి సుఖం అంటే ఏమిటి ? కోరికలన్నీ తీరిపోయి ఇంక చెయ్యవలసినది, అనుభవించవలసినది ఏమీ లేదు అని నిర్ణయించినప్పుడు, అంటే కర్తవ్యత లేనప్పుడు, అదే నిజమైన సుఖము.

కాబట్టి కర్తవ్యతా శేషమున్న మనిషికి సుఖము అంటే ఉరి తియ్యబోయేవాడికి పూలదండ వేసినందువల్ల వచ్చేసుఖమే. ఈ సుఖంవల్ల అతడికి ఆనందం కలగదు.

కర్తవ్యాలు, కోరికలూ అన్నీ తీరిపోయిన వారికే సుఖమనేది కలుగుతుంది. అంతేగాని బోలెడు కర్తవ్యం ముందుండగా, లోకయాత్రలో సుఖమున్నదని దాని కోసం ప్రయత్నిస్తుంటారు. ఇది చాలా విచిత్రమైన పరిస్థితి, కర్తవ్యము కొండలా వుంది. దాని క్రింద నలిగిపోతూ కూడా సుఖమున్నది అనుకుంటున్నాడు మానవుడు. సుఖదుఃఖాల అవగాహన పూర్తిగా లేకపోవటం చేత ఈ స్థితి కలుగుతోంది.

ఈ లోకంలో చక్రవర్తి మొదలు భిక్షకుని వరకూ అందరూ ప్రతిరోజూ సుఖం పొందటానికి ప్రయత్నిస్తూనే ఉన్నారు; సుఖం పొందుతూనే ఉన్నారు. కాని అందరి సుఖము ఒకలాగా ఉండదు. ఎవరి సుఖము వారిది. రాజు విలాసాలతో, విందులతో సుఖం పొందితే, భిక్షకుడు గంజిత్రాగి త్రోవపక్కన చెట్టుక్రింద సుఖం పొందుతాడు. ఈ రకంగా సుఖం పొందుతూ తాము కృతకృత్యులమయ్యామని అందరూ అనుకుంటూనే ఉన్నారు. వారికిమల్లేనే నేను కూడా నడుస్తున్నాను. అంధకూపన్యాయం లాగా వారిని అనుసరిస్తున్నాను. అంధకూపన్యాయము అంటే గ్రుడ్డి వాళ్ళు ఒకరిచెయ్యి ఒకరు పట్టుకుని వరుసగా పోతున్నారు. ముందువాడు ఒక నూతిలో పడ్డాడు. మిగిలినవారికి కూడా ముందు ఏముందో తెలియదు కాబట్టి అందరూ నూతిలోనే పడతారు. నేను అసలు తెలివి లేకుండా, ఆలోచన లేకుండా ఈ పనులు చేస్తున్నాను. ఇప్పుడు నా గురువు దగ్గరకు మళ్ళీ వెళ్ళి, గురుపాదాలు ఆధారంగా ఈ దుఃఖ సాగరాన్ని దాటుతాను" అని నిర్ణయించుకున్నవాడై బయలుదేరి గంధమాదన పర్వతంమీద ఉన్న గురువును సమీపించాడు. ఆ సమయంలో గురువైన దత్తాత్రేయుడు ధ్యానంలో ఉండి కోటిసూర్యుల కాంతితో ప్రకాశిస్తున్నాడు. గురువుకు సాష్టాంగ ప్రణామం చేశాడు పరశురాముడు.

శిష్యుణ్ణి లేవదీసి వాత్సల్యంతో కుశలప్రశ్నలు వేశాడు దత్తాత్రేయుడు. గురుస్పర్శతో ఊరటచెందినవాడై, "గురుదేవా ! మీ దయకు పాత్రుడైన వాడికి ఇంకా కోరికలు, కష్టాలు అనేవి ఉండవు. నదీతీరంలో ఉన్నవాడికి, నీటి కరువుండదు కదా! నా మనసు సదా మిమ్ములనే తలస్తూ ఉంటుంది. ఇప్పుడు నాకు మిమ్మల్ని చూడాలనిపించింది. ఇక్కడికి వచ్చాను. స్వామీ ! చాలాకాలం నుండి ఒక్క అనుమానం నన్ను పీడిస్తోంది. మీ దగ్గర దాన్ని నివృత్తి చేసుకుంటాను. మీరు అనుమతిస్తే, నా సంశయము వివరిస్తాను" అన్నాడు పరశురాముడు. .

ఆ మాటలు విన్న దత్తాత్రేయుడు. "భార్గవా ! నీ గురుభక్తికి, జిజ్ఞాసకూ చాలా ఆనందించాను. నీ సంశయము ఏమిటో అడుగు. దాన్ని తీరుస్తాను" అన్నాడు. అంటూ మొదటి అధ్యాయాన్ని పూర్తి చేశాడు రత్నాకరుడు.

## 3. పరశురాముని ప్రశ్న

"గురువుగారూ ! పరశురాముడు దత్తాత్రేయుని పాదాలు పట్టుకుని బ్రతిమాలితే, అతని గురుభక్తికి మెచ్చి ఏం కావాలో కోరుకోమన్నాడు కదా! అప్పుడు ఏమయింది? పరశురాముడు ఏమడిగాడు ?" అంటూ ప్రశ్నించాడు కృష్ణశర్మ. సమాధానం చెబుతున్నాడు రత్నాకరుడు.

గురువు అనుజ్ఞ అయిన తరువాత, అతని పాదాల చెంతకూర్చుని, అతివినయంతో చేతులు జోడించి అడుగుతున్నాడు పరశురాముడు.

"కరుణానిధీ ! ఓ గురుదేవా ! నువ్వు సాక్షాత్తూ పరమేశ్వరుడవు. సర్వజ్ఞుడవు. నీకు తెలియనిది లేదు. పూర్వకాలంలో కార్తవీర్యుని కుమారుడు నా తండ్రి అయిన జమదగ్నిని సంహరించాడు. నా తండ్రితో పాటుగా సహగమనం చెయ్యటానికి నా తల్లి సిద్ధపడింది. అది చూసిన నాకు విపరీతమైన కోపం వచ్చింది. దాంతో క్షత్రియవంశ నిర్మూలన చేస్తాను, అని శపథం చేసి ఇరవై ఒక్కసార్లు దండయాత్ర చేసి, గర్భంలో ఉన్న పిండంతో సహా క్షత్రియ సంహారం చేశాను. క్షత్రియుల రక్తంతో నిండిన సరస్సులో నా పితృదేవతలకు తర్పణలు వదిలాను. నా భక్త్యతిశయములు చూసి పితృదేవతలు సంతసించారు. వారి కోరిక మీద నేను కూడా శాంతించాను. ఆ తరువాత అయోధ్యాధీశుడు దశరథనందనుడు అయిన శ్రీరామునితో యుద్ధానికి తలపడ్డాను. ఆయన సాక్షాత్తూ శ్రీ మహావిష్ణువు అని గుర్తించలేకపోయాను. అతడు నన్ను ఓడించాడు. నా శక్తిని హరించేశాడు. నా తేజస్సును తనలో లీనం చేసుకున్నాడు. నా గర్వాన్ని పోగొట్టాడు. దయతలచి, చివరకు నన్ను ప్రాణాలతో వదలిపెట్టాడు. ఈ రకంగా అవమానం పొందిన నాకు నిర్వేదం కలిగింది. ఎంతగానో దుఃఖించాను.

తిరిగి వస్తున్నాను. త్రోవలో అవధూత సంవర్తుడు కనిపించాడు. ఇది అనుకోకుండా జరిగింది. అతడు మహాజ్ఞాని. నివురుకప్పిన నిప్పులా ఉన్నాడు. నేను ఆ మహానుభావుణ్ణి గుర్తించగలిగాను. దాహంతో ఉన్నవాడికి చల్లని నీరు దొరికినట్లుగా, ఆయన దర్శనము నాకు సుఖము కలుగచేసింది.

ఆయన తన మధురమైన మాటలతో తత్త్వము అంతా నాకు వివరించాడు. ఆయన్ను నేను ఏమీ అడగలేకపోయాను. అయినప్పటికి నాకు తత్త్వాన్ని మళ్ళీ బోధించమని ప్రార్థించాను. అప్పుడు ఆయన నన్ను దత్తాత్రేయుడి దగ్గరకు పొమ్మన్నాడు. నేను తిరిగి తిరిగి మీ దగ్గరకు చేరాను. మీ పాదాలనాశ్రయించాను. ఇప్పుడు గ్రుడ్డివాడు చూచేటందుకు వీలుగా అంజనము దొరికినంత ఆనందం కలిగింది.

గురువర్యా, సంవర్తుడు చెప్పినది నాకు ఏమీ అర్థం కాలేదు. ఇప్పుడు త్రిపురా మహాత్మ్యము పూర్తిగా విన్నాను. నా మనస్సంతా ఆ దేవతామూర్తితో నిండిపోయింది. ఆ పరమేశ్వరి మీ రూపంలో సాక్షాత్కరించింది. స్వామీ ! సంవర్తుడు ఏం చెప్పాడో తెలుసుకోకుండా ఏ ఉపాసన చేసినా, ఏ కర్మ ఆచరించినా ఫలితము ఉండదు అనిపిస్తోంది. గతంలో నేను అనేక కర్మలు చేశాను. భూరిదక్షిణలు ఇచ్చాను. రాసులకొద్దీ అన్నదానం చేశాను. ఇంద్రాదిదేవతలకు హవిస్సులు కూడా బాగానే ఇచ్చాను. అయితే కర్మలవల్ల కలిగే ఫలితము చాలా తక్కువ అని సంవర్తుడు చెప్పాడు. ఆ ఫలితాలన్నీ దుఃఖ హేతువులు. అటువంటి గొప్పకర్మల వల్ల వచ్చే ఫలితము అల్పమే అయినప్పుడు, సాధారణ కర్మలవల్ల ఫలితము ఏమిటనేది వేరే చెప్పాలా? అసలు దుఃఖము అంటే సుఖము లేకపోవటంకాదు. అల్పమైన సుఖము నశించిన తరువాత కలిగే దుఃఖము. ఇది ఇదివరకటి దుఃఖము కన్న ఎక్కువగా ఉంటుంది. దాన్ని అసలు భరించలేము. కాబట్టి అల్పసుఖమే అసలైన దుఃఖము. ఈ కర్మలవల్ల ఉత్తర జన్మలు ఉంటాయి. కాబట్టి మృత్యువునుండి తప్పుకోలేము. అనగా దుఃఖాన్ని మించిన భయం మృత్యుభయం దాన్నుంచి తప్పించుకోలేము.

త్రిపురోపాసన అనేది పరదేవతకు సంబంధించినది. అందువలన దుఃఖము కలగదు అంటారు. అది నిజం కాదు. ఎందుకంటే 'ఉపాసన' అనేది ఒక మానసిక క్రియ. అంటే అదికూడా ఒక కర్మే. మిగిలిన కర్మలకన్న అది వేరైనది కాదు. అందుచేతనే ఉపాసనకూడా చిన్న పిల్లలు ఆడుకునే ఆటలాగా నిష్ప్రయోజనమైనది. కర్మలు చెయ్యవచ్చు. చెయ్యకపోవచ్చు. అలాగే ఉపాసనలు కూడా. సాలగ్రామాన్ని పూజించవచ్చు. లేదా బాణాన్ని (శివలింగాన్ని) పూజించవచ్చు. వారి ఇష్టం. ఇవన్నీ క్రతువులవంటివే. వీటివల్ల వచ్చే ఫలితంకూడా శాశ్వతం కాదు. ఈ రకంగా ఫలితమే అసత్యమైనప్పుడు, క్రతువు మాత్రం సత్యం ఎలా అవుతుంది ? అసత్యమైనవి సత్యమైన ఫలితమునియ్యలేవు కదా ? వాటిని జీవితాంతం చేసినట్లైతే ఫలితముంటుంది. అని కొందరంటారు. అలా అయితే ఈ కర్మలకు, ఉపాసనలకు అంతం అనేది ఉండదు కదా ! మరి సంవర్తుడు ఏ విచారము లేకుండా ఉన్నాడు. కర్తవ్యము అనే భయంకర అగ్నిజ్వాలలనుంచి బయటపడ్డాడు. లోకవ్యవహారం చూసి నవ్వుతున్నట్లున్నాడు. అభయమైన మార్గాన్ని ఆశ్రయించి, మండిపోతున్న అడవిలో, చల్లని నీటిలో జలకాలాడే ఏనుగులాగా సుఖంగా ఉన్నాడు. కర్తవ్యము లేక ఆనందముగా ఉన్నాడు. కర్తవ్యము లేనంతమాత్రంచేత అతడు సుఖవంతుడా ? అనవచ్చు. ఈ లోకంలో కర్తవ్యమే మహాదుఃఖానికి కారణము. కర్తవ్యము లేని దశ - సుషుప్తి. ఆ దశలో సుఖము కనిపిస్తోంది కదా ? కర్తవ్య త్యాగమువల్ల సంవర్తుడు ఈ స్థితి ఏ విధంగా పొందగలిగాడు?

గతంలో కనిపించినప్పుడు ఆయన నాకు ఏం చెప్పాడు ? ఓ గురుదేవా ! దత్తాత్రేయా ! ఆ విషయాలన్నీ సవిస్తరంగా నాకు వివరించు. కర్తవ్యము అనే కాలసర్పము నన్ను మ్రింగబోతోంది. దాన్నుంచి నన్ను కాపాడు." అంటూ గురువుగారి పాదాలు పట్టుకున్నాడు పరశురాముడు. శిష్యుడికి మోక్షేచ్ఛ కలిగింది అని తెలుసుకున్నవాడై, గురువైన దత్తాత్రేయుడు చెప్పటం ప్రారంభించాడు.

## 4. బాటసారుల కథ

నాయనా ! భార్గవా ! నీకు జ్ఞానం కలిగింది. నువ్వు ధన్యుడవైనావు. సముద్రంలో మునిగిపోతున్న వాడికి ఆధారం దొరికినట్లుగా, సంసార సాగరంలో పడికొట్టుకుంటున్న నీకు జ్ఞానం లభించదయ్యా. కర్మలవల్ల వచ్చే ఫలితము చాలా తక్కువ అని, అది వ్యర్థము అని అంటున్నావే, ఆ కర్మల వల్లనే నీకీ స్థితి లభించింది. కర్మలవల్ల ఇంతవరకే సిద్ధిస్తుంది.

అందరి హృదయాలలోనూ ఉండేది ఆ త్రిపురాదేవి. ఆమె దహరాకాశరూపిణి. దహరాకాశంలో ఉంటుంది. "అమ్మా ! నువ్వు తప్ప నాకు వేరే దిక్కు లేదు." అంటూ ఆ తల్లిని ఆశ్రయించిన భక్తుని హృదయంలో మాత్రమే ఇటువంటి జ్ఞానము కలుగుతుంది. అదే మోక్షమార్గము ఈ మార్గాన్ని అవలంభించిన వారికి మరణము ఉండదు. భార్గవా ! పిశాచము ఆవహించిన వాడికి ఏ రకంగా సుఖము ఉండదో, అదే విధంగా కర్తవ్యత - చేయవలసినది ఉన్నది అనుకునే మానవుడికి కూడా సుఖము ఉండదు. కర్తవ్యత అనే కాలసర్పం కరచినవాడి సమస్తనాడుల్లోనూ విషజ్వాలలు వ్యాపిస్తాయి. అటువంటి వాడికి శుభము ఏ రకంగా కలుగుతుంది ? కర్తవ్యత అనే విషసంబంధంచేత ఈ లోకమంతా గ్రుడ్డిదైపోయి ఏ పనివల్ల తనకు మేలు కలుగుతుందో తెలుసుకోలేకపోతోంది. తనకు హితవును కూర్చే సాధనాలు వదలి ఇతరవాటిని పట్టుకుంటోంది. ఈ రకంగా లోకం భయంకరమైన విషసముద్రంలో పడికొట్టుకుంటున్నదయ్యా. దీనికి ఉదాహరణగా ఒక కథచెబుతాను వినవలసినది.

పూర్వకాలంలో కొందరు బాటసారులు త్రోవన పోతూ పోతూ వింధ్యపర్వతాలు చేరారు. ఉదయంనుంచి నడిచినడిచి బాగా అలసిపోయారు. వాళ్ళకి చాలా ఆకలి వేసింది. అక్కడ వాళ్ళకి విషముష్టి చెట్లు కనిపించాయి. వాటి పళ్ళు చూసి 'తుమ్మిక' ఫలములు అనుకున్నారు. బాగా ఆకలిగా ఉన్నారేమో పళ్ళు కోసుకొని కడుపారా తిన్నారు. ఆకలిమీద వారికి రుచికూడా తెలియలేదు. ఆ పళ్ళలోని విషం వారి శరీరంలో ప్రవేశించింది. చూపు మందగించింది. అయితే తాము తుమ్మిక ఫలములు తినటంవల్ల శరీరంలో బాగా

వేడిచేసి ఈ రకంగా జరిగింది అనుకుని, ఆ తాపం తగ్గించటానికి మందుకోసం వెతక సాగారు. అలా వెతుకుతుండగా ఉమ్మెత్త చెట్లు కనిపించాయి. ఉమ్మెత్తకాయలు చూసి నిమ్మకాయలనుకున్నారు. వాటిని కోసి బాగా తిన్నారు. దానివల్ల పిచ్చి బాగా ముదిరింది. దట్టమైన అడవిలో త్రోవ తెలియక, మతి చెడి తిరిగుతున్నారు. కళ్ళు కనిపించటం లేదు. గోతులలో పడుతున్నారు. ముళ్ళకంపలలో చిక్కుతున్నారు. వళ్ళంతా ముళ్ళ గుచ్చుకుని రక్తం కారుతోంది. ఉన్మాదావస్థలో ఒకరినొకరు తిట్టుకుంటున్నారు. పోట్లాడు కుంటున్నారు. చేతులతో, రాళ్ళతో, కర్రలతో కొట్టుకుంటున్నారు. వళ్ళంతా రక్తసిక్తమైనది.

అలా పోతూ పోతూ ఒక పట్టణం చేరారు. రాజద్వారం దగ్గరకు వచ్చారు. లోపలికి వెళ్ళబోయారు. ద్వారపాలకులు అడ్డగించారు. అది ఏ దేశమో తెలియదు. రాజెవరో తెలియదు. అయినప్పటికి ద్వారపాలకులతో పోట్లాటకు దిగారు. కావలివాళ్ళు వాళ్ళని పట్టుకుని మెత్తగా తన్నారు. చేసేందేంలేక నాలుగువైపులకూ పరుగెత్తారు బాటసారులు. అలా పరుగెడుతూ, కొందరు అగడ్తలలో పడిపోయి, వాటిలోని మొసళ్ళకు ఆహారమైనారు. కొందరు అగడ్తలలోని నీటిలోపడి చచ్చిపోయారు. కొంతమందిని ద్వారపాలకులు ప్రాణాలతో పట్టుకున్నారు.

ఓ పరశురామా ! లోకహితము అనే భ్రమతో, కర్తవ్యము అనబడే విషానికిలోనై, మోహాంధులై పోతున్నారయ్యా మానవులు. నువ్వు ఆ అంధకారంలోనుంచి బయటపడ్డావు. ధన్యుడవైనావు భార్గవా ! ధన్యుడవైనావు.

## 5. బ్రాహ్మణుని కథ

పరమశ్రేయస్సు అనబడే ఆ మహాసౌధాన్ని పొందటానికి 'విచారము' అంటే - విమర్శ, వివేచనము అనేది మొదటి మెట్టు. అదే అన్నింటికీ మూలము. మంచి విచారణ గనకలేకపోతే ఎవరికీ, ఎప్పుడూ క్షేమం కలగదు. విచారము అనేది అన్నింటినీ మించినటువంటిది. ఈ విచారణ లేనందువల్లనే జనం మోహానికి దాసులౌతున్నారు. విమర్శించి చూసేవాడు అన్ని విషయాలలోనూ విజయాన్ని సాధిస్తాడు. విచారణ లేకపోవటంచేతనే రాక్షసులు పరాజయంపాలైనారు. జాగ్రత్తగా ఆలోచన చేసిన దేవతలు అన్నివిధాలా సుఖము పొందారు. విష్ణువు యొక్క అండతో శత్రువులను జయించారు. విచారణ చేయటంవల్లనే మానవుడు తోటివారందరిలోనూ ప్రత్యేకత సంపాదించు కుంటున్నాడు. ఈ రకంగా విచారణచేసే బ్రహ్మ గొప్పవాడైనాడు. శ్రీరాముడు సుగుణ సంపన్నుడైనప్పటికీ, బుద్ధిమంతుడైనప్పటికీ, విచారణ చేయకపోవటంవల్లనే బంగారు

లేడి యందు కోరికగలవాడై అనేక కష్టాలు పొందాడు. అదే రాముడు ఆలోచన చేసినందు వల్లనే సముద్రం మీద శేతువు నిర్మించి రాక్షసగణాన్ని నిర్మూలించగలిగాడు.

సృష్టికారకుడు బ్రహ్మ. అతడుకూడా యుక్తాయుక్త వివేచన చెయ్యకపోవటంవల్లనే, అతని శిరస్సు ఛేదించబడింది. అదే విధంగా సరిగా ఆలోచించకపోవటం చేతనే శివుడు భస్మాసురుడికి వరమిచ్చి, అతనికి భయపడి పారిపోయాడు. మరి విష్ణువు భృగుపత్నిని వధించి భూలోకంలో అనేకసార్లు జన్మించేటట్టుగా శాపం పొందాడు. ఈ రకంగా దేవతలు, రాక్షసులు, నరులు అందరూ సరియైన విచారణ చెయ్యకపోవటంవల్లనే అనేక కష్టాలు పొందారు.

కాబట్టి ఓ భార్గవా ! ఎప్పుడూ విచారణాశీలురుగా ఉండేవాళ్ళే ధీరులు, మహాత్ములు అవుతున్నారు. విచారణ చేసినవారు అన్ని కష్టాలనుండి గట్టెక్కుతున్నారు. విచారణ చేసేవాడికి కష్టాలు ఉండవయ్యా.

ఆ త్రిపురాదేవి అనుగ్రహం కలగనిదే ఎవరికీ విచారణ చేద్దాము అనే బుద్ధి కలగదు. సద్విచారము కావాలంటే ఆ దేవిని ఆశ్రయించాలి. అప్పుడు ఆ దేవి సంతుష్టి చెంది, సాధకుని యొక్క హృదయాకాశంలో సూర్యునిలాగా ప్రకాశిస్తుంది. ముందుగా సద్గురువువద్ద దీక్ష తీసుకోవాలి. ఆ గురువు చెప్పిన విధంగా త్రిపురాదేవిని ఆరాధించాలి. ఈ ఆరాధనకు నిర్మలమైన భక్తి, శ్రద్ధ ఉండాలి. ఈ త్రిపురా మాహాత్మ్యము వినటంవల్ల ఈ భక్తి శ్రద్ధలు కలుగుతాయి. ఆ కారణంచేతనే నీకు ముందుగా త్రిపురా మాహాత్మ్యమును గురించి వివరించాను. ఆ కారణంచేతనే నీకు ఈ మేలు కలిగింది. విచారము శ్రేయస్సుకు మూలము. అది పుట్టనంతవరకూ మహాభయం కలుగుతూనే ఉంటుంది. నిత్యమూ దేవతారాధన చేసేవాడికి కూడా, విచారణ చేసేదాకా ఏదో ఒక భయం ఉంటూనే ఉంటుంది. మోక్షసాధనానికి సంబంధించిన విచారణ చేస్తేనే జన్మసాఫల్యం కలుగుతుంది. విచారణలేని జన్మలు ఎన్ని ఎత్తినప్పటికీ, అవి అన్నీ వ్యర్థమే అవుతాయి. విమర్శలేని జనులు బావిలో కప్పలవంటివారు. బావిలో కప్ప అందులోనే పుడుతుంది. అందులోనే చస్తుంది. దానికి మంచి, చెడు తెలియవు. అలాగే విమర్శలేనివారు మంచి చెడు తెలుసు కోలేరు. కష్టాలనే వారు సుఖము అనుకుంటారు. ఈ రకంగా అజ్ఞానులై సంసార సాగరంలో పడి కొట్టుమిట్టాడుతుంటారు. భోగభాగ్యాలు, భార్యాపుత్రులు ఇవన్నీ దుఃఖానికి హేతువులు అయినప్పటికీ మానవులు వాటిని వదలలేరు.

భార్గవా ! ఒకసారి వరదవచ్చి ఊరంతా మునిగిపోయింది. ఊళ్ళో వారందరూ ముటాముల్లెసర్దుకుని వలసపోతున్నారు. ఆ ఊళ్ళో ఒక బ్రాహ్మణుడున్నాడు. అతడు

మహాపండితుడు. ఇంట్లో ఉన్న నగదు, నట్రా సర్దుకుని, తన భార్యా పిల్లలతో అతడు కూడా బయల్దేరాడు. వరద ఉధృతి పెరుగుతోంది. నీటిలోతు హెచ్చింది. కుమార్తె మునిగిపోతోంది. భార్య దుఃఖంతో కేకపెట్టింది 'ఏమండీ' అమ్మాయి మునిగిపోతోంది.' 'పోనీలే ఇంకో అమ్మాయి పుడుతుంది' అంటూ పిల్లను వదిలేశాడు. కొంత దూరం పోయేసరికి మళ్ళీ కేకవేసింది భార్య 'కుమారుడు మునిగిపోతున్నాడు' 'పోనీలే ! ఇంకొకడు పుడతాడు' అంటూ పిల్లవాణ్ణి వదిలేశాడు. భార్యను మాత్రం జాగ్రత్తగా పట్టుకుని, నగదు మూట బుజాన పెట్టుకుని నడుస్తున్నాడు. నీరు పెరుగుతోంది. 'ఏమండీ, నేను కూడా మునిగిపోతున్నాను' అంది భార్య ! 'ఇంకో పెళ్ళి చేసుకుంటాను' అంటూ భార్యను వదిలేశాడు నగదు మూటను మాత్రం నెత్తికి ఎత్తుకున్నాడు. ఇంకొంత దూరం పోయేసరికి నీటి ఉధృతి బాగా పెరగసాగింది. నడవలేకపోతున్నాడు. పైగా మూట ఒకటి. ఇక లాభం లేదు బ్రతికుంటే ఏ విధంగానైనా ధనం సంపాదించుకోవచ్చు. అనుకుని మూటను కూడా వదిలి ఎలాగో ఒక చెట్టు ఎక్కి ప్రాణాలు మాత్రం దక్కించుకున్నాడు. జమదగ్ని కుమారా ! మానవుడు దేన్నీ వదులుకోలేడయ్యా, మగ గాడిదను చూడు. ఆడగాడిద వెనక కాళ్ళతో తంతున్నప్పటికీ దాని వెనకే వెడుతుంది. అలాగే ఎన్ని కష్టాలను అనుభవిస్తున్నప్పటికీ, అజ్ఞానులు సంసారాన్ని మాత్రం వదలిపెట్టరు.

కానీ నువు మాత్రం విచారణ చేశావు. ఆ దేవి అనుగ్రహం కలిగింది. శోకసాగరాన్ని దాటావు." అన్నాడు అంటూ రెండవ అధ్యాయం పూర్తి చేశాడు రత్నాకరుడు.

## 6. సత్పురుష సాంగత్యము

'గురుదేవా ! విచారణ లేకపోతే ఉపయోగం లేదన్నారు కదా ! మరి తరువాత ఏం జరిగింది?' అని ప్రశ్నించాడు కృష్ణశర్మ. సమాధానం చెబుతున్నాడు రత్నాకరుడు.

గురువుగారి మాటలు విన్న పరశురాముడు దత్తాత్రేయునితో "స్వామీ ! అజ్ఞానమువల్ల లోకంలోని జనులంతా నాశనమవుతున్నారు. దేవీ మాహాత్మ్యం వింటే మనసులో విచారం ప్రారంభమవుతుంది. విచారము వల్ల శ్రేయస్సు కలుగుతుంది. అయితే నాకు మాత్రం ఆ మాహాత్మ్యం వినటం మీదనే చిన్న అనుమానం కలుగుతున్నది. మాహాత్మ్యం వింటే వివేకం కలుగుతుంది. నిజమే. మరి మహాత్మ్యం వినాలంటే ఏం చెయ్యాలి ? దానికి సాధన ఏమిటి ? మిగిలిన వాటిలాగానే మహాత్మ్యం వినటంకూడా స్వాభావికమేనా ? అలా అయితే అందరూ దాన్ని వినాలి కదా? నన్నే తీసుకోండి. ఇప్పటి దాకా నేను కూడా ఆ మాహాత్మ్యం వినలేదు కదా ? కష్టాలు వచ్చినప్పుడే దాన్ని వింటామా ? అలా

అయితే శ్రీరాముడి చేతిలో ఓడిపోయినప్పుడే నేను ఆ మాహాత్మ్యము వినాలి కదా ? ఆ తరువాత కొంత కాలానికిగాని నేను దాన్ని వినలేదు. పోనీ మిగిలినవారిని చూడండి. నాకన్న ఎక్కువ కష్టాలు పడుతున్నవారు, అవమానాలు ఎదుర్కొంటున్నవారు అనేకమంది ఉన్నారు. మరివాళ్ళంతా ఆ మాహాత్మ్యమును ఎందుకు వినటం లేదు ? ఈ విషయం నాకు సవివరంగా తెలియచెయ్యండి" అన్నాడు. ఆ మాటలు విన్న దత్తాత్రేయుడు చెబుతున్నాడు.

"భార్గవా ! సత్పురుషుల సాంగత్యమే శ్రేయస్సుకు ముఖ్య కారణం. దానివల్ల అన్ని దుఃఖాలు పోతాయి. ఇక పరమార్థం లభించటానికి సత్సంగమే బీజం. నువ్వు సంవర్తుని సాంగత్యము పొందావు. ఆయన మహానుభావుడు. అందుచేతనే నీకు శ్రేయోమార్గమవ లభించే స్థితి వచ్చింది. ఇలాంటి స్థితిలో సత్పురుషులే పరమసుఖాన్ని ఇస్తారయ్యా ! కాబట్టి సత్సంగము లేనిదే ఎవరూ శ్రేయస్సును పొందలేరు. ఈ లోకంలో ఎవరితో సాంగత్యం చేస్తే, వారి లక్షణాలే మనకు కూడా వస్తాయి. మంచివారితో సాంగత్యం ఉంటే మంచి లక్షణాలు చెడ్డవారితో సాంగత్యం ఉంటే చెడ్డ లక్షణాలు వస్తాయి. ఇందులో సందేహం ఏ మాత్రం లేదు. దీనికి ఉదాహరణగా ఒక కథ చెబుతాను వినవలసినది.

## 7. హేమలేఖ

పూర్వకాలంలో దశార్ణదేశాన్ని 'ముక్తాచూడుడు' అనే మహారాజు పాలిస్తున్నాడు. అతనికి ఇద్దరు కుమారులు. పెద్దవాడు హేమచూడుడు. చిన్నవాడు మణిచూడుడు. వీరిద్దరూ కూడా మంచి రూప, గుణ సంపన్నులు. విద్యావిశారదులు. ఒకసారి వారిద్దరూ సైన్యాన్ని వెంటపెట్టుకుని వేటకోసమని సహ్యాద్రి మీద ఉన్న అడవికి వెళ్ళారు. అక్కడ క్రూరజంతువులనేకమున్నాయి. రాకుమారులు ధనుర్బాణాలు ధరించి పులులు, సింహాలు, అడివి పందులు మొదలైన జంతువులనేకం సంహరించారు. ఇంతలో ఉన్నట్టుండి పెద్దగాలి, వాన వచ్చాయి. భయంకరమైన వర్షం. ఆకాశంనుంచి రాళ్ళు పడుతున్నాయా అన్నట్టుంది. కన్ను పొడుచుకున్నా ఏమీ కనపడటం లేదు. అంతా కారుచీకట్లు క్రమ్ముకున్నాయి. అడవిలో చెట్లు ఎక్కడున్నాయో, రాళ్ళు, రప్పలు, గోతులు ఏవి ఎక్కడ ఉన్నాయో కూడా తెలియటంలేదు. కటిక చీకటి. పైపెచ్చు పైనుండి రాళ్ళు పడుతున్నట్లుగా వర్షం.

సైనికులంతా భయపడిపోయి దొరికినచోట తలదాచుకున్నారు. రాకుమారుల గుర్రాలు అదుపుతప్పి పెద్దగా సకిలిస్తూ పరుగెత్తటం ప్రారంభించాయి. ఈ గందరగోళంలో హేమచూడుని అశ్వం అరటి, కర్జూరపు చెట్లతో కూడిన ఒక ముని ఆశ్రమం చేరింది. ఆ ఆశ్రమంలో శుభలక్షణాలు కలిగి అతిలోక సౌందర్యవతి లాగా ఉన్న కన్యనొకదానిని

చూశాడు హేమచూడుడు. ఆమె శరీరము మేలిమిబంగారమువలె ప్రకాశిస్తోంది. ఆమెను చూడగానే నోటమాట రాలేదు రాకుమారుడికి. కొంతసేపు అలానే ఉండి, చివరకు ఏదో విధంగా శరీరం స్వాధీనంలోకి తెచ్చుకుని "ఓ ఇంతీ ! నీ తల్లితండ్రులెవరు ? ఇంత అందంగా ఉన్న నువ్వు, భయంకరమైన ఈ అరణ్యంలో ఒంటరిగా ఎందుకున్నావు?" అని ప్రశ్నించాడు.

ఆ మాటలు విన్న కన్యకామణి ఈ విధంగా అన్నది. "రా కుమారా ! తాపసులమైన మాకు అతిధిపూజ ధర్మమయ్యా నీకు స్వాగతం పలుకుతున్నాను. రా ! ఈ ఆసన మలంకరించు. ముందు నా ఆతిథ్యాన్ని స్వీకరించు. సేదతీర్చుకో. ఆ తరువాత నా కథ చెబుతాను" అంది. మారు మాటాడకుండా ఆమె ఆతిథ్యం స్వీకరించాడు హేమ చూడుడు. ఆ సుందరాంగి తన వృత్తాంతం చెప్పటం మొదలుపెట్టింది.

'వ్యాఘ్రపాదుడు' అనే ఆయన ఒక మహర్షి, గొప్ప శివభక్తుడు. తన తపోబలంతో పుణ్యలోకాలన్నీ జయించాడు. ఆయన బ్రహ్మజ్ఞాని. మునిశ్రేష్టుడు. నేను ఆయన కుమార్తెను నా పేరు హేమలేఖ.

కొంతకాలం క్రితం 'విద్యుత్ప్రభ' అనే పేరుగల విద్యాధరి నదీ స్నానం చెయ్యటానికి భూలోకానికి వచ్చింది. అదే సమయంలో 'సుషేణుడు' అనే మహారాజు కూడా ఈ ప్రాంతానికి వచ్చాడు. ఆ రాజు అలా తిరుగుతూ, నదిలో జలకాలాడుతున్న విద్యాధరిని చూశాడు. అర్ధనగ్నంగా ఉన్న ఆమెను చూడగానే రాజు మోహవశుడైనాడు. ఆ క్షణంలో రాజు వివశుడై, తన కోర్కెనంగీకరించమని విద్యుత్ప్రభను కోరాడు. ఆమె అతడి కోరికనంగీ కరించింది. రాజు తన కోర్కె తీర్చుకుని వెళ్ళిపోయాడు. తత్ఫలితంగా విద్యుత్ప్రభ గర్భవతి అయింది. ప్రసవానంతరము తన బిడ్డను నదితీరంలో వదిలేసి వెళ్ళిపోయింది. నదీ స్నానానికి వచ్చిన వ్యాఘ్రపాదుడు ఆ పసిగుడ్డును చూసి, జాలిపడి తెచ్చి పెంచుకున్నాడు. ఆ పసిపాపనే నేను. ముని నన్ను ధర్మంగా పెంచాడు కాబట్టి అతడే నా తండ్రి. నేను ఆయనకు సేవ చేస్తూ ఉంటాను. దుష్ప్రవర్తన, దుర్మార్గపు ఆలోచన గలవారు ఇక్కడికి రాలేరు. ఇక్కడికి దుష్టబుద్ధి గల మానవులు, దేవతలు, రాక్షసులు ఎవరూ చేరలేరు. ఒకవేళ చేరితే నాశనమైపోతారు. నువ్వు ఇక్కడికి చేరావంటే సద్గుణ సంపన్నుడవే అయి ఉండాలి. రాకుమారా ! కొద్దిసేపట్లో నా తండ్రి వస్తాడు. ఆయన్ను దర్శించి, నీ కోర్కె తీర్చుకుని రేపు వెళ్ళు" అన్నది.

రాకుమారుడు తొలిచూపులోనే ఆమెను ప్రేమించాడు. కాని ఆ మాట చెప్పటానికి భయపడి మాట్లాడకుండా ఉండిపోయాడు. విషయాన్ని గ్రహించిన విద్యుత్ప్రభ ఈ రకంగా అంటున్నది.

"రాజా, ధైర్యంగా ఉండు. నా తండ్రి చాలా మంచివాడు. నీ కోరిక తప్పక తీరుస్తాడు." ఇంతలో వ్యాఘ్రపాదుడు రానే వచ్చాడు. వచ్చీ రావటంతోనే విషయమంతా గ్రహించిన వాడై మహర్షి, హేమచూడునికి తనకుమార్తెనిచ్చి వివాహం చేశాడు. కొడుకు, కోడలును చూసిన ముక్తాచూడుడు కూడా జరిగిన దానికి చాలా ఆనందించి నూతన దంపతులకు స్వాగతం పలికాడు.

ఇక రాకుమారుడు అందాలరాశి, కోరుకున్న సుందరాంగితో పగలు రాత్రి భేదం లేకుండా సుఖిస్తున్నాడు. కాని హేమలేఖ మాత్రం ఈ సుఖాలయందు పెద్దగా ఆసక్తి చూపకుండా ఉదాసీనంగా ఉంటోంది. రాకుమారుడు ఈ విషయం గ్రహించాడు. ఒకరోజు రహస్యంగా "ప్రేయసీ, నేను నీ యందు చాలా అనురాగముతో ఉన్నాను. మరినువ్వు అలా కనిపించటంలేదు. ఈ భోగాలయందు నీకు ఎందుకు ఆసక్తి లేదు ?ఎందుకు ఉదాసీనంగా ఉంటున్నావు ? నీకు ఆసక్తి లేకపోతే, నాకు మాత్రం సుఖము ఎలా ఉంటుంది? నేనేమో నీ మీద కోరికతో ఉన్నాను. నువ్వు పరధ్యానంలో ఉన్నావు. ఎన్నిసార్లు పిలిచినా పలకవు. నేను నిన్ను కౌగిలించుకున్నప్పటికీ, నీకావిషయం చాలాసేపటికిగాని తెలియటంలేదు. నేను వచ్చిన చాలాసేపటికి అసలు నేను ఎప్పుడు వచ్చాను అని అడుగుతున్నావు. అతి అందమైన వస్తువులు చూసినప్పటికీ, వాటిమీద నీకు ఆసక్తి ఉండటం లేదు. నేనెప్పుడు వచ్చినా, నువు మాత్రం ఈ సుఖాలమీద ఇష్టం లేనట్లు ఉంటున్నావు. ఇంక నాకు సుఖమెక్కడినుంచి వస్తుంది. కొయ్యబొమ్మతో సుఖించగలనా? నీకేమయింది ? నీ కోర్కె తీర్చటంకన్న నాకు వేరే కోరిక ఏమీ లేదు. నా ప్రాణములకన్న నువు ప్రియమైనదానివి. నువు ఇలా ఎందుకుంటున్నావు ? నేనేం చెయ్యాలి ? ఆ విషయం చెబితేనే నాకు ఆరాటం తగ్గుతుంది. కాబట్టి దయచేసి చెప్పవలసినది" అంటూ ప్రాధేయపడ్డాడు. అని చెప్పి మూడవ అధ్యాయాన్ని ముగించాడు రత్నాకరుడు.

## 8. సుఖస్వరూపం

గురువుగారూ ! ఆ విదంగా అడిగిన హేమచూడుడికి, హేమలేఖ ఏ సమాధానం చెప్పింది ? అంటూ ప్రశ్నించాడు నారాయణభట్టు. సమాధానం చెబుతున్నాడు రత్నాకరుడు.

తనను కౌగిలించుకొని ఉన్న హేమచూడుడు అడిగిన ప్రశ్నలన్నీ విన్నది హేమలేఖ. భర్తకు జ్ఞానబోధ చెయ్యాలి అనుకుని ఈ విధంగా ప్రారంభించింది. "రాకుమారా ! నాకు నీయందు విరక్తి అనేది లేదయ్యా. అసలు ఈ లోకంలో ఏది ప్రియము ? ఏది అప్రియము ? ఈ విషయాన్ని గురించి ఎప్పుడూ ఆలోచన చేస్తూనే ఉంటాను. అయితే

నా మనసు మాత్రం ఈ విషయంలో ఒక నిశ్చయానికి రావటం లేదు. కాబట్టి నాకు ప్రియమేదో, అప్రియమేదో వివరించు" అన్నది.

ఆ మాటలు విన్న హేమచూడుడు పెద్దగా నవ్వి, "స్త్రీలు మూఢచిత్తులు. వివేకహీనులు అని అంటారు. నిన్ను చూసిన తరువాత అది నిజమే అని తెలుస్తోంది. ప్రియమేది ? అప్రియమేది ? అనేవాటికి సమాధానం మానవులకే కాదు పశుపక్ష్యాదులకు కూడా తెలుసును. ఆ విషయం తెలుసు కాబట్టే ప్రియమైన విషయాలు ఆచరిస్తున్నాయి. అప్రియమైన వాటిని వదిలివేస్తున్నాయి. ఇందులో పెద్దగా ఆలోచించవలసినది ఏదీ లేదు. దేనివలన సుఖము కలుగుతుందో అది ప్రియము. దేనివల్ల దుఃఖము కలుగుతుందో అది అప్రియము." అన్నాడు.

రాకుమారుని మాటలు విన్న హేమలేఖ ఈ విధంగా అంటోంది. "మహారాజా ! స్త్రీలకు సద్విమర్శ చేసే శక్తి ఉండదు. వారు మూఢచిత్తులు. వారికి ఆలోచన ఉండదు. నిజమే నువ్వు బాగా చదువుకున్నవాడివి. దక్షతగలవాడివి. కాబట్టి నాకు ఈ ఒక్క విషయాన్ని వివరించు. నువ్వు గనక నాకు ఈ విషయం వివరిస్తే, ఇంక పనికిరాని ఆలోచన మానేసి నీతో సర్వసుఖాలు అనుభవిస్తాను. రాజా ! సుఖం కలుగచేసేది ప్రియము, దుఃఖము కలుగచేసేది అప్రియము అన్నావు. బాగా ఆలోచించే ఈ విషయం చెప్పావు. అయితే దేశకాలమాన పరిస్థితులననుసరించి ఒకే వస్తువు సుఖాన్ని, దుఃఖాన్ని కూడా కలుగచేస్తుంది. ఉదాహరణకు నిప్పు ఉన్నది. చలికాలములో అది ప్రియమైనది. వేసవిలో అప్రియమైనది. అలాగే భోగభాగ్యాలు, భార్య, పిల్లలు ఉంటే సుఖము, లేకపోతే దుఃఖము అంటావా ? మరి నీ తండ్రి ముక్తాచూడ మహారాజుకు ఇవన్నీ ఉన్నాయి. కాని నిరంతరము ఏదో ఒక విషయం మీద బాధపడుతూనే ఉన్నాడు కదా. భోగభాగ్యాలు లేని వారందరూ ఈ రకంగా బాధపడటంలేదే. ఇక సుఖాలిచ్చే భోగాలు లెక్కలేనన్ని ఉన్నాయి. వీటన్నింటినీ పొందిన వాడెవడున్నాడు? అల్పమైన భోగసాధనలవల్ల దుఃఖమే కలుగుతుంది. దుఃఖంతో కలిసి ఉన్న సుఖము నిజమైన సుఖము కాదు. ఇక దుఃఖము రెండు రకాలు.

**1) అంతరము :** కోరికలవల్ల కలిగేది.

**2) బాహ్యము :** శరీరంలోని ధాతులోపంవల్ల కలిగేది.

రాజా ! ఈ రెండింటిలోనూ మానసిక దుఃఖమే ఎక్కువ కష్టాన్ని కలిగిస్తుంది. జగత్తునంతటనూ ఆవరించి పీడిస్తున్నది ఇదే. కోరిక అనేది దుఃఖము అనే వృక్షానికి మూలబీజం. కోరికలు లేకపోతే దుఃఖముండదు. స్వర్గంలో సకలభోగాలు అనుభవిస్తున్న

ఇంద్రాదిదేవతలకన్న ఎన్నో రెట్లు సుఖాలనుభవిస్తున్న స్వర్గాధిపతి ఇంద్రుణ్ణి చూడు. అహల్యమీద కోరికతో పోయి శాపం కొని తెచ్చుకున్నాడు. చాలా కోరికలు మిగిలి ఉండగా, ఏదో ఒక కోరిక తీరటంతో వచ్చే సుఖం ఆనందాన్నివ్వలేదు. తీరని కోరికలున్నప్పుడు కలిగే సుఖము అల్పసుఖమే అవుతుంది. అటువంటి సుఖము క్రిమికీటకాలకు కూడా ఉంటుంది. క్రిమికీటకాలకు కొద్ది కోరికలే ఉంటాయి. వాటిలో ఏ కొన్ని తీరినా వాటికి సుఖంగానే ఉంటుంది. కాని మానవుల విషయంలో అలాకాదు. వీరికి కోరికలు అనంతములు. కొన్ని కోరికలు తీరటంవల్ల వాటికి కలిగే సుఖం కటిక చీకటిలో మిణుగురు పురుగు వెలుతురువంటిది. దానివల్ల ప్రయోజనం లేదు.

అగ్నిలో శరీరమంతా కాలిపోయిందనుకో, అప్పుడు ఒక గంధపుచుక్క మీద పడినంతమాత్రాన శరీరమంతా చల్లబడుతుందా ? రాజా! రతిక్రీడవల్ల సుఖం లభిస్తుంది అంటావా ? క్రీడానంతరము అలసట కలుగుతోంది కదా ? క్రీడానంతరము బరువు మోసిన పశువుకు కలిగే బడలిక మాటేమిటి ? ఇదంతా సుఖమేనా? రతిక్రీడలో మానవు లేనా ? కుక్కలు కూడా ఈ రకమైన సుఖాన్ని అనుభవిస్తున్నాయి కదా ? పోనీ సౌందర్యాన్ని చూసినందువల్ల సుఖం కలుగుతుంది. ఇది పశుపక్ష్యాదులకుండదు. అంటావా ? సౌందర్య దర్శనంవల్ల కలిగే సుఖం కేవలం అభిమానంవల్ల కలిగేదే. అదికూడా కలలో స్త్రీ సంగమమం వలన కలిగే సుఖంలాంటిదే. స్త్రీతో పొందే సుఖం కూడా కేవలము మన మనసుకు సంబంధించినదే కాని వేరుకాదు. దీనికి ఉదాహరణగా ఒక కథ చెబుతాను వినవలసినది.

## 9. రాజపత్నికథ

పూర్వకాలంలో ఒక రాకుమారుడు ఉండేవాడు. అతడు చాలా అందగాడు. అపరమన్మథుడు ఇంకొక రకంగా చెప్పాలంటే మన్మథుడి కన్నా కూడా అందగాడు. అతని భార్యకూడా మిక్కిలి సౌందర్యవతి.

వారిరువురూ రతీమన్మథుల లాగా కనిపించేవారు. రూపవతి అయిన భార్యయందు రాకుమారుడు అమితమైన అనురాగం కలిగి ఉండేవాడు. అయితే ఆమె మనసు మాత్రం తన దగ్గర పనిచేస్తున్న ఒక సేవకుని యందు లగ్నమయింది. ఆ సేవకుడు చాలా తెలివిగలవాడు. ప్రతిరోజూ రాకుమారుడు పుష్కలంగా మద్యం సేవించేవాడు. పూర్తిగా మత్తులో మునిగిపోయిన తరువాత, రాకుమారుడి వద్దకు వికృతరూపంగల పరిచారికను పంపేవాడు ఆ మత్తులో రాకుమారుడికి తనవద్ద ఉన్నది ఎవరో తెలిసేదికాదు. ఆ

సమయంలో సేవకుడు మాత్రం జగదేకసుందరి అయిన యువరాణితో గడిపేవాడు "లోకైక సుందరి అయిన నా భార్యతో స్వర్గసుఖాలనుభవిస్తున్న నేను ఎంత ధన్యుణ్ణి. నా అంత అదృష్టవంతుడు ఈ లోకంలో ఇంకొకడు లేడు. ఆమే నా ప్రాణము. నా జీవము. ఆమె లేకుండా నేను బ్రతకలేను" అనుకునేవాడు రాకుమారుడు. ఈ విధంగా చాలారోజులు గడిచినాయి.

ఒక రోజున ఆ సేవకుడు మద్యము అక్కడ ఉంచి అత్యవసరమైన పనిమీద బయటకు వెళ్ళాడు. ఆ రోజు రాకుమారుడు కూడా ఎక్కువగా మద్యం సేవించలేదు. మోహావేశుడై ఉన్నాడు. రతిక్రీడమీద మక్కువతో, మనసుకు ఆహ్లాదకరమైన భోగసామాగ్రితో అందంగా అలంకరించబడిన శయ్యాగృహం చేరాడు రాకుమారుడు. ఆ శయ్యామందిరం ఇంద్రుని నందనోద్యానవనంలాగా ఉంది. ప్రక్కమీద తన ప్రేయసి తన కోసం ఎదురుచూస్తోంది. ఒక్కసారిగా ఆమెను చేరాడు. రెట్టించిన ఉత్సాహంతో, కామోద్రేకంతో, వళ్ళుమరచి మిక్కిలి సంతోషంతో ఆమెను అనుభవించాడు. కొంతసేపటికి ఆవేశం చల్లారింది. మైకం తగ్గింది. అప్పుడు చూశాడు. శయ్యమీద ఉన్నది. అందాలరాసి అయిన తనప్రేయసి కాదు. వికృతరూపం కలదాసి, అతడికి చాలాకోపం వచ్చింది. ఆపుకోలేకపోయాడు. తన భార్య ఏమైంది. నువ్వెందుకు ఇక్కడ ఉన్నావని దాసినడిగాడు. అతడు మత్తులో లేడు. వెంటనే ఎడమచేత్తో దాసి జుట్టు పట్టుకుని, కుడిచేత్తో కత్తి తీసుకుని, నిజం చెప్పకపోతే చంపేస్తానన్నాడు.

దాసి భయపడింది. ప్రాణభిక్ష పెట్టమని అర్థించింది. చప్పుడు చేయకుండా రాకుమారుణ్ణి రాణి నివాసానికి తీసుకువెళ్ళింది. అక్కడ శయ్యాగారంలో రాకుమారుని భార్య. అందాలరాసి, బంగారుబొమ్మ మంచంమీద నల్లగా, మొరటు ముఖము, రోత కలిగించే రూపము, పిల్లి కళ్ళు, రాగి జుట్టుతో అసహ్యకరంగా ఉండే సేవకుని బాహువులలో నలిగిపోతోంది. వారికి బాహ్యస్మృతి లేదు. మన్మధ సామ్రాజ్యంలో విహరిస్తున్నారు.

ఆ స్థితిలో వారిని చూశాడు రాకుమారుడు. చేతితో పట్టుకున్న దాసిని వదిలేశాడు. నోటమాట రావటం లేదు. శరీరం పని చేయ్యటం లేదు. మూర్ఛవచ్చినంత పనైంది. కొంతసేపటికి తేరుకున్నాడు. మనసు నిబ్బరం చేసుకుని ఈ విధంగా అనుకుంటున్నాడు.

నేను మూర్ఖుడిని. మదమత్తుడిని. స్త్రీలపట్ల అత్యంత ఆసక్తి, ప్రేమ చూపే పురుషులు అధమాధములు. గోరువంకలు ఏ చెట్టుమీదా శాశ్వతంగా ఉండవు. అలాగే స్త్రీలు కూడా చంచలస్వభావం కలవారే. ఇంతకాలము ఆమె నా ప్రాణముకన్న మిన్న అని నమ్మాను వేశ్యలు ఏ ఒక్కరినీ అంటిపెట్టుకుని ఉండరు. అదే విధంగా కామినులు కూడా ఒకరినే

ఆశ్రయించి ఉండరు. అటువంటి కామినులను నమ్మే నాబోటివాడు బుద్ధిలేని గాడిదకన్న హీనుడు. ఇంతవరకు స్త్రీల స్వభావము తెలుసుకోలేకపోయాను. ఈమె యందు సంపూర్ణానురాగముతో ఉన్నాను. అటువంటి నన్ను వదిలి సేవకునితో సుఖిస్తున్నది. నాయందు కపటప్రేమ నటిస్తోంది. మద్యపానముచే మతిమందగించిన నాకు ఈమె నాటకము తెలియలేదు. నన్ను నీడలా అనుసరించి ఉన్నది అని నమ్మి మోసపోయాను. ఇప్పటిదాకా చూడటానికి కూడా వికారంగా ఉండే దాసితో సుఖించాను. నాకన్న మూర్ఖుడు ఈ లోకంలో ఇంకెవరూ ఉండరు. చాలా ఆశ్చర్యమైన విషయము నేను చాలా అందగాడిని. మహారాజును అటువంటి నన్ను వదిలి వికారంగా ఉన్న నీచుడైన సేవకుడితో ఈమె సుఖిస్తున్నది. దీనికి కారణమేమిటి ? ఇతనిలో ఈమెకు కనిపించిన సౌందర్యమేమిటి ? అని పరిపరివిధముల ఆలోచించినవాడై రాకుమారుడు జీవితంమీద విరక్తిచెంది, సర్వస్వాన్ని త్యజించి అడవులకు వెళ్ళిపోయాడు.

రాకుమారా ! హేమచూడా ! ఇంతకాలము ఆ రాజకుమారుడు ఆనందడోలికలలో తేలియాడాడు. స్వర్గపు అంచులదాకా వెళ్ళాడు. కాని తాను సుఖించింది కురూపి అయిన దాసితో, అని తెలిసిన మరుక్షణమే అతని ఆనందం కాస్తా పటాపంచలైపోయింది. కాబట్టి సౌందర్యమనేది కేవలము మనస్సులోంచి పుట్టినదే తప్ప వేరుకాదు." అంటూ రాజపత్ని కథ చెప్పింది హేమలేఖ.

## 10. విద్యానగరము

"గురువుగారూ ! రాజపత్ని కథ చెప్పిన తరువాత ఏంజరిగిందో తెలియచెయ్యండి" అన్నాడు కృష్ణశర్మ. చెప్పటం మొదలుపెట్టాడు రత్నాకరుడు.

ఆ విధంగా రాజపత్ని కథ చెప్పిన తరువాత కూడా హేమలేఖ ఇంకా చెబుతున్నది.

రాజా ! నా సౌందర్యాన్ని చూసి నువ్వెంత ఆనందిస్తున్నావో, నాకన్న వికృతంగా ఉన్న స్త్రీలను చూసినప్పుడు కూడా ఇతరులు అంత ఆనందాన్ని పొందుతున్నారు. ఇంకా చెప్పాలంటే అంతకన్న ఎక్కువ ఆనందంకూడా పొందుతున్నారు. రాజా ! మానవుడు చూసేది బాహ్యసౌందర్యం కాదు. మానసికమైన సౌందర్యము. కామప్రకోపం కలిగినప్పుడు మానవుని మనోభావాలను పరిశీలిస్తే ఈ విషయం అర్థమవుతుంది.

మానవుడు అతి సౌందర్యవతిని బాహ్యప్రపంచంలో చూస్తాడు. ఆమె ప్రతిబింబం అతనిలో ముద్రించబడుతుంది. ఆమె రూపాన్ని మాటిమాటికీ భావన చేస్తాడు. ఇలా చెయ్యటంవల్ల అతడిలో కోరికలు పుడతాయి. అతడిలో కామవాంఛ పెరుగుతుంది. ఈ

భావన గనక లేకపోతే కామవాంఛ కలగదు. అందుకనే కామం కలగటానికి సౌందర్యభావనే మూలకారణము. అతిలోకసుందరిని చూచినప్పటికీ యోగులకు, చిన్నపిల్లలకు కామవాంఛ కలగదు. దీనికి కారణము వారిలో ఆ భావన లేకపోవటమే. కాబట్టి మానవుడు తన ఊహాసుందరిని తలచుకొనే భావోద్రేకుడౌతాడు. అలా కాకుండా కేవలము బాహ్యసౌందర్యం వల్లనే అయితే, ఈ లోకంలో అందవిహీనులు, వికారులు, కురూపులతో ఏ మగవాడూ కాపురం చెయ్యడు గదా!

అందవిహీనులను సౌందర్యరాసులుగా ఏ విధంగా భావిస్తాడు అని అనుమానం కదా. దీనికి సమాధానం విను. లోకం చాలా విచిత్రమైనది. కాముకులకు అతినీచమైన, అసహ్యకరమైన మలమూత్రాదులతో అపరిశుభ్రమైన జననేంద్రియంలో కూడా అత్యంత సౌందర్యం కనిపిస్తుంది. జననేంద్రియాలలో కూడా సౌందర్యం ఉంటే, ఇంక సౌందర్యం లేనిచోటు ఎక్కడైనా ఉంటుందా ? కాబట్టి సౌందర్యమనేది మనఃకల్పితము. సౌందర్యం ఉన్నదనే అభిమానంవల్లనే సుఖం కలుగుతుంది. ఈ సౌందర్యం సహజసిద్ధమైనదే అయితే, అది బాలురకుకూడా కనిపించాలి కదా? మరి వారికి కామవికారం కలగటం లేదు కదా.

అంతదాకా ఎందుకు రాజా ? లోకంలో రకరకాల ఆకారాలు గల మానవులున్నారు. ఒకే కాలున్నవారు, ఒకే చెయ్యి ఉన్నవారు, వ్రేలాడే చెవులున్నవారు, అశ్వముఖులు, కోతిమూతి గలవారు, అసలు ముక్కేలేనివారు, శరీరమంతా వెంట్రుకలున్నవారు, అసలు వెంట్రుకలే లేనివారు, ఎర్రజుట్టుగలవారు, తెల్లజుట్టు గలవారు, నల్లనివారి, ఎర్రనివారు, ఈ రకంగా రకరకాలవారున్నారు. నువు నాతో సుఖించినట్లే, వారుకూడా మరి స్త్రీలతో సుఖిస్తున్నారు కదా. రాజా ! అందమైన స్త్రీ శరీరాన్ని చూసి పండితులుకూడా చలించి పోతున్నారు కదా. అలాగే స్త్రీలుకూడా పురుష శరీరము చూసి కామవశులౌతున్నారు. మరి ఆ శరీరము యొక్క యదార్థస్థితి ఏమిటో ఒక్కసారి ఆలోచించి చూడు.

శరీరము అంటే రక్తము, మాంసము, ఎముకలు, మలము, మూత్రములతో నిండినది. చర్మముతో కప్పబడినది. శుక్రశోణితముల వల్ల పుట్టినది. మూత్రద్వారము నుంచి బయటకు వచ్చినది. ఈ దేహము మీద ఏలనయ్యా మమకారము. ఎంత విచిత్రమో చూడు. తుచ్ఛమైన ఈ శరీరం మీద మానవుడు మక్కువ చూపిస్తున్నాడు. మరి మానవుడికీ, మలముమీద ప్రాకే పురుగుకూ తేడా ఏమిటి ? రాకుమారా ! ఈ శరీరము నీకు చాలా ఇష్టమైనది కదా ! దీనిలోని వివిధభాగాలు విశ్లేషించి చూడు. వివిధ రకాల పదార్థాలను మనం తింటున్నాము. మనం తిన్నదంతా మలంగా మారిపోతోంది. ఈ విషయం అందరికీ తెలిసినదే కదా ! ఇది యదార్థ స్వరూపం. మరి ప్రియము, అప్రియము ఏమిటి ?

ఆ మాటలు విన్న హేమచూడుడికి విషయ వాంఛల మీద అసహ్యం కలిగింది. తన భార్య చెప్పిన విషయాలను తరచి తరచి చూసి విరాగియైనాడు.

ఆ తరువాత హేమచూడుడు తన ఆత్మస్వరూపమయిన త్రిపురాదేవి గురించి హేమలేఖ ద్వారా తెలుసుకున్నాడు. సర్వమూ తానే అయి జీవన్ముక్తుడైనాడు. ఆ తరువాత అతని తమ్ముడు మణిచూడుడు, తండ్రి ముక్తాచూడుడు కూడా హేమచూడుని నుంచి పరతత్త్వాన్ని గురించి తెలుసుకున్నారు. హేమచూడుని తల్లి కోడలైన హేమలేఖ ద్వారా పరతత్త్వాన్ని గ్రహించింది. ఈ రకంగా ఆ పట్టణంలోని వారందరూ జ్ఞానులైనారు. చివరకు ఆ పట్టణమే బ్రహ్మపురమైంది. అక్కడ చిలుకలు గోరువంకలు కూడా బ్రహ్మజ్ఞానాన్ని ఉపదేశిస్తున్నాయి. చరాచర జగత్తంతా పరబ్రహ్మచేతనే ప్రవర్తిల్లుచున్నది. అంతా బ్రహ్మమయం జగత్తులోని అణువణువులోనూ పరమేశ్వరుడున్నాడు. నాకు, ఆ పరమేశ్వరుడికి భేదం లేదు. బ్రహ్మను తెలుసుకున్నవాడు కూడా బ్రహ్మమే. నేనే పరబ్రహ్మను, అంటూ అక్కడి పక్షులు కూడా జ్ఞానబోధ చేస్తున్నాయి.

వామదేవాది మహర్షులు ఆ బోధను విని, ఆ నగరమందు విద్య (జ్ఞానము) బాగా వ్యాపించింది, కాబట్టి దానికి "విద్యానగరము" అని నామకరణం చేశారు. కాబట్టి పరశురామా! హేమలేఖవంటి వారి సజ్జనసాంగత్యము వలన ఆ పట్టణమంతా జ్ఞానమయమైంది. అందుచేత సత్సంగము సర్వశ్రేయస్సులకూ మూలము" అంటూ దత్తాత్రేయుడు తన శిష్యుడైన పరశురాముడికి చెప్పాడని చెబుతూ నాల్గవ అధ్యాయాన్ని పూర్తిచేశాడు రత్నాకరుడు.

## 11. శాశ్వత సుఖం

సత్సంగమువల్ల వచ్చే ఫలితము ఏమిటో దత్తాత్రేయుడు తన శిష్యుడైన పరశురాముడికి వివరించాడు కదా ! ఆ తరువాత ఏం జరిగిందో వివరించండి అన్నాడు నారాయణభట్టు చెబుతున్నాడు రత్నాకరుడు.

దత్తాత్రేయుడు చెప్పిన విషయాన్ని పూర్తిగా విన్న పరశురాముడు. అమితానందం చెంది ఈ రకంగా అడుగుతున్నాడు. "సత్సంగమువల్ల అనేకశుభాలు జరుగుతాయి అని మీరు చెప్పిన విషయమంతా నిజం. అది నేను సంవర్తుని సాంగత్యంవల్ల ప్రత్యక్షంగా అనుభవించాను. మనం ఎటువంటివారితో సాంగత్యం చేస్తే అటువంటి ఫలితమే దక్కుతుంది. ఒక్క హేమలేఖవల్ల ఆ నగరంలోని స్త్రీలంతా జ్ఞానులైనారు. అజ్ఞాని అయిన హేమచూడుడికి ఆమె ఏ రకంగా జ్ఞానబోధ చేసిందో నాకు వివరించండి" అన్నాడు.

ఆ మాటలు విన్న దత్తాత్రేయుడు ఈ విధంగా చెప్పసాగాడు. "నాయనా! పరశురామా! నీకు ఒక కథ చెబుతాను విను. హేమలేఖ చెప్పినదాన్ని బట్టి విషయాలన్నీ రసహీనములు అని గ్రహించాడు హేమచూడుడు. వాటన్నింటియందు అతడికి అయిష్టత కలిగింది. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ ఉండేవాడు. ఏదో దుఃఖంలో ఉన్నట్లుగా కనిపించేవాడు. ఈ భోగభాగ్యాలు చాలాకాలంగా అతను అనుభవిస్తున్నాడు. వాటికి అలవాటు పడిపోయాడు. అందుకని వాటిని వదలిపెట్టటం కొంచెం కష్టమే అయింది. వాటిని వదలలేక, అనుభవించనూ లేక, భార్య చెప్పినమాటలను కాదననూలేక చాలా ఇబ్బంది పడ్డాడు. ఈ రకంగా కొన్ని రోజులు ఆలోచిస్తూ గడిపాడు. మొదట్లో అయితే భార్యమాటలు నెమరువేసుకుంటూ తనను తాను నిందించుకుంటూ, ఆ సుఖాలు అనుభవించేవాడు. వాసనావేగంవల్ల విషయాలకోసం ప్రాకులాడేవాడు. వాసనలు మూడు రకాలు. 1. లోకవాసన, 2. శాస్త్రవాసన 3. దేహవాసన. వీటినే త్రివిధ వాసనలు అంటారు. ఇంతలోనే ప్రియురాలిమాటలు గుర్తుకు వచ్చేవి. ఈ భోగములన్నీ క్షణికములు. ఈ మాటలు గుర్తురాగానే మాటిమాటికీ దుఃఖించేవాడు. ఈ రకంగా అతని మనసు ఊగిసలాడేది. భోజ్యపదార్థాలు, వస్త్రాలు, ఆభరణాలు, స్త్రీలు, వాహనాలు, మిత్రులు, ఎవరూ అతనికి ఊరట కలిగించలేకపోయారు. సర్వస్వాన్నీ పోగొట్టుకున్న వాడిలాగా ఎప్పుడూ దుఃఖిస్తూ ఉండేవాడు. ఈ కోరికలు, భోగాలు వేటినీ వదలనూలేడు. అలా అని అనుభవించనూ లేడు. ఈ రకంగా బాధపడుతున్న భర్తను చూసి హేమలేఖ ఒక రోజున "నాథా ! నువ్వు గతంలో లాగా ఉత్సాహంగా లేవు. ఎందుకో దుఃఖిస్తున్నావు. శారీరకమైన బాధ ఏదైనా ఉన్నదా ? భోగాలు అనుభవించటంవల్ల కొన్ని దోషాలు కలుగుతాయని చెబుతారు. అవివాత, పిత్త, కఫదోషాలు. వీటినే త్రివిధదోషాలు అంటారు. అటువంటిది ఏమైనా జరిగిందా ? ఇవి గనక సమంగా లేకపోతే రోగాలు వస్తాయి. ఆహార వ్యవహారాదుల వల్ల ఇవి కలుగుతాయి. రోగకారణం తెలియకుండా మందు వాడలేముకదా ! కాబట్టి నీ బాధకు కారణము ఏమిటో తెలియచెయ్యవలసినది." అన్నది.

ఆ మాటలు విన్న హేమచూడుడు తన భార్యను చూసి "అసలు నువ్వు ఎవరవు ? నీ వృత్తాంతమేదో నాకు వివరించవలసినది." అన్నాడు. హేమలేఖ వివరించటం మొదలుపెట్టింది.

అసతి, అజ్ఞానము, అవిద్య అనేది ఉన్నదే అది రకరకాలైన ఆశ్చర్యకరమైన వాటిని సృష్టించగలదు. నా తల్లిలేని సమయంలో అంటే నా తల్లికి తెలియకుండా ఆ అసతి, నా చెలికత్తె (బుద్ధి)తో స్నేహం చేసింది. ఈ అసతి, అజ్ఞానము అనేది బుద్ధికి స్నేహితురాలు.

ఇదే మాయ. చెలికత్తెయే బుద్ధి. అంటే అజ్ఞానము బుద్ధితో కలిసింది. బుద్ధి అంటే జ్ఞానము. అసతి అజ్ఞానము. ఈ రెండు పరస్పర విరుద్ధమైనవి. కనిపించే ఈ ప్రపంచమంతా అవిద్య, అజ్ఞానంతో నిండి ఉన్నది. జ్ఞానంనుంచి ఈ దృశ్య ప్రపంచం ఆవిర్భవించే దశయే బుద్ధితత్త్వం. ఈ బుద్ధి అనేది శుద్ధచితికి సంబంధించినది కాదు.

నా చెలికత్తె అంటే బుద్ధి, అసతితో బాగా కలిసిపోయింది. నా చెలిని నేను ప్రాణాలకన్న ఎక్కువగా ప్రేమించాను. అందుకే ఆమెకు వశమై పోయాను. ఒక్కక్షణం కూడా ఆమెను వదిలి ఉండేదాన్ని కాదు. ఆవిడకూడా మంచి, స్వచ్ఛమైన స్వభావం కలది. కాబట్టి నన్ను లోబరచుకున్నది. అంటే జీవుడు బుద్ధి సంబంధం లేకుండా ఉండడు. ఇక్కడ నేను అంటే జీవుడు అని అర్థం.

నా మనస్సు ఎప్పుడూ నా చెలియందే ఉండేది. కాని ఆ చెలిమాత్రం ఆ దుష్ట అసతితో ఉండేది. అంటే నా మనస్సు బుద్ధిమీద లగ్నంకాగా, బుద్ధి అజ్ఞానంతో నిండిపోయేది. రహస్యంగా ఆ అసతి, నా చెలికత్తెకూ, తన కుమారుడికీ సంబంధం కలిసింది. అసతికుమారుడు - అవిద్యపుత్రుడు. ఇదే మోహము. అజ్ఞానంవల్ల బుద్ధికి స్వర్గసుఖాల మీద కోరిక కలిగింది. అనగా మోహము ఆవరించటంవల్ల బుద్ధికి సద్విచారము మీద ఆసక్తి నశించింది.

ఆ కుమారుడు (మోహము) మదమత్తుడై, కన్నుమిన్ను కానరాక, నా ఎదురుగానే, నా చెలిపై బడి ఆమెను అనుభవించేవాడు. ఇలా ప్రతిరోజూ జరుగుతున్నప్పటికీ నేను, నా చెలి ఒకరినొకరము వదలకుండా కలిసే ఉండేవాళ్ళము.

నేను అంటే జీవుడు చెలికత్తె బుద్ధి. ఎప్పుడూ ఈ రెండూ కలిసే ఉంటాయి. నా సమక్షంలోనే అవిద్య యొక్క పుత్రుడు చెలికత్తెను అనుభవిస్తున్నాడు. అంటే జీవుడి సమక్షంలోనే బుద్ధి మోహగ్రస్థం అవుతున్నది. బుద్ధిపాపాలు చెయ్యటం ప్రారంభించింది. చెలికత్తెకు తండ్రివంటి వాడే అయిన తనయుడు కలిగాడు. మోహంవల్ల బుద్ధికి పుట్టినవాడు మనస్సు. అతడు పుట్టుకతోనే మహాబలశాలి. వ్యవహార దక్షుడు. చంచలమైన స్వభావం కలవాడు. అందుకే అతణ్ణి అస్థిరుడు అంటారు. అతడికి తండ్రి యొక్క మూఢత్వము, అమ్మమ్మయైన అవిద్య యొక్క గుణాలు సంక్రమించినాయి.

నేను (జీవుడు) నా చెలి నాకప్పగించిన అస్థిరుడిని పెంచి పెద్ద చేశాను. అతడు తన అమ్మమ్మ అనుమతితో ఒక ప్రౌఢయైన స్త్రీని వివాహం చేసుకున్నాడు. ఆమె పేరు చపల. ఇదే కల్పన. మనస్సు యొక్క మొదటి భార్య ఆ స్త్రీ తన భర్తకు ఎప్పుడు ఏ

రూపం ఇష్టమో, ఆ రూపాన్ని ధరించి, అతన్ని వశం చేసుకున్నది. అస్థిరుడికి అలసట అనేది తెలియదు. క్షణంలో చెప్పలేనంత దూరం ప్రయాణం చెయ్యగలడు. అతడు ఎక్కడి కెళ్ళినా, అతని భార్య చపల (కల్పన) కూడా అతనికిష్టమైన రూపం ధరించి, అతనితోబాటే వెడుతుంది. అతన్ని అన్నివిధాలా సంతోష పెడుతుంది. కొంతకాలానికి వారికి ఐదుగురు కుమారులు కలిగారు. వీరే జ్ఞానేంద్రియాలు. నా చెలివారిని కూడా నాకే అప్పగించింది.

చపల యొక్క సోదరి 'మహాశన' ఇదే ఆశ, కామము. ఈమెను కూడా అస్థిరుడు వివాహం చేసుకున్నాడు. అతడికి ఈమె రెండవ భార్య. ఈమెయందు అస్థిరుడికి చాలా మక్కువ. ఆమె కోరినదల్లా తీరుస్తాడు. అతడు తెచ్చినవన్నీ ఆమె క్షణంలో అనుభవించి ఇంకా తెమ్మంటుంది. అస్థిరుని కుమారులు కూడా ఆమెకు భోగ్యవస్తువులు సమకూర్చేవారు. వాటన్నింటినీ కూడా క్షణంలో అరగించేస్తుంది. ఆశకు అంతు లేదు. ఈమెకు ఇద్దరు కుమారులు కలిగారు. మొదటివాడు జ్వాలాముఖుడు ఇతడే క్రోధము. రెండవవాడు నింద్యవృత్తుడు. ఇతడే లోభము వారిని తల్లి అతిగా ప్రేమించేది. తండ్రి ఆమెను కౌగిలించు కున్నప్పుడు జ్వాలాముఖుని అగ్నిజ్వాలలలో అతని శరీరం కాలిపోయేది. మూర్ఛపోయే వాడు. నింద్యవృత్తునితో కలిసి ఉంటే, అప్పుడు జనులందరూ అతనుకూడా తల్లివంటివాడే అనేవారు. అంటే మోహమనేది క్రోధానికి లోభానికి వశమైపోయింది. అంటే అస్థిరుడు అంటే మనస్సు. అతనికి చపల (కల్పన) మహాశన (ఆశ, కామము) అని ఇద్దరు భార్యలు. మొదటి భార్య కల్పనలు చేసేది. రెండవ భార్య ఆశ. దానికి ఎంత భోగమైనా సరిపోదు. ఆశకు అంతులేదుకదా. ఈమెకు ఇద్దరు పిల్లలు క్రోధము, లోభము. మోహము అనే రెండవ భార్య క్రోధలోభాలకు వశమై పోయింది. ఈ విధంగా అస్థిరుడు అనేక కష్టాలు పడుతున్నాడు. అప్పుడు నా స్నేహితురాలు (బుద్ధి) కూడా అతడితోనే దుఃఖించేది. బుద్ధి అనేది మనస్సుతో తాదాత్మ్యం చెందుతుంది. అందుకని బుద్ధికి కూడా దుఃఖం కలుగుతుంది. ఆ చెలికత్తె (బుద్ధి) క్రోధము, లోభము అనే మనుమలతో కలిసి ఉన్నప్పుడు తానుకూడా లోకనింద పొందేది. ఆమెతో ఎప్పుడూ కలిసి ఉండే నేనుకూడా నా స్వరూపం కోల్పోయాను. అంటే నేను అనగా జీవుడు సహజమైన ఆనందం కోల్పోయి దుః ఖాలనుభవిస్తున్నట్లు కనిపిస్తాడు. ఈ రకంగా ఎన్నో సంవత్సరాలు గడిచినాయి. అస్థిరుడు, మహాశనకు వశుడవటంచేత అస్వతంత్రుడైనాడు. మనసు ఆశకు వశమై ఉంటుంది.

అస్థిరుడు ఒకానొక సమయంలో దశద్వారపురం చేరాడు. అంటే సృష్టికాలంలో ఈ శరీరంలో ప్రవేశించాడు. దశద్వారపురము అంటే శరీరము. నవరంధ్రాలు పదవద్వారము బ్రహ్మరంధ్రము.

ఆ పట్టణంలో అస్థిరుడు తన భార్యయైన మహాశనతోను, క్రోధము, లోభము మొదలైన కుమారులతోను కలిసి జీవించేవాడు. సుఖాలు పొందటానికి రాత్రింబవళ్ళు శ్రమించేవాడు. కాని కష్టాలే పొందుతూ దుఃఖిస్తూ ఉండేవాడు. కుమారుల దగ్గర ఉన్నప్పుడు ఒళ్ళుమండిపోయేది. లోకనిందలకు గురి అయ్యేవాడు. అంటే క్రోధము లోభము ఆవేశించి నప్పుడు తీరని తాపానికి గురి అయ్యేవాడు. భార్యలిద్దరూ చపల, మహాశన అతణ్ణి అటూఇటూ తీసుకుపోతూ పీడిస్తూ ఉండేవాళ్ళు. ఐదుగురు కుమారుల దగ్గరకు వెళ్ళేవాడు. అలసిపోయేవాడు. ఒక్కరోజు కూడా సుఖము అంటే ఎలా ఉంటుందో కూడా ఎరగడు. అంటే ఐదుగురు కుమారులు ఇంద్రియాలు. వాటితో సుఖాలు పొందేవాడు. ఇంద్రియ సుఖాలకు లోనై తద్వారా కష్టాలు అనుభవించేవాడు. నా స్నేహితురాలైన బుద్ధి తన కుమారుడైన మనస్సు దుఃఖించటం చూసి తనుకూడా ఏడుస్తుండేది. ఆవిడకు మూర్ఛ వచ్చినంతపని అయ్యేది. అనగా సత్వగుణం తగ్గిపోయేది. మహాశన తన కుమారులైన జ్వాలాముఖి, నింద్య వృత్తులతో అక్కడే ఉండేది. అవిద్య,మామగారైన మూఢుడు, సవతి చపల ఆమెను పెంచి పోషిస్తూ ఉండేవారు. ఆమె తన భర్తను, తన చెప్పుచేతలలో ఉంచుకున్నది. అంటే అవిద్య, కల్పన, మోహములతో పెరిగిన ఆశకు మనసు పూర్తిగా లొంగిపోయింది. నేను కూడా స్నేహితురాలిపై ప్రేమతో ఆ పట్టణంలోనే ఉన్నాను. అంటే బుద్ధితో తాదాత్మ్యం చెందిన జీవుడు బుద్ధితోనే ఉండిపోయాడు. ఆమె దుఃఖంతో నేను కూడా కుంగిపోయేదాన్ని అందరినీ నేనే రక్షించేదాన్ని. నేను గనక అక్కడ లేకపోతే ఏ ఒక్కరూ ఉండేవాళ్ళు కాదు. అందుకనే ఎప్పుడూ ఆ పట్టణాన్ని, వాళ్ళని కాపాడటమేనా పని అయ్యేది. అద్దం లేకపోతే ప్రతిబింబం ఏ విధంగా ఉండదో, అలాగే జీవుడు లేకపోతే ఏమీ ఉండదు.

నేను ఎవరితో ఉన్నప్పుడు వారి రూపము పొందేదాన్ని. అంటే జీవుడు శూన్యతో ఉన్నప్పుడు శూన్యరూపంగాను, మూఢునితో ఉంటే మూఢరూపంలోను, మనస్సుతో ఉన్నప్పుడు మనోరూపంతోను, చపలతో ఉంటే చపలరూపంతోను, ఈ రకంగా జ్వాలాముఖుడు, నింద్యవృత్తుడు, బుద్ధి మొదలైన ఎవరితో కలిస్తే ఆ రూపమే జీవుడు పొందుతాడు. బుద్ధితో తాదాత్మ్యం చెందటంవల్లనే జీవుడు అనేకరూపాలు పొందుతాడు.

నేను వారితో సావాసం చేయటంచేత అందరూ నన్ను వ్యభిచారిణి అనేవారు. అజ్ఞానులు నన్ను అపవిత్ర అనుకునే వారు. కాని జ్ఞానులు మాత్రం నేను పవిత్రను అనుకునేవారు. అంటే మనస్సు, బుద్ధి మొదలైన వాటితో కలిసినప్పటికీ జీవుడికి ఏ దోషములు అంటవు. అది ఎప్పుడూ నిర్మలమే.

నా తల్లి మహాపతివ్రత. అతిపరిశుద్ధమైనది. తల్లి అంటే – శుద్ధ చితి, త్రిపురాదేవి. ఆమె చిదేకరసరూపిణి. నిర్మలమైన ఆకారం గలది.అనగా అజ్ఞానము మొదలైన ఏ దోషములు లేనటువంటిది. ఆకాశము కన్న విస్తీర్ణమైనది. అన్నిటికీ మూలకారణము. సర్వమూ వ్యాపించి ఉండేది. అన్నిటికన్న అతి పెద్దది. పరమాణువు కన్న చిన్నది. అతిసూక్ష్మమైనది. సర్వజ్ఞాని. కాని ఏమీ తెలియనట్లు ఉంటుంది. అన్నింటికీ కర్త ఆమే. కాని తనకు ఏ సంబంధమూ లేనట్లు ఉంటుంది. అన్నిటికీ ఆధారము ఆమెయే. కాని ఆమెకు ఆధారము ఏదీ లేదు. అన్నిటినీ పోషించేది, అన్నింటికీ వెలుగునిచ్చేది కూడా ఆమే. ఈ రకంగా ఆమె సర్వాధారమైనప్పటికీ ఆమెకు మాత్రం ఏ ఆధారమూ లేదు. అన్నింటిలోనూ కలిసి ఉంటుంది. కాని తాను దేనితోనూ కలియదు. అంతటా ప్రకాశిస్తుంది. కాని ఎవరికీ కనపడదు. ఆమెకు తల్లితండ్రులు లేరు. కాని నావంటి పిల్లలు అనేకమంది ఉన్నారు. ఈ లోకంలోని వారందరికీ ఆమే తల్లి.

ఆమె సర్వరూప అతిసౌందర్యవతి. సర్వయుక్త అన్నిరకాలయిన ధనధాన్యాలతోనూ కూడి ఉన్నది. ఆవిడను ఎవరూ తెలుసుకోలేరు. ఆమె మహాదానందము గలది. ఐహికమైన ధనధాన్యాలు ఉండటంవల్ల చాలా ఆనందంగా ఉంటుంది. ఆమె ఆనంద స్వరూపిణి సర్వానందమయ.

ఆమెకు తల్లితండ్రులు లేరు. సర్వానికీ కారణము ఆమె. మరి ఆమెకు కారణము ఎవరూ లేరు. నాకు సోదరీగణము అసంఖ్యాకంగా ఉన్నారు. అంటే – ఈ లోకంలో జీవులు అనేకమంది ఉన్నారు. ఆ జీవులు బ్రహ్మకన్న వేరైనవారు కాదు. అన్నిజీవులూ పరమేశ్వరాంశలే. వాళ్ళుకూడా నాలాగానే నా స్నేహితురాలి కుటుంబాన్ని పోషిస్తున్నారు. వీళ్ళందరితోనూ తిరుగుతున్నప్పటికీ వాళ్ళ దుష్టగుణాలు నాకంటలేదు. నా తల్లికి మల్లేనే, నేను కూడా మంత్రస్వరూపిణిని. భౌతిక సంబంధము ఉంటే దోషాలు అంటుతాయి. కాని మంత్ర స్వరూపిణి అయిన చితికి ఏ దోషాలూ అంటవు.

ఈ పట్టణంలో నా చెలియొక్క కుమారుడు పూర్తిగా అలిసిపోయినప్పుడు, అతడు తన తల్లి వడిలో హాయిగా నిద్రపోయేవాడు. అస్థిరుడు నిద్రించినప్పుడు అంటే మోహము బుద్ధిలో లయమైనప్పుడు, అతని కుమారులు మొదలైనవారు అనగా మనస్సు, ఇంద్రియాలు భార్య తల్లి వీరు కూడా నిద్రపోతారు. ఎవరూ మేలుకొని ఉండరు. అంటే మనసు నిద్రించినప్పుడు ఇంద్రియాలు ఏవీ పని చెయ్యవు.

ఆ సమయంలో అస్థిరుని ప్రాణస్నేహితుడు – ఇతడే ప్రాణము, ముందున్న రెండు ద్వారాలగుండా తిరుగుతూ ఈ పట్టణాన్ని రక్షిస్తాడు. అంటే ఆ ప్రాణము ముక్కులలో

తిరుగుతూ ఈ శరీరాన్ని రక్షిస్తుంటాడు. అస్థిరుని తల్లి, వీరందరినీ తన కుమారులతో కలిసి రక్షిస్తుంటుంది. అనగా సుషుప్తి కాలంలో ఇంద్రియాలన్నీ లయం అవుతాయి. ఈ రకంగా అందరూ నిద్రిస్తున్న సమయంలో నేను నా తల్లిని చేరి ఆనందాన్ని అనుభవిస్తాను. అంటే సుషుప్తి కాలంలో ఇంద్రియాలన్నీ లీనమైనప్పుడు జీవుడు పరమాత్మతో తాదాత్మ్యం చెందుతాడు. వారందరూ నిద్రనుంచి లేవగానే నేను మళ్ళీ వారిని అనుసరించి ఉంటాను. సుషుప్తి నుంచి బయటకు రాగానే నేను మళ్ళీ మనస్సు, ఇంద్రియాలను జీవుడు అనుసరిస్తాడు.

అస్థిరుడి స్నేహితుడు ప్రచారుడు. మహాబలవంతుడు. ఇతడే ప్రాణము. అస్థిరుని కుమారులను ఎప్పుడూ ఇతడే కాపాడుతుంటాడు. అంటే ప్రాణమే ఇంద్రియాలను రక్షిస్తూ ఉంటుంది. అతడు ఒక్కడే అయినప్పటికీ అనేక రూపాలు ధరిస్తాడు. అనగా ప్రాణం అనేక రూపాలు పొందుతుంది. అవే ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములనబడే ముఖ్యవాయువులు. నాగ, కూర్మ, కృకుర, దేవదత్త, ధనుంజయములు. అనబడే ఉపవాయువులు. ఈ ప్రచారుడే ఆ పట్టణాన్ని రక్షిస్తుంటాడు. అందరినీ ఒకరితో ఒకరిని కలిపి ఉంచుతాడు. అంటే ప్రాణమే శరీరాన్ని రక్షిస్తుంది. ఇంద్రియాలను తమతమ విషయాలతో కలిపి ఉంచుతుంది. అతడు లేకపోతే అంతా విడిపోతారు. అనగా ప్రాణం లేకపోతే ఇంద్రియాలన్నీ విడిపోతాయి. ప్రచారుడే నాకు మిగిలినవారితో సంబంధము ఏర్పాటు చేస్తాడు. అంటే ప్రాణంవల్లనే జీవుడికి మిగిలిన అవయవాలతో సంబంధం ఏర్పడుతుంది.

ఈ రకంగా ప్రచారుడు నాటకంలో సూత్రధారిలాగా ఆ పట్టణంలోని వారందరినీ నడిపిస్తుంటాడు. ఈ పట్టణం గనక శిధిలమైపోతే, బుద్ధి మొదలైనవారిని వేరొక పట్టణానికి తీసుకుపోతాడు. అంటే ఈ శరీరం గనక నాశనమైపోతే వారిని ఇంకొక శరీరం చేరుస్తాడు.

ఈ విధంగా అస్థిరుడు, ప్రచారుడిని ఆశ్రయించి అనేక పట్టణాలకు అధిపతి అవుతున్నాడు. అంటే మనస్సు ప్రాణంవలన అనేక శరీరాలు పొందుతున్నది. మహాబలవంతుడైన ప్రచారుడు ఉన్నాడు. నేనున్నాను. అయినప్పటికీ అస్థిరుడు ఎప్పుడూ దుఃఖములోనే మునిగి ఉంటాడు. అతని భార్యలు–చపల, మహాశన, కుమారులు–ఇంద్రియాలు, క్రోధము, లోభము ఇవి అతణ్ణి దుఃఖాలపాలు చేస్తున్నాయి. జ్వాలాముఖుని దగ్గరకు వచ్చినప్పుడు శరీరమంతా పొగలు సెగలుకమ్మేది. అంటే – కోపం వచ్చినప్పుడు శరీరం ఉడికిపోయేది. దానికి విరుగుడు తెలియక అస్థిరుడు బాధపడేవాడు. నింద్యవృత్తుడితో (లోభంతో) ఉన్నప్పుడు లోకం అతన్ని నిందించేది. భార్యాపుత్రులు అతన్ని ఎక్కడికో తీసుకుపోయేవారు.

కొండలు, లోయలు, అరణ్యాలు, క్రూరజంతువులు అన్నీ అక్కడ ఉండేవి. భయంకరమైన ప్రదేశాలవి. అంటే ఊహలు, కోరికలు, ఇంద్రియాలు. వీటికి లోనైన జీవుడు భయంకరమైన పరిస్థితులు ఎదుర్కొనేవాడు. ఇంద్రియ సంబంధమైన సుఖాలనుభవించేవాడు.

కుమారుడి దుఃఖాన్ని చూసి నా స్నేహితురాలు (బుద్ధి) కూడా దుఃఖించేది. ఆమెతో పాటు నేనుకూడా దుఃఖించేదాన్ని అనగా జీవి అంతఃకరణ, ఇంద్రియాలతో ఉన్న సంబంధాలవల్ల తాను దుఃఖిస్తున్నట్లు కనపడతాడు. నేను సహజంగా అతిపవిత్రనే అంటే సత్వగుణసంపన్నురాలినే అయినప్పటికీ నా చెలిని, వారి కుటుంబాన్ని పోషిస్తూ వారితో తాదాత్మ్యం చెందటంవల్ల, నేనుకూడా మిక్కిలి మూఢనైనాను. ఇలా చాలా కాలం గడిచింది. ఆమె ఏదో విధంగా నన్ను కలిసింది. అంటే బుద్ధి జ్ఞానంతో తాదాత్మ్యం చెందింది. అప్పుడు నా మాట విని సచ్చరిత్ర గలవాడిని భర్తగా స్వీకరించింది. అంటే మోహం పోయి వైరాగ్యం కలిగింది. తననుతాను జయించింది. అనగా మోహం పోయింది. కొడుకులు, కోడళ్ళను చంపింది. అంటే - క్రోధ లోభాలను జయించింది. నాతో కలిసి తల్లి దగ్గరకు చేరింది. అంటే నిర్వికల్ప సమాధి పొంది పరమేశ్వరిని చేరింది. నా తల్లిని కౌగిలించుకున్నది జ్ఞానరూపమైనది. జ్ఞానం కలగగానే కల్మషమంతా పోయి ఆనంద సముద్రంలో మునిగిపోయింది. మధ్యలో ఎప్పుడైనా ద్వైతభావన కలిగినప్పటికీ మళ్ళీ త్రిప్పుకుని ఆత్మోన్ముఖమైంది. ఇదే జీవన్ముక్తి దశ. ఇదివరకు వినటంవల్ల పరోక్షజ్ఞానం కలిగింది. ఇప్పుడు అపరోక్షజ్ఞానం కూడా కలిగింది. సంసారం నిష్ప్రయోజనం అని తెలిసింది. కర్మలు చేయటం, సుఖాలు అనుభవించటం అనేవి ఇప్పుడు లేవు. ఆనంద సముద్రంలో మునిగిపోయింది. ఆనందస్వరూపమైనది.

కాబట్టి ఓ రాకుమారా ! నువు కూడా నీ దుష్టత్వాన్ని వదలిపెట్టి నా తల్లిని చేరే మార్గం చూడు. అప్పుడు శాశ్వతమైన సుఖాన్ని ఆనందాన్ని పొందగలవు. అని హేమలేఖ చెప్పింది అంటూ ఐదవ అధ్యాయం ముగించాడు రత్నాకరుడు.

## 12. ఆప్తవాక్యము - శ్రద్ధ

"గురువుగారూ! హేమలేఖ చెప్పిన విషయాలు రాకుమారుడికి ఏమైనా అర్థమైనాయా? వాటిని విని అసలు అతను ఏమన్నాడో వివరించండి" అన్నాడు నారాయణభట్టు. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

హేమచూడుడు తనప్రియురాలు చెప్పిన మాటలు విని ఆశ్చర్యపోయాడు. అతడు పూర్తిగా అజ్ఞాని. భార్య చెప్పిన మాటలలోని అంతరార్థం అతడికి ఏమీ తెలియలేదు.

అందుకని అతడు అంటున్నాడు "దేవీ ! నువ్వు చెప్పినదంతా ఆకాశపురాణంలాగా ఉన్నది. అంతా కట్టుకథ. నిజం చెప్పాలంటే నీ తల్లి ఒక అప్సరాంగన. నువ్వు చిన్నదానివి. ఇంకా యవ్వనంకూడా పూర్తికాలేదు. కాని నీ మాటలు చూస్తే కొన్నివేల ఏళ్ళ వయసున్న వారికి లాగా ఉన్నాయి. నీకేమన్నా దయ్యంపట్టి ఉండాలి. లేకపోతే ఈ మాటలేమిటి? నీకు ఒక చెలికత్తె ఉన్నదా ? ఆవిడకి కుమారులున్నారా ? మీకు ఒక పట్టణం ఉన్నదా? ఎక్కడ ? నీకు చెలికత్తె ఉంటే ఆవిడ నీతోపాటు ఇక్కడికి రాలేదేం ? రహస్యంగా ఎక్కడైనా దాచావా ? పోనీ అంతఃపురంలో ఏమైనా ఉంచావా ? అలా ఏమైనా జరిగిందేమో పోనీ నా తల్లిని ఏమైనా అడగనా ? మా అమ్మకి సవతి ఏమీ లేదే? మరి నీ చెలి ఎక్కడుంది? సభలో విదూషకుడు చెప్పినట్లుగా చెబుతున్నావు. వంధ్యాపుత్రుని కథ నీకు తెలుసుకదా ? "గొడ్రాలి కొడుకు. వాడు ప్రతిబింబరూపంలో ఉన్న రథాన్ని ఎక్కాడు. ముత్యపు చిప్పలో దొరికిన బంగారు నగలు ధరించాడు. మానవుని కొమ్ములతో చేసిన ఆయుధాలు తీసుకుని ఆకాశంలో యుద్ధం చేసి, కాబోయే రాజును చంపి, మాయాపట్టణాన్ని జయించి, ఎండమావులలో స్నానం చేసి, కలలో కనిపించిన స్త్రీలతో సుఖిస్తున్నాడు" ఇది ఎక్కడైనా నమ్మటానికి వీలుగా ఉన్నదా ? అలాగే ఉంది నువ్వు చెప్పిన కథ కూడా" అన్నాడు. ఆ మాటలు విన్న హేమలేఖ రాకుమారుడితో "నాథా ! నేను చెప్పినదేదీ నీకు అర్థం అయినట్లుగా లేదు. నా మాటలు నిరాధారము, అప్రమాణము కావు. నేను అబద్ధం చెప్పను. అసత్యమనేది తపోఫలాన్ని నాశనం చేస్తుంది. మంచి అందగత్తెలకు ఎక్కడైనా బొల్లి ఉంటుందా ? ఒక వేళ ఉంటే వారు అందగత్తెలుగా చెప్పబడరు కదా ? అలాగే తపోసంపన్నుల వంశంలో అసత్యముండదు. జిజ్ఞాసువులకు అబద్ధాలు చెప్పి పెడదారి పట్టించేవాడు ఊర్ధ్వలోకాలు పొందడు. అలాగని అధోలోకాలూ పొందడు. రాకుమారా ! గ్రుడ్డివాడికి అంజనాన్ని గురించి ఎన్ని చెప్పినా చూపురాదయ్యా. అలాగే మూర్ఖుడికి మంచి మాటలెన్ని చెప్పినా, అవి అబద్ధాలే అనుకుంటాడు. నీకు భార్యనై ఉండి, అబద్ధం అందులోనూ నీకు అబద్ధం చెబుతానా ?

ఒకవేళ నేను అబద్ధం చెప్పాను అనిపిస్తే, నీ విజ్ఞానంతో దాన్ని విమర్శ చెయ్యి. లోకవ్యవహారములను పరిశీలించి, వాటి బాగోగులు, మంచి చెడుల గురించి తెలుసుకోవటం తెలివిగలవారి లక్షణము. ఇప్పుడు నేను చెప్పిన విషయాలు నీకు మంచిని కలిగించేవి, సంతోషాన్ని ఇచ్చేవి అయినప్పుడు, అవి అబద్ధాలు అని ఎందుకనుకుంటావు? ఇదివరకటి లాగానే నేను ఇప్పుడు చెప్పినవి కూడా అన్నీ నిజాలే. పనికిరాని తర్కాన్ని వదిలిపెట్టి, ప్రశాంతచిత్తుడవై నా మాటలు విను.

రాజకుమారా ! ఆప్తులైనవారి మాటలలో అవిశ్వాసము అనేది ఉండకూడదు. వారి మాటలు పూర్తిగా నమ్మాలి. ఆప్తవాక్యము నమ్మని మూర్ఖులున్నారే, వాళ్ళకి సుఖము, ధనము ఉండవు. శ్రద్ధలేనివాడు అన్నివిధాలా నాశనము పొందుతాడు. శ్రద్ధయే జగత్తుకు తల్లి. శ్రద్ధయే ప్రాణము. మరి అలాంటి తల్లి మీద నమ్మకంలేనివాడు ఎలా జీవిస్తాడు ? అంతేకాదు. భార్యమీద నమ్మకం లేకపోయినా సుఖాలు పొందలేడు. తన పిల్లలను నమ్మని వృద్ధుడు సుఖపడలేడు కదా ? నమ్మకంలేనివాడు వ్యవసాయమెలా చేస్తాడు? అంతదాకా ఎందుకు ? శ్రద్ధలేనివాడు డబ్బు సంపాదించలేడు. త్యాగం చెయ్యలేడు. ఒక పనిచేస్తే సుఖం కలుగుతుందని, ఇంకొకపని చేస్తే దుఃఖం కలుగుతుందని నిశ్చయించుకున్న తరువాతనే ఎవడైనా పనులు చేస్తాడు. అంతేకాని ఆప్తవాక్యములపై విశ్వాసముండి కాదు. విత్తనాలు నాటి వ్యవసాయం చేస్తే పంట పండుతుంది. అంతేగాని చూస్తూ కూర్చుంటే పంట పండదు. అనే మాట నిజమే. కాని దానికి కూడా ఆప్తవాక్యమే ముఖ్యమైనది. విశ్వాసంలేనివాడు గాలికూడా పీల్చలేడు అందుకని మంచి నమ్మకంతో నా మాటలు విని శాశ్వతమైన ఆనందాన్ని పొందు అయితే నమ్మేటప్పుడు ఉత్తముడైన పురుషుణ్ణి మాత్రమే నమ్మాలి. అధముణ్ణి నమ్మరాదు. ఇదికూడా ఒక నమ్మకమే. నేను నీ భార్యను నీ శ్రేయోభిలాషిని ముని వాటికలో పెరిగిన దానిని ఉత్తమురాలిని కాబట్టి నా మాట వినవలసినది" అంది.

ఆ మాటలు ఆలకించిన హేమచూడుడు. "ప్రేయసీ, నువు చెప్పినట్లు విశ్వాసము అనేది అవసరమే. అందునా సత్పురుషులను మాత్రమే నమ్మాలి. చెడ్డవారి మాటలు మెత్తగా, ఉపయోగకరంగా కనిపిస్తాయి. కాని వారి మాటలు విన్నవాడు ఎరనుచూసి మోసపోయి గాలానికి తగులుకున్న చేపవలె ఆపదలు కొని తెచ్చుకుంటాడు. మంచివారిని నమ్మి బాగుపడ్డవారు, చెడ్డవారిని నమ్మి చెడిపోయినవారు అనేకమంది ఉన్నారు. కాబట్టి బాగా విచారించిన తరువాతనే వీరు మంచివారు, వీరు చెడ్డవారు అని నిర్ణయానికి రావాలి. అలా కాకుండా ఎవరినీ మంచివారని నమ్మరాదు. అందుచేత నేను నీ మాటలు నమ్మాలి అని ఏమీ లేదు కదా ?" అన్నాడు

అప్పుడు హేమలేఖ "రాజా ! నువు చెప్పిన దాన్ని బట్టి నేను ఏ కోవకు చెందుతాను అనేది నీ అనుమానము. ఒక పురుషుడు సత్పురుషుడా ? దుర్మార్గుడా ? అనే విషయం ఏ విధంగా నిర్ణయిస్తాము ? ఏదో ఒక ప్రమాణం ఆధారంగా. ఇది ఒక ప్రమాణము అని విశ్వాసం ఉండాలి కదా ? అది సరియైన ప్రమాణము అని ఏ విధంగా నిరూపిస్తావు? తర్కంతో నువు చేసిన నిర్ణయాలు ఒక్కొక్కసారి తప్పుకావచ్చు. ఉదాహరణకు ఒక లోహంతో

గీచినప్పుడు మట్టికి సంబంధించిన వస్తువు మీద గీతలు పడతాయి. అని నిర్ణయించా మనుకో. ఈ నిర్ణయము చాలావరకు సరియైనదే. కాని ఎప్పుడూ కాదు. వజ్రము కూడా మట్టికి సంబంధించినదే. మరిదాని మీద ఏ లోహంతోనూ గీతలు పడవు. రాజా! అసలు ప్రమాణము నిర్ణయించేవాడు సరియైనవాడు అని ఎలా చెప్పగలవు? అందుచేత ఆగమమే ప్రమాణము. సదాగమముకు మల్లేనే, మిగిలిన ఆగమాలు కూడా నిర్దుష్టమైనవే అంటావా? అప్పుడు దేన్నిగురించి అయినా తర్కం అనవసరమే. కాబట్టి విశ్వాసంతోనే లోకంలో అంతా పనులు చేస్తుంటారు. అంతేకాదు రాకుమారా! శ్రద్ధగనక ఉన్నట్లైతే శ్రేయస్సు పొందవచ్చు. విపరీతంగా తర్కవిచారము చేసేవాడు, అసలు చెయ్యనివాడు వీరిద్దరూ ఈ లోకంలోనే కాదు పరలోకంలో కూడా సుఖం పొందలేడు. అయితే ఒక్కొక్కసారి ఏ రకమైన తర్కము చెయ్యనివాడు మంచిఫలితాన్ని పొందవచ్చు. ఉదా॥ గ్రుడ్డివాడు విసిరిన రాయి తగిలి చెట్టున పండ్లు క్రిందపడ్డట్లు. ఇది ప్రతిసారి జరగాలని లేదు. కాని విపరీత తర్కం చేసేవాడు మాత్రం ఏమి సాధించలేడు. దీనికి ఉదాహరణగా ఒక కథ చెబుతాను.

పూర్వకాలంలో గోదావరీ తీరాన కౌశికుడు ఉండేవాడు. అతడు మహాతపస్వి. బ్రహ్మజ్ఞాని చరాచర జగత్తు అంతా పరబ్రహ్మ స్వరూపమే. అని తెలుసుకున్నవాడు. ఆయనకు చాలామంది శిష్యులు ఉన్నారు. ఒకసారి గురువుగారు ఆశ్రమంలో లేని సమయంలో, శిష్యులంతా కూర్చుని బ్రహ్మతత్త్వాన్ని గురించి చర్చిస్తున్నారు. చర్చ వాడిగా, వేడిగా సాగుతున్నది. ఆ సమయంలో 'శుంగుడు' అనే తర్కశాస్త్ర పండితుడు వచ్చాడు. ఆయన పండితుడే గాని ఇంగితంలేని వాడు. కాబట్టి అతని తర్కమంతా విపరీతము. ఉపయోగంలేనిది, అతడు తన తర్కకౌశలంతో అందరి వాదనలు ఖండించాడు. అప్పుడు "ఒక ప్రమాణంవల్ల సిద్ధించినది సత్యము" అని శిష్యులన్నారు. శుంగుడు పూర్వపక్షము, సిద్ధాంతము రెండింటినీ ఖండిస్తాడు. రెండింటికీ అనుకూలంగా మాట్లాడతాడు. ఆ మాటలు విన్న శుంగుడు "అసలు ఆ ప్రమాణం మంచిదో కాదో తెలియాలికదా ? అందుకు ఇంకో ప్రమాణం కావాలి. ఇలా చెప్పుకుంటూపోతే అసలు ప్రమాణమనేదే ఉండదు. సత్యమనేది లేదు. అంతా శూన్యమే." అన్నాడు.

కొంతమంది అతడి మాటలు నమ్మి శూన్యవాదులైనారు. వారంతా తరువాత కాలంలో జడభావం పొంది నశించారు. మిగిలిన శిష్యులు, తమ గురువుగారికి ఈ విషయం తెలియచేశారు. ఆయన వారి అనుమానాలను తీర్చాడు. కాబట్టి రాజా ! శుష్కతర్కాన్ని వదిలిపెట్టి, సదాగమానికి అనుకూలంగా ఉండే తర్కాన్ని మాత్రమే స్వీకరించాలి." అన్నది.

ఆ మాటలు విన్న హేమచూడుడు మిక్కిలి ఆశ్చర్యపోయి "నువు సామాన్యమైనదానివి కాదు. నీ పాండిత్యము అమోఘము. నిన్ను చేపట్టిన నేను ధన్యుడను. శ్రద్ధతో శ్రేయస్సు పొందవచ్చు అన్నావు కదా ! ఆ విషయంలో నాకు అనుమానం ఉన్నది. దేన్ని నమ్మాలి? దేన్ని నమ్మకూడదు? ఆగమాలను నమ్మాలి అన్నావు కదా ? అవి చాలా ఉన్నాయి. అవి పరస్పర విరుద్ధములు. వాటిమీద వ్యాఖ్యలు కూడా విరుద్ధములే.

ఆచార్యులంటావా? వారి మతాలలో తేడాలున్నాయి. ఇక ఎవరి బుద్ధినివారు నమ్మాలి అంటావా ? ఆ బుద్ధి కూడా ఎప్పుడూ ఒకే విధంగా ఉండదు. దేశకాలమాన పరిస్థితులను బట్టి మారుతుంటుంది. పోనీ మనకేది ఇష్టమో దాన్ని అనుసరించాలి అంటావా? మనకిష్టమైనది మంచిది కాకపోవచ్చు. హానికరం కావచ్చు. కాబట్టి దేనిమీద శ్రద్ధ ఉంచాలో నాకు తెలియటంలేదు. శూన్యవాదులు, అలా కాని వారిని దూషిస్తారు కదా. అయినప్పటికీ శూన్యము కూడా ఒక ఆగమమే కదా ? అలాంటప్పుడు శూన్యవాదాన్నెందుకు నమ్మరాదు? నీకు చాలా విషయాలు తెలుసు. అందుచేత, ఓ ప్రేయసీ ! నాకీ విషయాన్ని సవిస్తరంగా వివరించవలసినది" అన్నాడు అంటూ ఆరవ అధ్యాయాన్ని ముగించాడు రత్నాకరుడు.

## 13. పురుష ప్రయత్నం

"గురువుగారూ ! హేమచూడుడు ఆ విధంగా అడిగిన తరువాత హేమలేఖ ఏం చెప్పిందో వివరించండి" అన్నాడు కృష్ణశర్మ. వివరించటం ప్రారంభించాడు రత్నాకరుడు.

"నాథా మనసు చంచలమైనది. అందుచేతనే అది కోతిలాంటిది అంటారు. అసలు దీనివల్లనే అజ్ఞానికి అనేకమైన కష్టాలు వస్తున్నాయి. అయితే సుషుప్తిలో మనసుకూడా నిద్రపోతుంది. కాబట్టి ఆ స్థితిలో దానికి చలనముండదు. అందుకే సుఖం కలుగుతోంది. అందుచేత మనస్సును నిశ్చలం చేసుకుని నేను చెప్పేది విను. శ్రద్ధ లేకుండా విన్నప్పటికీ ఉపయోగముండదు. రాకుమారా ! చిత్రంలో ఉన్న చెట్టు నీడనివ్వలేదయ్యా. అలాగే శ్రద్ధలేకుండా విన్నది. విననిదానితో సమానమే. ఎడతెగని తర్కమున్నదే. అది వృథా దానివల్ల ఏ రకమైన ఉపయోగం లేదు. మంచితర్కాన్ని చేసినవాడు మంచి ఫలితము పొందుతాడు. కాబట్టి మంచితర్కాన్ని మాత్రమే ఆశ్రయించాలి. వ్యవసాయదారుడు మంచి తరుణంలో భూమిని దున్ని వ్యవసాయం చేసినట్లే, నువ్వుకూడా మంచితర్కాన్ని ఆశ్రయించి మంచి ఫలితాన్ని పొందు అంతేకాని శుంగునిలాగా శుష్కతర్కం మాత్రం చెయ్యవద్దు.

పట్టుదలతో ప్రయత్నం చేసేవాడు. విఫలుడుకాడు. ఈ పట్టుదలవల్లనే కర్షకుడు ధాన్యాన్ని, వర్తకులు ధనాన్ని, రాజులు రాజ్యాన్ని పొందుతున్నారు. ఆ పట్టుదల వల్లనే

తాపసులు ఉత్తమలోకాలు పొందుతున్నారు. వ్యర్థమైన తర్కం చేస్తూ, పట్టుదల లేనివాడు ఏమీ సాధించలేడు. కష్టపడినప్పటికీ ఎప్పుడో ఒకసారి ఫలితం రాలేదు అని, పట్టుదలతో పని చెయ్యటమే మానేసేవాడు కడుమూర్ఖుడు. రాకుమారా !

పురుష ప్రయత్నము, శ్రద్ధ, తర్కము. ఈ మూడింటినీ ఆశ్రయించి శ్రేయస్సును పొందాలి. సాధనాలు అనేకమున్నాయి. వాటిలో మనం ఉపయోగించేదే ముఖ్యసాధనమవుతుంది. బాగా ఆలోచించి మంచి సాధనాన్ని ఎన్నుకోవాలి.

రాజా ! ఇంతవరకూ నీకు శ్రేయస్సు పొందాలి అని చెప్పాను కదా ! ఇప్పుడు శ్రేయస్సు అంటే ఏమిటో వివరిస్తాను. వినవలసినది.

ఈ జన్మలో దేనిని పొందిన తరువాత ఇక దుఃఖము అనేది రాదో అదే శ్రేయస్సు. జాగ్రత్తగా పరిశీలించినట్లైతే లోకంలో అంతటా శోకమే కనిపిస్తుంది. దుఃఖాలతో కలసి ఉన్నది శ్రేయస్సు కాదు. భార్య, పుత్రులు, భోగభాగ్యాలు, ధనధాన్యాలు, రాజ్యం, కీర్తి ప్రతిష్టలు, పాండిత్యం, సౌందర్యము, సిరిసంపదలు ఇవేవీ శాశ్వతమైనవి కాదు. అస్థిరమైనవి. ఇవన్నీ శోకానికి హేతువులు. వీటివల్ల శ్రేయస్సు కలగదు. అందుచేత, వీటియందు విముఖత కలగటమే శ్రేయోమార్గము. మోహంవల్లనే వీటియందు భ్రమ కలుగుతుంది. పరమేశ్వరుణ్ణి ఆవరించి ఉంటుంది మాయ. ఈ మాయ జగత్తులో అందరినీ సమ్మోహితులుగా చేస్తుంది. గారడీవాడు ఈ మాయతోనే మనలను మోహింపచేస్తాడు. అతడికి తెలిసినమాయ చాలా తక్కువ. ఈ కొంచానికే మానవులు తట్టుకోలేకుండా ఉన్నారు. అలాంటప్పుడు సర్వజగద్రక్షకుడైన పరమేశ్వరుని మాయనుంచి తప్పుకోవటం ఎవరి తరము ? ఈ మాయ పరమేశ్వరుణ్ణి ఆశ్రయించి ఉంటుంది. అతనికి లోబడి ఉంటుంది. పాముకోరలలో ఉన్న విషంలాగా ఈ మాయ పరమేశ్వరుడితోనే ఉన్నప్పటికీ, దీనివల్ల ఆయనకు హాని ఏ మాత్రం ఉండదు. పరమేశ్వరుని అనుగ్రహం పొందినవాడు ఈ మాయకు లోనుకాడు.

అందుచేత, ఆయన్ని ఆరాధించి ప్రసన్నం చేసుకున్నవాడు జ్ఞానాన్ని పొందిమోహం నుండి విముక్తుడౌతాడు.

శ్రేయస్సును పొందటానికి అనేక మార్గాలున్నాయి. అయినప్పటికీ పరమేశ్వరానుగ్రహం లేనిదే అవి ఏవీ ఫలించవు. కాబట్టి ముందుగా ప్రపంచ కారణమైన పరమేశ్వరుణ్ణి ఆరాధించాలి. తరువాత మోహాన్ని నశింపచేయటానికి యోగసాధన చెయ్యాలి.

రాజా ! ఈ జగత్తంతా ఒక కార్యం. మరి దానికి కారణం అంటూ ఉండి తీరాలి. అంటే జగత్తుకు ఒకకర్త ఉండి తీరాలి. అయితే ఆకాశము, పరమాణువులు. ఇవి అవయవాలు గలవికాదు. వాటికి కర్తలేదు. అంటారు. అయితే జగత్తుకు మాత్రమే కర్త ఉన్నాడు అనటం సరియైనది కాదు. ఏవేవి వేద్యములో అంటే తెలియదగినవో అవన్నీ కార్యములే. దీనిప్రకారము ఆకాశము, అణువు కూడా వేద్యములే. అందుచేత వాటికి కూడా ఒక కర్త ఉన్నాడు. కాబట్టి పృధివ్యాధులకు కర్త ఉన్నాడు.

సృష్టికి ముందు సత్తూలేదు. అసత్తూ లేదు. అంతా చీకటిగా ఉండేది. అప్పుడు శూన్యంలోనుంచి జగద్కర్త ఈ జగత్తును సృష్టించాడు. సృష్టిలో ముందుగా ఆకాశం ఉద్భవించింది. దానినుంచి వాయువు, దానినుంచి అగ్ని, దానినుంచి జలము, దానినుంచి భూమి ఉద్భవించాయి. అయితే జగత్తుకు కర్తలేదు. అనే ఆగమంకూడా ఒకటి ఉంది. అయితే దీన్ని ఇతర ఆగమాలతో ఖండించటం జరిగింది. కాబట్టి ఇది ప్రమాణం కాదు. (చార్వాకమతంలో పంచభూతాలలో ఆకాశం లేదు.)

రాజా ! క్రియ అనేది బుద్ధిపూర్వకం. బుద్ధి ఉన్నప్పుడే క్రియ జరుగుతుంది. బుద్ధి లేకపోతే క్రియలేదు. ప్రపంచ సృష్టి చెయ్యాలి అంటే జ్ఞానంకల ఒక వస్తువు ఉండాలి. జ్ఞానంలేని జడపదార్థాలు ఏమీ చెయ్యలేవు. కుండను తయారుచెయ్యాలంటే కుమ్మరికావాలి. అంతేకాని బొమ్మలో ఉన్న కుమ్మరి కుండను తయారుచెయ్యలేడు.

ఆగమాలు ప్రపంచ సృష్టికర్త మహాజ్ఞాని అని ఉద్ఘోషిస్తున్నాయి. ప్రపంచంలోని ఏ పనిని చూసినా అది బుద్ధితో, జ్ఞానంతో కూడినదే అనిపిస్తుంది. ఈ రకంగాఆగమాల ప్రకారము జగత్తంతా ఒక కర్త చేత సృష్టించబడింది. ఆ కర్త మామూలువాళ్ళకన్న విలక్షణుడు ఊహించటానికి వీలులేని ప్రపంచాన్ని సృష్టించిన ఆ కర్తకూడా మహాశక్తి సంపన్నుడై ఉండాలి. అంతశక్తి గలవాడు కాబట్టే, తనను శరణుజొచ్చినవారిని రక్షించగలుగుతున్నాడు. కాబట్టి ఓ నాథా ! మనోవాక్కాయ కర్మలతో శక్తివంతుడైన పరమేశ్వరుణ్ణి శరణువేడు.

నాథా ! మనస్ఫూర్తిగా సేవిస్తే ప్రభువులకే మనమీద దయ కలుగుతంది కదా ! అలాంటప్పుడు భగవంతుడికి కలగదా? అయితే ఒక్క విషయం. రాజుల కోరికల మేరకు మనం పనులు చేస్తాము. అప్పుడు వారు మన కోరికలు తీరుస్తారు. మరిభగవంతుడికి కోరికలు ఉండవు కదా ? అతడికి మనసేవ వల్ల లాభం ఏమిటి ? అంటావేమో ? పరమేశ్వరుడు భక్తవత్సలుడు. అతడు తనని సేవించని వారి కోరికలుకూడా తీరుస్తాడు. అలాంటప్పుడు తనను ఆరాధించే భక్తుల కోరికలు తీర్చడా ? రాజులు నిర్దయులు

కృతఘ్నులు. భగవంతుడు అలాకాదు. అతడు దయాసింధువు. కరుణామూర్తి. అతడికి ఒకకట్టుబాటు ఉంది. అలా కాకపోతే రాజ్యాలకు మల్లేనే ఈ లోకంకూడా ఏనాడో నశించిపోయేది. రాజులకు కట్టుబాట్లు లేకపోవటంవల్లనే రాజ్యాలు నశిస్తున్నాయి. కాబట్టి ఓ రాజా ! నువ్వు కుతర్కాన్ని వదిలి పరమేశ్వరుణ్ణి శరణువేడు. అతడే నీకు శ్రేయస్సు కలగచేస్తాడు. అయితే నువ్వు మాత్రం శ్రేయస్సు కావాలని అతణ్ణి సేవించవద్దు. అని చెప్పింది హేమలేఖ.

## 14. ఉపాసన

రాజా ! ఇక ఉపాసన అనేది అనేక రకాలుగా ఉంటుంది. ఒకడు బాధలనుండి విముక్తి పొందటానికి ఉపాసన చేస్తాడు. ఒకడు ధనం కోసం చేస్తాడు. ఇంకొకడు భోగభాగ్యాలకోసం ఉపాసన చేస్తాడు. నిష్కామ్యంగా అంటే ఏ కోరికా లేకుండా ఉపాసన చేసేవారు చాలా అరుదుగా ఉంటారు. అదే నిజమైన ఉపాసన. ఉపాసన చేసేవాడి కోరికలు తీరటం అనేది అతడు చేసే ఉపాసన యొక్క తీవ్రతను బట్టి ఉంటుంది." అన్నది హేమలేఖ. ఆ మాటలు విన్న హేమచూడుడు అడుగుతున్నాడు. "దేవీ ! ప్రారబ్ధకర్మ అనేది గురి చూసి వదలిన బాణం లాంటిది దాన్నుంచి తప్పుకోలేము కదా ? అలాంటప్పుడు ఈశ్వరుడు ఏం చేస్తాడు ?" ఆ మాటలు విన్న హేమలేఖ "నాథా ! నువ్వు చెప్పింది నిజమే. అయితే నిష్కామ్య భక్తిలేనివారి విషయంలో ఇది వర్తిస్తుంది. చిన్న ఉదాహరణను చూడు. మార్కండేయుడి విషయంలో ఈశ్వరుడు అతనికర్మను గురించి ఆలోచించలేదు. వారి కర్మలనుంచి మాత్రమే ఫలితం ఇవ్వాలనేది నిజం. కాని మార్కండేయుడి విషయంలో అది జరగలేదు. ఎందుకని అంటే ప్రారబ్ధాన్ని దాటి పోలేమనేది పురుష ప్రయత్నం చెయ్యనివారికే వర్తిస్తుంది. పురుష ప్రయత్నం చేసేవారికి అది వర్తించదు. వాళ్ళు ప్రారబ్ధాన్ని జయిస్తారు. వారికి ప్రారబ్ధంవల్ల రావలసిన దుఃఖాలు రాకుండాపోతాయి. ఇది నియతియొక్క స్వభావము. ప్రతి పనికి ఫలితము ఉండి తీరుతుంది అనేది లోకప్రసిద్ధము. అదే నియతి అనేదికూడా ఈశ్వర శక్తియే. అది సంకల్ప స్వరూపిణి. పరమేశ్వరుడు సత్యసంకల్పుడు. కాబట్టి ఆయన సంకల్పాన్ని మనం దాటిపోలేము. అయితే పరమేశ్వరుని శరణుపొందిన వారి విషయంలో ఈ నియతి ఉండదు. ఈ రకంగా నియతిని అతిక్రమించవచ్చును. అందుచేత పనికిమాలిన తర్కాన్ని వదిలి పరమేశ్వరుణ్ణి ఆశ్రయించివలసినది. ఆయనే నీకు శ్రేయస్సు కలుగచేస్తాడు. క్షేమము అనే సాధానికి నిష్కామభక్తి, శరణాగతి అనేది మొదటి మెట్టు ఇతర సాధనాలన్నీ ఉపయోగం లేనివే." అంది. హేమలేఖ ఆ మాటలువిన్న రాకుమారుడు మళ్ళీ అడుగుతున్నాడు.

"దేవీ ! సర్వస్వతంత్రుడైన మహేశ్వరుడు ఒకడు ఉన్నాడని, అతడే జగద్కర్త అనీ చెప్పావు. అతడు ఎవరు ? విష్ణువు, శివుడు, వాసుదేవుడు, గణపతి, సూర్యుడు ఈ విధంగా అనేకపేర్లు చెప్పి, వీరే ఈ జగన్నిర్మాణానికి కారణం అంటున్నారు కదా. వీరిలో ఈశ్వరుడు ఎవరు ? నాకు వివరంగా తెలియ చెయ్యవలసినది" అన్నాడు హేమచూడుడు.

## 15. ఈశ్వరస్వరూప నిర్ణయం

గురువుగారూ ! హేమచూడుడు అడిగిన ప్రశ్న సమంజసంగానే ఉన్నది. ప్రతివారూ ఎవరో ఒకరి పేరు చెప్పి, అతడే సర్వేశ్వరుడు అంటున్నారు. మరి అలాంటప్పుడు ఈశ్వర స్వరూప నిర్ణయం ఎలా చెయ్యాలి ? దానికి హేమలేఖ ఏ సమాధానం చెప్పింది వివరించండి అన్నాడు నారాయణభట్టు. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

రాజా ! సర్వజగత్తుకు సృష్టిస్థితి లయకారకుడే ఈశ్వరుడు. అతడు బ్రహ్మ, విష్ణువు, సూర్యుడు, గణపతి అని చాలామంది చాలారకాలుగా నిర్ణయించారు. వాస్తవానికి అతడు శివుడు కాదు, విష్ణువు కాదు, బ్రహ్మ కాదు, మరెవరూ కూడా కాదు.

మూడు కనులు, ఐదు ముఖాలు గల శివుడే జగత్కర్త అంటారు. కాని కుండలు చేసే కుమ్మరికి మల్లేనే శివుడికీ శరీరమున్నది. అతడు చేతనుడు. అయితే లోకంలో కర్తయైనవాడు చేతనుడుగా, శరీరం కలవాడుగా కనిపిస్తున్నాడు. శరీరము, చైతన్యమూ లేని కర్త ఎక్కడా కనిపించదు. శరీరము, చైతన్యము – ఈ రెండింటిలోనూ చైతన్యానికే కర్తృత్వం ఎక్కువ. ఎందుకంటే స్వప్నావస్థలో జీవుడు స్థూలశరీరాన్ని వదిలి, చైతన్యమయ దేహంతో సమస్తమైన కోరికలు సృష్టిస్తున్నాడు. అందుచేత చిత్స్వరూపమైన ఆత్మకి శరీరము అనేది ఒక కార్యం సాధించటానికి సాధనం మాత్రమే. ఏదైనా కార్యం సాధించాలంటే శరీరం కావాలి. అందుకనే వారికి సంపూర్ణ స్వాతంత్ర్యం లేదు. అదే సర్వజగత్కర్త అయిన భగవానుడికి సంపూర్ణ స్వాతంత్ర్యం ఉంది. సర్వేశ్వరుడు ఏ ఫలితాన్నీ ఆపేక్షించి ఈ సృష్టి చెయ్యడు. ఆయనకు శరీరం లేదు. రూపం లేదు. నిరాకారాడు. అశరీరి. కాని కుండలు చెయ్యటానికి కుమ్మరిలాగా సృష్టి చెయ్యటానికి కూడా ఒక ఉపాదాన కారణం కావాలి. దేశము, కాలము, ఇతర సామాగ్రి సాధనంగా చేసుకుని ఈశ్వరుడు లోకాలను సృష్టిస్తాడు అని గనక అంటే అతడు కూడా జీవుడే అవుతాడు. అప్పుడు భగవంతుడు అనే పదం అప్రమాణం అవుతుంది. కాబట్టి జగత్సృష్టికి ముందు ఒక ఉపాదాన కారణం ఉన్నదని, దాని ఆధారంగా ఈ సృష్టి జరిగింది అని చెప్పటం కుదరదు. సృష్టికి పూర్వమే ఈ ఆకారం ఉంటే, ఇక ఈశ్వరుడు చేసే సృష్టి ఏమీ లేదు. కాబట్టి దేని సాయమూ

లేకుండానే ఈశ్వరుడు ఈ సృష్టి చేశాడు. అందుకని ఈశ్వరుడికి శరీరం లేదు. అయితే భక్తులు ఆయనను ఏ రూపంలో ఆరాధిస్తే, తాను ఆ రూపం పొందుతాడు. అందుచేత చేతనమే ఈశ్వరుడు. పరాచితి (పరాశక్తి) ఆయన శరీరం. ఈ చితియే మహాసత్త. సామ్రాజ్ఞి పరమేశ్వరి. ఆమెయే త్రిపుర. ఆమెలోనే ఈ జగత్తంతా భాసిస్తున్నది. ఆమెనుంచే సృష్టించబడి ఆమెలోనే లయమవుతుంది. అందుకే విజ్ఞుడు ఆ పరారూపాన్నే ధ్యానించాలి. అది వీలు కాకపోతే తనకిష్టమైన రూపాన్ని ధ్యానించవచ్చు. అప్పుడు సర్వోత్తమ శ్రేయస్సు కలుగుతుంది. ఈ మార్గం వదిలి వేరే మార్గాన్ని ఆశ్రయిస్తే ఎన్ని జన్మలెత్తి నా మోక్షం రాదు." అని హేమలేఖ ఈశ్వర స్వరూపాన్ని వివరించింది అంటూ ఏడవ అధ్యాయాన్ని పూర్తి చేశాడు రత్నాకరుడు.

## 16. సంసార బంధనాలు

"గురువుగారూ ! హేమలేఖ పరమేశ్వర స్వరూపాన్ని నిర్ణయించటం ఎలాగో వివరించింది కదా ! ఆ తరువాత ఏం జరిగింది ?" అంటూ అడిగాడు నారాయణభట్టు. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

హేమలేఖ మాటలను విని ఆమె భర్త అయిన హేమచూడుడు, త్రిపురా స్వరూపమైనటువంటి ఆ పరతత్త్వమే మహేశ్వర స్వరూపము అని నిశ్చయించుకున్నవాడై, మనశ్శాంతిని పొంది, త్రిపురా స్వరూపాన్నీ, మంత్ర తంత్రాలను గురుముఖతః తెలుసుకుని, నిశ్చలమైన భక్తితో ఆ దేవిని ఉపాసన చెయ్యటం ప్రారంభించాడు.

ఈ రకంగా కొన్ని నెలలు గడిచినాయి. రాకుమారుడు త్రిపురాదేవి అనుగ్రహం పొందాడు. ఆ దేవి కరుణించింది. అతడికి ఐహికమైన భోగాలమీద విరక్తి పుట్టింది. పరతత్త్వాన్ని గురించి తెలుసుకోవాలనే శ్రద్ధ కలిగింది. ఆ దేవి అనుగ్రహం గనకలేకపోతే పరతత్త్వ విచారము వైపు మనసు వెళ్ళదు. మోక్షానికి ముఖ్యమైనది ఆలోచించే మనస్సు. అది తత్త్వంవైపు పోనంతవరకు మానవుడు ఏం చేసినా ఉపయోగం లేదు.

ఒక రోజు హేమచూడుడు ఏకాంతంగా భార్య దగ్గరకు వచ్చాడు. అతడు దేన్ని గురించో తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. హేమలేఖ అతడికి ఎదురువెళ్ళి, లోపలకు ఆహ్వానించి ఉచితాసనమలంకరింప చేసి, "నాథా ! చాలాకాలానికి వచ్చావు. నీ ఆరోగ్యం బాగున్నది కదా ! ఇంతకాలంగా నా దగ్గరకు రాలేదు. నన్ను చూడకుండా క్షణం కూడా ఉండేవాడివి కాదు, మరి అలాంటిది ఇప్పుడు ఏమైంది ? నన్ను వదిలి ఎలా ఉండగలిగావు? అంటూ అతణ్ణి కౌగిలించుకుని దుఃఖించింది.

ప్రియురాలి స్పర్శతో హేమచూడుడు ఏ మాత్రం వికారం పొందలేదు. అప్పుడు ఆమెతో "నన్ను మళ్ళీ మోహంలో పడెయ్యకు. నేను నిన్ను బాగా అర్థం చేసుకున్నాను. నీ శోకానికి కారణం లేదు. నీకు పరాపర వివేకమున్నది. నిన్ను మోహము ఆవరించలేదు. ఇదివరకు నీ కథ అంటూ ఒకటి చెప్పావు. నీ తల్లి, చెలికత్తె, ఆమె భర్త, పుత్రులు ఎవరు వీరంతా? వాళ్ళేరీ? ఆ విషయం నాకు తెలియలేదు. అది అబద్ధం కాదు. నువ్వు కట్టుకథ చెప్పావని నేననుకోవటం లేదు. కాబట్టి ఆ విషయమంతా నాకు అర్థమయ్యేటట్లుగా వివరించవలసినది. ఇప్పుడు నిన్ను శరణు పొంది అడుగుతున్నాను. కాబట్టి అన్యథా భావించకుండా, నా అనుమానాలు తీర్చవలసినది" అన్నాడు.

ఆ మాటలు విన్న హేమలేఖ ముఖము కడుప్రసన్నమైంది. కనులు వికసించినాయి. "హేమచూడుని ఆ త్రిపురాదేవి కరుణించింది" అని తెలుసుకుంది. అతడు విషయభోగాలపై ఆశపడకుండా ఉన్నాడు, ఆ పరమేశ్వరి శక్తి అతనిలో ఆవహించింది. ఇతనికి తత్త్వాన్ని బోధించటానికి ఇది సరియైన సమయం అని నిశ్చయించుకుని "నాథా ! నువ్వు చాలా అదృష్టవంతుడివి. ఈశ్వరానుగ్రహానికి పాత్రుడవైనావు. లేకపోతే భోగాలయందు విముఖత కలగదు. విషయభోగాల మీద విముఖత, తత్త్వ విచార సుముఖత. ఈ రెండూ ఈశ్వరానుగ్రహంవల్లనే కలుగుతాయి.

ఇక నా కథ చెబుతాను విను.

పరాచితి అంటే - ప్రజ్ఞానమే నా తల్లి.

నా సఖి అంటే - బుద్ధి.

అసతి అంటే - అవిద్య, అజ్ఞానము.

అసతితోనే బుద్ధి స్నేహం చేసింది. అవిద్య సామర్థ్యం అందరికీ తెలుసు, ఉన్నది లేనట్టు, లేనిది ఉన్నట్టు భ్రాంతి కలుగచేస్తుంది. అదే రజ్జు సర్పభ్రాంతి. ఈ అవిద్య కుమారుడే మహామోహము. అతని కుమారుడు మనస్సు. కల్పన మనస్సు యొక్క పెద్ద భార్య.

జ్ఞానేంద్రియాలు - కల్పన కుమారులు.

ఇంద్రియ గోలకాలే - వారి భవనాలు.

భోగ్యవిషయాలను దొంగిలించటమంటే - చిరకాలం మనసులో ఉన్న వాసనలను కూడబెట్టటము ఆ వాసనల అనుభవాలే - స్వప్నభోగాలు.

మహాశన : కల్పన సోదరి. మనసు రెండవ భార్య

మహాశన పుత్రులు – కామక్రోధాలు

నా పట్టణం అంటే – ఈ శరీరం.

నా మహామంత్రము అంటే – ఆత్మస్వరూపస్ఫురణ

ప్రచారకుడు – మనసుకు మిత్రుడు, ప్రాణము అడవులు అంటే – నరకాలు.

నేను బుద్ధితో కలవటం అంటే – సమాధి స్థితి.

నా తల్లి వద్దకు వెళ్ళటం అంటే – మోక్షము

రాజా ! నా వృత్తాంతము, నీ వృత్తాంతము కూడా ఇదే. దీని గురించి బాగా తెలుసుకుని శ్రేయస్సు పొందవలసినది అన్నది. అంటూ ఎనిమిదవ అధ్యాయం పూర్తి చేశాడు రత్నాకరుడు.

## 17. ఆత్మ అంటే వెలుతురా ? చీకటా ?

"గురువుగారూ ! హేమలేఖ సంసారబంధనాల గురించి తననాధుడికి వివరించింది కదా ! ఆ తరువాత ఏమైందో వివరించండి" అన్నాడు కృష్ణశర్మ. వివరించటం ప్రారంభించాడు రత్నాకరుడు.

హేమలేఖ మాటలు విన్న హేమచూడుడు చాలా ఆశ్చర్యపోయి గద్గద స్వరంతో "దేవీ నీవు చాలా నైపుణ్యము గలదానవు. నీ జ్ఞాన వైభవము అమోఘము. అద్వితీయము. నాకు అనేక విషయాలు తెలియచేశావు. నా వృత్తాంతము ఇది అని నాకు తెలియచెప్పావు. నీ తల్లియైన పరాచితి ఎవరు ? ఆమెకు ఎందుకని పుట్టుకలేదు? అసలు మనమెవరము. మన స్వరూపం ఏమిటి ?" అన్నాడు. దానికి హేమలేఖ "రాకుమారా ! ఇది చాలా రహస్యమైన విషయము. అతిశ్రద్ధగా విను. నిర్మలమైన మనస్సుతో ఆత్మతత్వాన్ని గురించి విచారించు.

ఆత్మ అనేది కంటికి కనిపించేది కాదు. వాక్కుతో చెప్పబడేది కాదు. అందుచేత దాన్ని గురించి ఏ విధంగానూ చెప్పలేము. ముందుగా నీ ఆత్మ స్వరూపం గురించి నువ్వు తెలుసుకో. ఆ తరువాత నీ తల్లియైన త్రిపురాదేవి గురించి తెలుసుకుందువుగాని. ఆత్మస్వరూపాన్ని గురించి ఎక్కడా చెప్పబడలేదు. చెప్పేవారు కూడా లేరు. శుద్ధబుద్ధి స్వరూపమైన నీ స్వరూపమే నీ ఆత్మ. శుద్ధబుద్ధి అంటే విషయభోగాలవైపు మొగ్గుచూప బుద్ధి. ఆ బుద్ధికి కూడా ఆశ్రయమైనది ఆత్మ. కంటికి కనిపించేదంతా నిషేధిస్తే చివరకు

మిగిలేదే ఆత్మ. ఆత్మ అనేది అన్ని జీవులయందు పిపీలికాది బ్రహ్మ పర్యంతము నిండి ఉన్నది. అంటే ఆత్మ అన్నింటినీ ప్రకాశింపచేస్తుంది. కాని అది దేనిచేత ప్రకాశింప చెయ్యబడదు. అది అన్నిచోట్లా ఉంటుంది. ఏ ప్రమాణాలకూ అందదు. దేనితోనూ నిరూపితం కాదు. ఎవరైనా "ఆత్మ స్వరూపాన్ని నాకు తెలియచెయ్యి' అని అడిగితే అతడు 'నా కళ్ళు నాకు చూపించు" అని అడిగినట్లే. గురువుకూడా నీకు ఆత్మ సాక్షాత్కారానికి మార్గాన్ని మాత్రమే చెప్పగలడు. అంతేకాని ఆత్మసాక్షాత్కారం చేయించలేడు. సాధకుడి మనసు బహిర్ముఖమైనప్పుడు, అంటే విషయవాంఛల మీద లగ్నమయినప్పుడు అతడు ఆత్మకు దూరమవుతాడు. అప్పుడు గురువు శిష్యుడి మనస్సు అంతర్ముఖం చేసి ఆత్మసాక్షాత్కారానికి మార్గం చూపిస్తాడు. ఆ మార్గాన్ని నేను ఇప్పుడు నీకు వివరిస్తాను. శ్రద్ధగా వినవలసినది.

నీకు 'నాది' అనిపించేదంతా నువ్వు కాదు. నీది అంతకన్నా కాదు. నాది అనే దానికన్న వేరైనది ఏదైతే ఉన్నదో అదే నీ నిజస్వరూపము. వెళ్ళి ఏకాంతంగా కూర్చుని, నీ వివేకాన్ని ఉపయోగించి పరిశీలించు. నాది అనిపించే వాటన్నింటినీ వదిలెయ్యి. చివరకు మిగిలేదేదో అదే నీ ఆత్మ. భార్య, పిల్లలు, ఆస్తిపాస్తులు ఏవీ నువ్వు కాదు. నీవి కావు. వీటన్నింటినీ వదిలెయ్యి. దేన్నయితే వదలటానికి సాధ్యం కాదో, అదే నీ ఆత్మ అని తెలుసుకుని శ్రేయస్సు పొందు." అన్నది.

ఆ మాటలు విన్న రాకుమారుడు గుర్రమెక్కి నగరందాటి, అవతలగా ఉన్న తన ఉద్యానవనం చేరాడు. అందులో స్ఫటిక నిర్మితమందిరం ఉన్నది. ఆ మందిరంలోకి ప్రవేశించాడు. సేవకులందరినీ వదిలేశాడు. "నేను ఏకాంతంగా ఉండటానికి వెడుతున్నాను. నా కోసం ఎవరు వచ్చినా, చివరకు రాజుగారైనా సరే లోపలకు రానీయవద్దు" అని చెప్పి మందిరాంతర్భాగాన తొమ్మిదవ అంతస్తుకు వెళ్ళి, అక్కడ సుఖంగా కూర్చుని మనసును ఏకాగ్రం చేసి హేమలేఖ చెప్పినట్లుగా ఆలోచించటం ప్రారంభించాడు.

లోకంలోని జనం అంతా మోహంతో పడిపోయి ఉన్నారు. వీరెవరికీ తన ఆత్మగురించి తెలియదు. అందరూ తమ లాభం కోసం ఏదో ఒక పని చేస్తుంటారు. వేదశాస్త్రాలు చదివినా, వ్యవసాయం చేసిన, వ్యాపారం చేసినా అంతా తమలాభం కోసమే. ఆత్మను గురించి తెలుసుకోకుండా ఏ పని చేసినా ఉపయోగం ఏమీ లేదు. ఈ రకంగా ఆలోచించి ముందుగా దేహాన్ని గురించి ఆలోచిస్తున్నాడు.

దేహం అంటే ఆత్మకాదు. అని ఆలోచించటం ప్రారంభించాడు. రక్తము, మాంసము, ఎముకలు, మజ్జ చర్మము, మలమూత్రాలు వీటితో కలిసినదే ఈ దేహము. ఇది ప్రతిదినము వృద్ధి పొందుతూ ఉంటుంది. లేదా క్షీణిస్తూ ఉంటుంది. చివరకు నశిస్తుంది. అలాంటి

కనిపించింది. అలాగే స్వప్రకాశము, చిదేక రసము, అయిన ఆత్మతత్త్వము పూర్వవాసనలచే కలిగిన మనోవికల్పముచే ఆవరించబడిన దానివలె ఉంటుంది. ఎప్పుడైతే మనసును నిగ్రహించామో, అప్పుడు ఆ వికల్పాలు అన్నీ నశిస్తాయి. అప్పుడు ఆత్మస్వరూపము గోచరిస్తుంది. కుండను చీకటి ఆవరించి ఉన్నట్లే ఆత్మకన్న ఇతరములైన మానసిక భావాలు వేరుగా ఉంటాయి అనుకోవాలి.

బంగారు వస్తువును ఒకచోట జాగ్రత్తగా దాచి ఉంచాము. అది దాచిపెట్టిన చోటు మరచిపోయాము. ఆలోచించగా కొంతసేపటికి వస్తువును దాచిపెట్టినచోటు గుర్తు వచ్చింది. అప్పుడు అది దొరికింది.

ఇక్కడ వస్తువు క్రొత్తగా కనిపించలేదు. అది దాచినచోటు గుర్తు వచ్చింది. అప్పుడు వస్తువు దొరికింది. అలాగే "బాహ్యవస్తు నిరోధంవల్ల ఆత్మభాసిస్తుంది" అనే మాట సరియైనది కాదు. నిత్యప్రాప్తమైనది ఆత్మ.

అయితే నిత్యప్రాప్తమైన ఆత్మ నిత్యమూ ఎందుకు కనిపించదు ? అనేదే ప్రశ్న. ఒక వ్యక్తితో పరిచయం లేనంతవరకూ అతను ఎదురుగా ఉన్నప్పటికీ అతనే ఆ వ్యక్తి అని తెలుసుకోలేము. అలాగే గతంలో ఆత్మ పరిచయం లేదు కాబట్టి ఆత్మను మనం గుర్తించలేకుండా ఉన్నాము. రాకుమారా ! ఆత్మకు సంబంధించిన పూర్వజ్ఞానం లేకపోవటంచేత నీలోనే ఉన్న ఆత్మతత్త్వాన్ని నువ్వు గుర్తించలేకుండా ఉన్నావు. నాథా ! బాహ్యవిషయాలను నిరోధించిన తరువాత నీకు చీకటి కనిపించింది కదా ! ఈ రెంటికీ మధ్య, అంటే ఇంద్రియ నిగ్రహానికి, అంధకారానికీ మధ్య ఉన్నదే ఆత్మస్వరూపము. ఎప్పుడూ దాన్ని గురించే భావనచెయ్యి. అదే పరమానందాన్నిస్తుంది. మహామోహంతో ఆవరించబడినవారు, బాహ్యవిషయాలపైనే దృష్టి నిలిపేవారు ఆత్మనుగురించి తెలుసుకోలేరు. ఆత్మజ్ఞానం పొందలేరు. శాస్త్ర పాండిత్యము గలవారు, తార్కికులు, వీరెవరూ ఆత్మస్వరూపాన్ని తెలుసుకోలేరు. అందుచేతనే వారు ఆత్మనుగురించి పరితపిస్తూ ఉంటారు. ఆత్మను బాహ్యేంద్రియాలద్వారా తెలుసుకోలేము. శాస్త్రాలు చదివినా, కర్మలు చేసినా ఆత్మజ్ఞానం రాదు. ఇంద్రియ వ్యాపారం నశించినప్పుడే ఆత్మను గురించి తెలుసుకోగలము. నిర్మలము, నిశ్చలము అయిన మనస్సుకే ఆత్మను గురించి తెలుస్తుంది. మనముందు పడుతున్న నీడను మనం ఎంత పరుగెత్తినా పట్టుకోలేము. అదే విధంగా ఇంద్రియాలద్వారా ఆత్మను పొందలేము.

అద్దంలో అనేక వస్తువుల ప్రతిబింబాలు కనిపిస్తుంటాయి. అప్పుడు అజ్ఞానియైన బాలుడు ప్రతిబింబాన్నే చూస్తాడు కాని అద్దాన్ని చూడలేడు. అలాగే ఆత్మ అనే అద్దంలో

జగత్తంతా ప్రతిబింబిస్తున్నప్పుడు, గతంలో ఆత్మను ఎరగం కాబట్టి ఇప్పుడు ఆ ఆత్మను గుర్తించలేము. అంటే సామాన్యుడు ఆత్మచేత కల్పితమైన ప్రపంచాన్ని చూస్తున్నాడు కాని ఆత్మను గుర్తించలేడు.

నాథా ! ప్రపంచము అంటే జ్ఞానము, జ్ఞేయము మాత్రమే. జ్ఞానానికి విషయమైన ప్రపంచం ఆత్మ కాదు. అది అనాత్మ. ఇంద్రియ గ్రాహ్యము. అంటే ఇంద్రియాలద్వారా దాన్ని తెలుసుకోవచ్చు. మరి జ్ఞానము – ఇంద్రియ గ్రాహ్యం కాదు. అది స్వయం ప్రకాశమైనది. చీకటిలో వస్తువులు ప్రకాశించాలంటే దీపం కావాలి. కాని జ్ఞానం ప్రకాశించటానికి ఏమీ అక్కరలేదు. జ్ఞానజ్యోతి లేకపోతే ఈ ప్రపంచమే లేదు. ఈ ప్రపంచం అంతా జ్ఞానాధీనమై ఉన్నది. జ్ఞాత అనగా – తెలుసుకొనేవాడు తాను ఉన్నాను అని తెలుసుకోవటానికి, తనకన్న ఇతరమైన సాధనాలను అపేక్షించడు. సూర్యుడు ప్రకాశించాలంటే దీపాలు అవసరం లేదు. జ్ఞానమనేది ఒకటే. రెండు లేవు కాబట్టి సాధ్య, సాధనాలుండవు. ఈ రకంగా ఆత్మ స్వయంప్రకాశము, సత్యము, నిత్యము అయి ఉన్నది. ఇంకా దీనిమీద తర్కం అనవసరం. జ్ఞానం లేదన్నవాడు తాను లేని వాడవుతాడు. ప్రతిబింబం కనిపించే అద్దం లేదనటం ఎంత అవివేకమో, సర్వ ప్రపంచానికి ఆధారమైన జగత్తు లేదనటంకూడా అంత అవివేకమే.

రాజా ! దేశకాలాలుకూడా ఈ జ్ఞానంలో అంతర్భూతాలే, కాబట్టి అవి జ్ఞానానికి పరిమితి కలిగించలేవు. సూర్యకాంతిలో ఉన్న కుండ ఆ కాంతిని పరిమితం చెయ్యలేదు. అయితే ఆ కాంతి కుండయొక్క ఏ భాగం మీద పడుతుందో, ఆ భాగం మాత్రమే ప్రకాశిస్తుంది. ఆకాశంలో అనేక దృశ్యాలు కనిపిస్తున్నాయి. అయినప్పటికీ అవి ఆకాశం యొక్క సర్వవ్యాపకత్వాన్ని సంకోచింపచెయ్యలేవు. అదేవిధంగా జ్ఞానంలోనే అయిన దేశకాలాలు జ్ఞానాన్ని పరిమితం చెయ్యలేవు.

కాబట్టి రాకుమారా! నీ స్వరూపాన్ని గురించి సూక్ష్మదృష్టితో ఆలోచించు. ఏ చైతన్యంలో అయితే ఈ జగత్తంతా ప్రకాశిస్తోందో, అదే నీ స్వరూపము అని తెలుసుకో. అన్ని రకాల కుండలయందు ఉండే మట్టి ఒకటే. అలాగే జగద్వస్తువులన్నిటియందు ఉండే చైతన్యము ఒక్కటే. అదే నీ ఆత్మ.

సామాన్య చైతన్యము, సుషుప్తి రెండూ ఒకటి కాదు. సుషుప్తి అనేది ఒక అవస్థ. కాని చైతన్యము ఎల్లప్పుడు ఉంటుంది. దాన్ని గుర్తించటానికి కొన్ని మార్గాలు చెబుతాను విను.

**1. నిద్రా, జగత్తులకు మధ్యనున్న అతిసూక్ష్మ కాలం :**

సామాన్య చైతన్యము అంటే విషయాకారాన్ని పొందనటువంటి జ్ఞానం. నిద్ర అంటే – సుషుప్తి. జాగ్రత్త అంటే – విషయజ్ఞాన పరంపర. జాగ్రదవస్థలో ఇంద్రియాలు అంతః కరణ నుంచి బయటకు వచ్చి బాహ్యవిషయాలు గ్రహిస్తాయి. అదే ఇంద్రియాలు స్వప్నావస్థలో మనసులో ప్రవేశించి, మనసుయొక్క రూపాన్నే పొంది, మనసులో దాగిఉన్న సాంసారికానుభవరూపమైన సంస్కారాలతో సంబంధం పెట్టుకుని వాటినే గ్రహిస్తాయి. అవే స్వప్నాలు. ఇక సుషుప్తిలో మనసు ఇంద్రియాలతో కలిసి, తనకు మూలకారణమైన ప్రకృతిలో లయమవుతుంది. అప్పుడు తమోగుణము మిగిలిన గుణాలను ఆవరిస్తుంది. ఆ స్థితిలో ఆత్మకనపడి, కనపడనట్లుగా ప్రకాశిస్తుంది. మనసు విషయోన్ముఖం కాదు. అందుకని ఆత్మ విషయాలను గ్రహించదు. అందుకని అది విషయాకారం పొందదు. అప్పుడు పూర్తిగా పైకి రాని తమోగుణం ఆత్మను ఆవరించలేదు. అందుచేత ఆత్మ నిరాకారంగా ప్రకాశిస్తుంది. దీన్నే 'సామాన్య చైతన్యము' అంటారు. ఇది నిర్వికల్పమైనది.

2. రెండు భిన్న జ్ఞానాల మధ్య సామాన్య చైతన్యము ప్రకాశిస్తుంది. రెండు భిన్న జ్ఞానాలు అంటే

1. ఘటాకారానికి సంబంధించినది.

2. పటాకారానికి సంబంధించినది.

ఈ రెండు జ్ఞానాలు ఒకదాని తరువాత ఒకటి కలిగినప్పుడు, ఈ రెంటి మధ్యకాలంలో ఉండే నిరాకార జ్ఞానం. అదే సామాన్య చైతన్యం.

3. ద్రష్ట అయిన ఆత్మచైతన్యానికి, దృశ్యమైన విషయ చైతన్యానికి మధ్యకాలం : కొంతమంది సంవిద్వేషాల మధ్యకాలంలోనిది సామాన్యచైతన్యం అంటారు. సంవిత్తు అంటే ద్రష్ట చైతన్యం. దీన్నే 'దృక్' అంటారు. అహంరూపంలో ఉన్నటువంటి ద్రష్ట. వేద్యము అంటే తెలియబడునది.

నీరు చెరువులో ఉంటే చెరువు ఆకారంలో ఉంటుంది. పొలంలో ఉంటే పొలం ఆకారంలో ఉంటుంది. మరి చెరువులోనుంచి పొలంలోకి ప్రవహించేటప్పుడు ఏ ఆకారమూ ఉండదు. అలాగే ద్రష్టచైతన్యము (అహం అనేది) శరీరాకారంలో ఉండి, ఇంద్రియాలద్వారా ఆకాశంలో ఉన్న సూర్యుని వద్దకు ప్రసరించి, సూర్యబింబాన్ని వ్యాపించి సూర్యబింబాకారాన్ని పొందుతుంది. అది దృశ్యచైతన్యరూపము. ఈ మధ్య కాలంలో ఉన్న చైతన్యం నిరాకారము. అదే సామాన్య చైతన్యము.

అదే ఆత్మ. నీ యొక్క నిజస్వరూపము. నిజస్వరూపాన్ని తెలుసుకున్నప్పుడు ఇంకా మోహం ఉండదు. ఆత్మనుగురించి తెలుసుకోకపోవటంవల్లనే ఈ జగత్తంతా దుఃఖమయంగా కనిపిస్తోంది. అద్దంలో కనిపించే పులి నిజమైనది కాదు. అది ప్రతిబింబం మాత్రమే అని తెలుసుకున్నవాడు దాన్నిచూసి భయపడడు. అలాగే ఈ జగత్తు నిజంకాదు. అంతా మిథ్య అని తెలుసుకున్నవాడు దుఃఖాలు పొందడు. ఆత్మనుగురించి తెలుసుకోకపోవటంవల్లనే ఈ జగత్తు దుఃఖాలను అనుభవిస్తోంది. ఆత్మకు సుఖదుః ఖాలు, పాపపుణ్యాలు ఏవీ లేవు. అది దేనినీ గ్రహించదు. దానిని గ్రహించేవాడుకూడా ఎవడూ లేడు. ఇది సర్వానికీ ఆధారం. అన్ని రూపాలలోనూ ఉంటుంది. కాని దీనిలో ఏమీ ఉండవు.

ఆత్మను చూడాలంటే చాలా కాలం ప్రయత్నం చెయ్యనవసరం లేదు. క్షణకాలంపాటు బాహ్యవిషయాలవైపు మనసు వెళ్ళకుండా చేసి బాహ్యవిషయాలను మనసులోకి రానీయకుండా చేస్తే చాలు. రూపంతోలేని ఆత్మను చూడటం ఎలా ? అని అడగవద్దు. 'ఉన్నాను' అనే భావంతోనే నీ ఆత్మను చూడు. బాహ్యవస్తువుల వైపు పరుగులు పెట్టే మనసును నిరోధించు. అంతర్ముఖం చెయ్యి. మనసు నిశ్చలం చెయ్యి. గ్రుడ్డివాడిలాగా ఉండు. మనోవ్యాపారములు ఏవీ ఉండకూడదు. నేను చూస్తున్నాను అనేదికూడా మనోవ్యాపారమే. అందుకే దాన్ని కూడా నిరోధించు.

దర్శనము, అదర్శనము అనేవాటిని వదలివెయ్యి. అప్పుడు ఆ స్థితిలో ఏది మిగులుతుందో అదే నీవు. అదే ఆత్మ. దాన్నే సేవించు" అన్నది హేమలేఖ.

ప్రియురాలి ఉపదేశాన్ని విని, ఆత్మదర్శనం చేసుకుని, బాహ్యజగత్తును మరిచిపోయి చాలాకాలం సమాధిస్థితిలో ఉండిపోయాడు. అంటూ తొమ్మిదవ అధ్యాయాన్ని పూర్తి చేశాడు రత్నాకరుడు.

## 19. విశాలనగరమే - విద్యానగరము

"గురువుగారూ ! ఆరకంగా హేమ చూడుడు. సమాధి స్థితిలోకి వెళ్ళి పోయాడు కదా! ఆ తరువాత ఏంజరిగిందో వివరించండి" అన్నాడు కృష్ణశర్మ. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

తనభర్త సామాన్య చైతన్య స్వరూపస్థితి పొందాడని తెలుసుకుని హేమలేఖ అతని ఏకాగ్రతకు భంగం కలిగించకుండా చూస్తుండిపోయింది. కొంతసేపటికి అతడు ఆ స్థితిలోంచి మేల్కొన్నాడు. మెల్లిగా కళ్ళు తెరిచి భార్యనూ, బాహ్య జగత్తునూ చూశాడు.

ఇందాక సామాన్య చైతన్యంలో ఐక్యమైనస్థితి పొందినప్పుడు పొందిన విశ్రాంతి మళ్ళీ పొందాలి అనుకున్నాడు. మళ్ళీ సమాధిలోకి వెళ్ళటానికి కళ్ళు మూసుకోబోయాడు. వెంటనే హేమలేఖ వారించి "నాథా ! నువు ఏంచెయ్యబోతున్నావు ? కళ్ళు మూసుకుంటే కలిగే లాభమేమిటి? తెరిచి ఉంటే వచ్చే నష్టం ఏమిటి? ఇందాక ఏం పొందావు ? ఇప్పుడు ఏం పొందలేకపోయావు? నీ పరిస్థితి ఏమిటో ఒక్కసారి చెప్పవలసినది" అన్నది.

సమాధానం చెప్పటం ఇష్టం లేదు. హేమ చూడుడికి అయినా తప్పదు అన్నట్లుగా, చాలా నెమ్మదిగా "చాలాకాలానికి మంచి విశ్రాంతి పొందాను. గతంలో ఏనాడూ ఇంత విశ్రాంతి పొందలేదు. ఆహార వ్యవహారాలు, స్త్రీ సంగమము వంటివి అన్నీ చెరకుపిప్పిని నమిలినట్లుగా రసహీనంగా ఉన్నాయి. అవన్నీ గడ్డితో సమానమైనవి. అనుభవించిన వాటినే మళ్ళీ అనుభవిస్తున్నాను. ఈ సుఖాలింక చాలు. అజ్ఞానంతో ఇంతవరకు శాశ్వతమైన సుఖాన్ని తెలుసుకోలేకపోయాను. తన దగ్గరే ఉన్న అనంతమైన ధనరాసులను ఎరుగని బిచ్చగాడిలాగా, నాలోనే ఉన్న ఈ సుఖ సముద్రమును గుర్తించలేకపోయాను. దుఃఖాలను కలుగచేసే విషయసుఖాలే శ్రేష్టము అనుకొన్నాను. అవే శాశ్వతము అనుకుని పొరబడ్డాను. ఈరకంగా దుఃఖాల పాలయినాను. ఇంత హాయి పొందలేకపోయాను. లోకులకు సుఖదుఃఖ వివేచన లేదు. సుఖాలు కోరుకుని దుఃఖాలను మూటకట్టు కుంటున్నారు. దేవీ ! నాకిప్పుడు సుఖ స్వరూపమైన సమాధి స్థితి కావాలి. నువ్వు ఎంత దురదృష్టవంతురాలవు. సామాన్య చిద్రూపం తెలిసికూడా, సమాధిస్థితివదిలి, వ్యర్థమైన ఈ భౌతిక, ఐహిక సుఖాల కోసం ఎందుకు వెంపర్లాడుతున్నావు?" అన్నాడు.

ఆ మాటలు విన్న హేమలేఖ చిరునవ్వుతో "నాథా ! పరమ పావనమైన సామాన్య చైతన్యము నీకు తెలియలేదు. అంటే – 'అదినేనే' అనుభవం ఇంకా నీకు కలగలేదు. అది కలిగి, ద్వైత ప్రపంచ దోషవాసనలేని వారికి, కళ్ళు తెరిచినంత మాత్రాన ఆ అనుభవం నశించదు. వారు పొందిన స్వాత్మైక్యస్థితికీ, నీ స్థితికీ చాలా తేడా ఉన్నది. గట్టిగా చెప్పాలంటే భూమ్యాకాశాలకున్నంత తేడా ఉంది. ఆ స్థితి నీ కింకా రాలేదు.

సామాన్య చిద్రూపం నీకు కొద్దిగా తెలిసింది. కొద్దిగా అంటే ఏమీ తెలియనట్లే లెక్క. కళ్ళు మూసుకుంటేనో, తెరిస్తేనో లభించే స్థితి కాదది. ఏదో చేస్తేనే లభించేదయితే, అది పూర్ణము, నిత్యము, స్వయం ప్రకాశము ఎలా అవుతుంది.?

రాకుమారా ! మోహంవల్లనే నీకీ జ్ఞానం కలిగింది. ఈ ఆత్మలో ఒక మూల కొన్ని కోట్ల బ్రహ్మాండాలు దాగి ఉన్నాయి. అటువంటి ఆత్మ కేవలము కళ్ళు మూసుకున్నంత మాత్రంచేత కనిపించకుండా పోతుందా? కాబట్టి సామాన్య చైతన్య స్వరూప తత్త్వాన్ని

వివరిస్తాను విను. శరీరమే ఆత్మ అనే భ్రాంతి ఒక గ్రంధి అంటే ముడిలాంటిది. ఆ ముడి విడిపోయే వరకూ ఆత్మస్వరూప సుఖం కలగదు. అజ్ఞానము అనే త్రాడుకు ఇలాంటివి కొన్నికోట్ల ముడులున్నాయి. అజ్ఞానమనే త్రాడును కోస్తే తప్ప దేహమే ఆత్మ అనే భ్రాంతి పోదు.

అద్దంలో కనిపించే ప్రతిబింబంలాగా, ఈ జగత్తును అనాత్మగా భావించటం రెండవ గ్రంధి. అద్దంలో కనిపించేది కేవలం ప్రతిబింబం. అసలు రూపం కాదు. అలాగే జగత్తు ఆత్మ కాదు. ద్వైతభావన జీవుడు, ఈశ్వరుడు వేరువేరు అనేది మూడవ గ్రంధి. ఈ ముడులను విప్పినప్పుడే పురుషునికి బంధ విముక్తి కలుగుతుంది. ఇదే మోక్షము. మోక్షము అంటే క్రొత్తగా వచ్చేదేదో కాదు. భ్రాంతి నాశనమే. కళ్ళు మూసుకున్నప్పుడు నువు చూసినదే నీ రూపం. అప్పుడు పొందిన అనుభూతే నీ నిజరూపం. అదే శుద్ధ జ్ఞాన స్వరూపం. సమస్త సంసారులకీ ఆధారమైన పెద్ద అద్దం. రాజా ! అన్నింటికీ ఆధారమైన ఆ ఆత్మ ఎప్పుడు ఏ రూపంలో లేదు ? అన్నివేళలా, అన్ని రూపాలలోనూ ఉంటుంది. అటువంటి ఆత్మ ఒకానొక సమయంలో ప్రకాశింపదు అంటే అది అసత్యం కదా ! ఆత్మ ప్రకాశించనటువంటి స్థితి ఉండదు. ప్రతిబింబానికి ఆధారం అద్దం.

అటువంటి అద్దం లేకపోతే ప్రతిబింబం ఏ రకంగా ఉండదో, అలాగే దేశ కాలామానాలకు ఆధారమైన ఆత్మ లేకపోతే, దేశ కాలమానాలనేవే ఉండవు. ఆత్మను దేశ కాలాదులచే పరిమితం చెయ్యటం సాధ్యంకాదు. అంటే-ఆత్మ ఇక్కడ ఉన్నది, ఇక్కడ లేదు అని చెప్పటం సాధ్యంకాదు. ఆత్మ సర్వాంతర్యామి. కాబట్టి ఆత్మ లేకపోతే ఏదీ ఉండదు. అందుచేత, కళ్ళు మూసుకుంటే కనుపించకుండా, కళ్ళు తెరిస్తే కనుపించటం జరగదు.

"సామాన్య చైతన్యాన్ని నేను ఇప్పుడు ఈ రూపంలో చూస్తున్నాను" అని అనుకున్నంతకాలము ఆ స్థానము నీకు దక్కదు. ఈ భావన కూడా ఒక అజ్ఞానపు గ్రంధి. అవిధంగా లభించేది పూర్ణ చైతన్యం కాదు. ఆత్మ లేనిచోటు లేదు. కళ్ళు మూసుకుంటేనే ఆత్మ కనిపిస్తుంది అంటే, ఆత్మకు పరిమితి కల్పించినట్లవుతుంది. అటువంటి ఆత్మ, తనలో వేసిన కట్టెలను అగ్ని బూడిద చేసినట్లుగా, చరాచర జగత్తునూ తనలో లీనం చేసుకుంటుంది. ఆ విషయం గనక తెలుసుకున్నట్లైతే నీకు తెలియవలసినది ఏదీ ఉండదు. మనసును నిగ్రహించు. నీ హృదయంలోనే ఆత్మను చూస్తున్నాననే భావన కూడా ఒక గ్రంధే. దాన్ని కోసెయ్యి. బ్రహ్మానంద రూపమైన ఆత్మను దర్శించు, అద్దంలో ప్రతిబింబాన్ని చూసినట్టుగా నీలోనే సమస్త లోకాన్ని దర్శించు.

మొదటగా లోపల, బయటా కూడా ద్వైత ప్రపంచాన్ని ఆత్మగా చూస్తున్నాననే భావన కలగాలి. ఆ తరువాత అన్నింటినీ ఆత్మగానే చూస్తున్నాననే భావన కలగాలి.

తరువాత అన్నింటినీ ఆత్మగానే చూడాలి. ఆ తరువాత అన్నిటిలోనూ నేనే ఉన్నాను అనే భావన రావాలి. అదే నీ ఆత్మరూపం. దాన్ని దర్శించటానికి ప్రయత్నించు" అన్నది.

భార్య చెప్పిన మాటలు విన్న తరువాత హేమచూడు ని అంతఃకరణ పరిశుద్ధమైంది. కళ్ళు మూసుకుంటేనే ఆత్మ దర్శనమవుతుందనే భ్రాంతి తొలగిపోయింది. హేమలేఖ చెప్పినట్లే మొదట అన్నింటినీ ఆత్మగానే చూసి, చివరకు అన్నిటా తానే ఉన్నాను. అనే భావన చేశాడు. గతంలో నేను అంటే శరీరము అని ఎంతగా నమ్మడో, ఇప్పుడు నేను అంటే ఆత్మ అని నమ్ముతున్నాడు. ఆ భావనతోనే అన్ని పనులు చేస్తున్నాడు. జీవన్ముక్తుడైనాడు.

హేమచూడుడు తన భార్యతోనూ, ఇతర స్త్రీలతోను విహరించాడు. రాజ్యాలు జయించాడు. శాస్త్రాలు చదివాడు. ఇతరులకు ఉపదేశించాడు. యజ్ఞయాగాదులు చేశాడు. ఈరకంగా ఇరవైవేల సంవత్సరాలు రాజ్యం చేశాడు.

కొడుకు జీవన్ముక్తుడైనాడని తండ్రి ముక్తాచూడుడు తెలుసుకున్నాడు. అతడు ఇదివరకటిలా లేడు. కష్టం కలిగితే బాధ పడటం లేదు. సుఖం కలిగితే సంతోషించటం లేదు. లాభనష్టాలు, జయాపజయాలు, కష్టసుఖాలు, శత్రుమిత్రులు అన్నీ సమానంగానే చూస్తున్నాడు. తనకు ఏవీ అంటకుండా విధులు నిర్వర్తిస్తున్నాడు. ఒకనాడు ముక్తా చూడుడు కుమారుడి దగ్గరకు వచ్చి అతను ఈ విధంగా ఉండటానికి కారణమడిగాడు.

హేమ చూడుడు తనస్థితి గురించి తండ్రికి, తమ్ముడికి వివరించి వారికి కూడా పరతత్త్వాన్ని ఉపదేశించాడు. వారు జీవన్ముక్తులైనారు. ఇక మంత్రులు, సేనాపతులు, సేనా సమూహము, దాసదాసీజనము, ఒకరేమిటి ఆబాలగోపాలము పరతత్త్వాన్ని గురించి తెలుసుకుని జీవన్ముక్తులైనారు. విశాలనగరంలో అందరూ విద్యావంతులే. అందరూ పరతత్త్వాన్ని గురించే చర్చించేవారు. చివరకు శుకశారికాలు కూడా పరతత్త్వాన్ని గురించే మాట్లాడేవి. పూర్వజన్మ కర్మవల్ల పనులు చేసేవారు. మంచిగాని, చెడుగాని జరిగిపోయిన దాన్ని గురించి ఆలోచించరు. ఏపనిచేసినా అది కర్తవ్యము అన్నట్లుగా చేసేవారు. సనకసనందనాది మహర్షులు పరతత్త్వంతో విరాజిల్లుతున్న విశాల నగరాన్ని చూసి 'విద్యానగరము' అని దానికి నామకరణం చేశారు. అంటూ పదవ అధ్యాయాన్ని పూర్తి చేశాడు రత్నాకరుడు.

## 20. జగత్స్వరూపం

"గురువుగారూ! హేమలేఖ కారణంగా విశాల నగరము విద్యానగరంగా పిలువ బడింది. సత్సాంగత్యము వల్ల మంచే జరుగుతుంది అనటానికి ఇది మంచి ఉదాహరణ.

విద్యానగరంలో అందరూ జీవన్ముక్తులైనారు. తరువాత ఏంజరిగిందో వివరించండి" అన్నాడు నారాయణభట్టు వివరించటం ప్రారంభించాడు రత్నాకరుడు.

అత్యద్భుతమైన హేమచూడుని కథను విన్న భార్గవుడి మనసులో ఒక చిన్న అనుమానం వచ్చింది. "గురుదేవా ! మీరు చెప్పిన కథ చాలా బాగున్నది. అద్వైతరూపమైన జ్ఞానమే ఆత్మస్వరూపం అని చెప్పరు. ఈ విషయం అనుభవ విరుద్ధంగా ఉంది. ఏ సాధనంతోనూ కూడా తెలుసుకోటానికి వీలుగా లేదు. చూసేది, చూడబడేది. రెండూ పరస్పర భిన్నములైనవి. అని ప్రత్యక్షప్రమాణం వల్ల తెలుస్తోంది. అందుచేత దృశ్యం అంటే చూడబడేది కూడా చితియే అని చెబుతున్నారు. అది అనుభవ విరుద్ధంగా ఉన్నది. మీరు చెప్పిన మాటను కేవలం విశ్వాసంతో ఒప్పుకోవాలే తప్ప, ప్రత్యక్ష అనుమాన ప్రమాణాలకు అనుగుణంగా లేదు. దేనికీ అందటం లేదు. కాబట్టి దయ ఉంచి నాకు ఈ విషయాన్ని పూర్తిగా వివరించండి". అన్నాడు. ఆ మాటలు విన్న దత్తాత్రేయుడు "పరశురామా ! ప్రపంచం యొక్క తత్త్వాని చెబుతాను వినవలసినది.

ఈ జగత్తుకు ఉత్పత్తి ఉన్నట్లు చూస్తున్నాము. అంటే జగత్తు సృష్టి జరుగుతోంది. అంటే ఇది ఒక కారణము నుండి పుట్టిన కార్యమే. సృష్టి క్రొత్తగా కనిపిస్తోంది. అసలు ఈ ప్రపంచం ఎప్పుడూ క్రొత్తగానే ఉంటుంది. అంటే ప్రపంచం ప్రతి క్షణమూ పుడుతూనే ఉంటుంది. కొంతమంది దృష్టిలో అఖండము, ఏకరసము అయిన వస్తువే ప్రపంచము. అది ప్రతి క్షణం కొత్తగా కనిపిస్తుంది కాబట్టి, పుడుతున్నది అంటారు. అందుచేత ఈ విజ్ఞానము కన్నా ఇతరమైన దృశ్యము ఏదీ లేదు. ఈ విజ్ఞానంలో ఏ దేశ కాలవస్తువులు యొక్క ఆకారం ప్రకాశిస్తున్నదో, ఆ క్షణాలను ఘటక్షణము, పట క్షణము అని రకరకాల పేర్లతో పిలుస్తారు. వీటిలో ఉండే విజ్ఞానము అనంతము. కాబట్టి ప్రపంచమంతా విజ్ఞానమే అని విజ్ఞానవాదుల వాదన. ప్రపంచము అఖండమైన ఒకే క్షణమునుండి పుట్టినది అని వారి మతం. కాణాదులవంటి వారు స్థిర, చర పదార్థములతో కూడినదే ఈ ప్రపంచము అంటారు. ఆ కాశాదులు స్థిరము. నిత్యము ఘటాదులు చరమైనవి. అనగా బాహ్యవస్తువులు, బాహ్యవిషయాలే ప్రపంచము అని వారి వాదన.

**1. చార్వాకమతం:** స్థిరమైనదైనప్పటికి, క్షణికమైనదైనప్పటికి దానికి ఉత్పత్తి ఉన్నది. కాబట్టి జగత్తు స్వభావ సిద్ధంగా పుడుతోందే తప్ప, కారణం నుండి పుట్టటం లేదు. అని స్వభావవాదుల వాదన. ఇది సరికాదు. స్వభావ వాదమే చార్వాక మతం. మట్టినుండి కుండే ఎందుకుపుట్టాలి? వస్త్రము ఎందుకు పుట్టకూడదు? అని వారి ప్రశ్న. ఇది అతివాదము. ప్రతిదానికీ కార్యకారణాలుండాలి. ఒక్కొక్కసారి ఏకారణం లేకుండా రోగం

వస్తున్నది అంటున్నాం కదా? అని వీరి ప్రశ్న. అక్కడ కూడా మనకు కనపడని కారణం ఉంటుంది అని గుర్తుంచుకోవాలి. అయితే కారణం లేకుండానే కార్యం పుట్టిందని ఎందుకు అనుకో రాదు?" లోకంలో అధికంగా ప్రచారమున్న వాటిని, అనుభవంలో ఉన్న వాటినే తీసుకుంటాము. అవే సరి అయినవి అని అనుభవం చెబుతోంది. ఈ అనుభవన్నే గనక భ్రమ అంటే, ఒక వస్తువును సేకరించాలనుకున్నవాడు దానికి కావలసిన సామాగ్రిని కూడా సేకరించటం అనవసరం అని చెప్పాలి. ఒకొక్కసారి కారణమున్నప్పటికీ కార్యము ఉండటం లేదు అంటారు. అది సరికాదు. కావలిసిన కారణ సమాగ్రి అంతా లేదు. ఏదో లోపించింది అని అర్థం. అన్ని కార్యాలకు కారణముంటుంది. కాబట్టి చార్వాకులను లెక్కించటం అనవసరం. కాణవమతం ప్రకారము కంటికి కనిపించని పరమాణువులనుండే ప్రపంచం పుట్టింది. ఈ అణువులు లేకపోతే ఏమీ లేదు. కార్యము పరమాణువులకన్న వేరైనది. పూర్తిగా అసత్తు వెలుతురు, చీకటిలాగే అసత్తీ, సత్తు అనే రెండూ ఒకటికాదు. ఒకటే అంటే చీకటి వెలుతురు ఒకేసారి రావాలి.

గుణ సామ్యరూపమైన ప్రకృతి నుంచే జగత్తు పుట్టింది అనటం సరికాదు. ప్రళయకాలంలో ప్రకృతి గుణసామ్యంతో ఉంటుంది. ప్రళయాంతంలో దానిలో వైషమ్యము ఏర్పడి ప్రపంచంగా పరిణమిస్తుంది. తిరిగి ప్రళయకాలంలో సామ్యావస్థ పొందుతుంది. అని సాంఖ్యులంటారు. ఈ మార్పులు కలగటానికి కారణం ఏమిటి ? చేతనమైన వస్తువులేనిదే జడమైన ప్రకృతి తనంతతానుగా మారదు.

ఈ విధంగా ప్రత్యక్ష అనుమాన ప్రమాణాల ననుసరించి ఆలోచిస్తే, అసలు ఈ ప్రపంచానికి కారణము ఏమిటి ? దీనికి సమాధానం వేదాలలోనే దొరుకుతుంది.

కర్త లేకుండా కార్యముండదు. విత్తనం లేకుండా చెట్టు మొలవదు. ఒకవేళ మాంత్రికుడు, గారడీ వాడు విత్తనం లేకుండా చెట్లు మొలిపిస్తారుకదా ! అంటే అక్కడ వారే కర్త అని గ్రహించాలి. కాబట్టి జడమైన ప్రకృతి వల్ల ఈ జగన్నిర్మిణం జరగదు. తాను చెయ్యబోయే పని యొక్క లేదా నిర్మించ దలచుకున్న జగత్తు యొక్క స్వరూపం తెలిసి ఉండాలంటే, కర్త చేతనుడు అయిఉండాలి. జగత్తు అనే కార్యం మహాద్భుతమైనది. కాబట్టి దాని కర్త కూడా అత్యద్భుతమైన శక్తులు కలవాడై ఉంటాడు. అతని తత్త్వాన్ని వేదంలో వివరించటం జరిగింది. పరమేశ్వరస్వరూపాన్ని నిరూపించటంలో వేదాన్ని మించిన ప్రమాణం లేదు. అన్ని ప్రమాణాలకు మించినది, శ్రేష్టమైనది వేదము. సృష్టికి పూర్వం పరమేశ్వరుడొక్కడే ఉన్నాడు. అతడితో సమానమైన వారు కాని అధికులు గాని ఎవరూ లేరు. అతడు సర్వ స్వతంత్రుడు. సృష్టికి కావలసిన సాధనములేవీ లేకుండానే అతడు ఈ సృష్టి కార్యక్రమము పూర్తి చేశాడు అని వేదాలు చెబుతున్నాయి.

స్వప్నంలో కనిపించే 'నేను' అనుకునే ఈ దేహము నీది కాదు. అలాగే ఈ జగత్తు పరమేశ్వరుని శరీరం కాదు. ఈ జగత్తే పరమేశ్వర శరీరమైతే, ప్రళయం జరిగినప్పుడు కూడా ఈ జగత్తు ఉండి తీరాలి. కలలో చూసిన శరీరం ఇలలో ఉండదు. అలాగే ప్రళయం సంభవించినప్పుడు జగత్తు ఉండదు. జాగ్ర స్వప్న సుషుప్తులలో ఒకే రూపంగా ఉన్న జీవుడు, అన్ని అవస్థలలోను ఉండనట్టి శరీరం కన్న భిన్నమైనవాడు శాశ్వతుడు. ఈ రకంగా పరమేశ్వరుడు నాశనం లేనివాడు. నిత్యుడు, శాశ్వతుడు. అతనికన్న ఇతరమైన వస్తువు ఏదీలేదు. అందుచేతనే ఈ జగత్తును తనయందే చిత్రించాడు. చితి కన్న వేరైనది లేదు. చితిలేనిదే ఏ ప్రదేశము, ఏ వస్తువూ ప్రకాశించదు. అన్నింటినీ ప్రకాశింపచేసేది ఆ చితియే. అదే జ్ఞానము. అదే పరమేశ్వర స్వరూపము. జ్ఞానం లేదని చెప్పటానికి కూడా జ్ఞానం కావాలి. కాబట్టి జ్ఞానం లేదనటం కుదరదు. అన్నింటినీ నిషేధించగా చివరకు మిగిలేది చితి, అందుకే దాన్ని 'మహాసత్త' అంటారు. ఇది దేశకాలపరి భిన్నము కాదు. జగత్తంతా వ్యాపించి ఉంటుంది. జగత్తును తనలో లీనము చేసుకుంటుంది. అందుకే అది పూర్ణమైనది. సముద్రం లేకపోతే అలలు లేవు. సూర్యుడు లేకపోతే కాంతి లేదు. అలాగే 'మహాసత్త' లేకపోతే ఈ జగత్తే లేదు.

సృష్టికి ముందు ఆ పరమేశ్వరుడొక్కడే ఉన్నాడు. అతనినుండే ఈ జగత్తు పుట్టింది. అతని యందే ఉన్నది. అతని యందే లయమవుతున్నది. అని వేదాలు చెబుతున్నాయి.

భార్గవా ! నువు మనసుతో సృష్టించినదంతా మనోమయమే. అదే అనేక ద్రష్టలు, దృశ్యములుగా కనిపిస్తున్నది. మానవసృష్టి మనసు కన్న వేరైనది కాదు. అది మనసు నుండి పుట్టి, మనసునందే లయమవుతున్నది. అలాగే పరమేశ్వరుడి నుంచి పుట్టిన జగత్తు తిరిగి అతడియందే లయమవుతుంది. దేశ కాలములన్నీ ఆచితినే ఆశ్రయించి ఉన్నాయి. కాబట్టి అవి చితిని పరిచ్ఛన్నము చేయలేవు. చితి సర్వాంతర్యామి.

**1. చితికిప్రకాశమున్నదా :** మరి ఈ చితికి ప్రకాశమున్నదా ? అంటే ఉన్నది. ఆ ప్రకాశమే చిత్ప్రకాశము. అవి జ్ఞానజ్యోతులు అంతేకాని ఇక్కడ ప్రకాశము, కాంతి అంటే పంచభూతాలలోని అగ్నికాదు. ఈ రకంగా చిత్ప్రకాశములకు తాదాత్మ్యమున్నది.

**2. చితికి మాలిన్యమున్నదా ? :** చితిలో మాలిన్యము కాఠిన్యము ఉంటాయా ? అంటే ఇక్కడ చితి కన్న వేరే వస్తువు ఏదీలేదు. అందుచేత ఇతర వస్తు సంపర్కం ఉండదు. అందుకనే అది అతి నిర్మలమైనది. అది నిరవయవము, అతి సున్నితము, అతి కఠినము కూడా.

**3. జగత్తు ప్రతిబింబమా ? :** ఇక ఈ జగత్తు అనేది ప్రశ్న. తాను స్వయం ప్రకాశం కాకపోయినా ఇతరుల సాయంతో ప్రకాశించేది ప్రతిబింబం. కుండకు ప్రకాశం లేదు. అద్దంలో అది ప్రకాశిస్తుంది. కాబట్టి అది ప్రతిబింబం. ఈ ప్రపంచం అంతా అలాటిదే. ప్రపంచంలో ఏదీ స్వయంగా ప్రకాశించటం లేదు. చితివల్లనే అన్నీ ప్రకాశిస్తున్నాయి. కాబట్టి జగత్తు అంతా అద్దంలోని ప్రతిబింబం లాంటిదే.

**4. చితి - దర్పణం :** మరి చితి దర్పణం లాంటిది అని ఎందుకన్నారు ? అద్దంలో ఎన్నో ప్రతిబింబాలు కనిపిస్తాయి. కాని అద్దం ఏమీ మారదు. అలాగే చితి కూడా తాను ఏమాత్రం మారకుండానే అనేక చిత్రరూపాలతో భాసిస్తున్నది. దర్పణంలోని ప్రతిబింబాలు దర్పణం కన్న విడిగాలేవు. అలాగే చిదాత్మలో ప్రతిబింబించే ప్రపంచం అంతా చిదాత్మరూపమే. బింబమంటూ ఉంటే అద్దంలో ప్రతిబింబం కనిపిస్తుంది. అంటే ప్రతిబింబానికి బింబం హేతువు. మరి జగత్తు అనేది చితిలో ప్రతిబింబంగా ప్రకాశించటానికి చితియొక్క స్వాతంత్ర్యమే కారణము.

**5. జగత్తు - ప్రతిబింబం :** చిదాత్మకు స్వాతంత్ర్యమనే శక్తి ఉన్నది. ఆ శక్తి చిదాత్మకము, సూక్ష్మము. సూక్ష్మ రూపంలో ఉండే ఆశక్తి దృశ్య ప్రపంచ రూపంగా స్థూలరూపం ధరించి విస్తరించినప్పుడు, ఆ స్వాతంత్ర్యాన్ని 'సంకల్పము' అంటారు. సంకల్పం లేని చితి, ప్రతిబింబాలు లేనటువంటి అద్దం లాగా స్వచ్ఛంగా నిర్మలంగా ఒకే రూపంతో ఉంటుంది. సృష్టికి పూర్వం విశుద్ధరూపంగా ఉన్న పరాచితి, అంతులేని స్వాతంత్ర్య శక్తితో జగద్రూపం దాల్చింది. ఇదే సంకల్పం. సంకల్పమైనందువల్లనే జగత్తు ప్రతిబింబమయింది.

**6. జగత్తు స్థిరంగా ఉంటుందా ?** మన సంకల్పాలవల్ల కలిగిన భావాలు స్థిరంగా ఉండటం లేదు. మరి పరమేశ్వర సంకల్ప రూపమైన జగత్తు స్థిరంగా ఉంటుందా ? అనే ప్రశ్న ఉదయిస్తుంది. ఈశ్వర సంకల్పం అనంతమైనది. అపరిమితమైనది. అంటే ప్రళయకాలం వరకూ ఉంటుంది. అందుచేతనే ఈశ్వర సంకల్పం వల్ల ఏర్పడిన ఈ జగత్తు కూడా ప్రళయకాలం వరకూ స్థిరంగా ఉంటుంది.

**7. సంకల్పభావాలు :** మానవుని సంకల్పాలవల్ల కలిగిన భావాలు మానవుడికి మాత్రమే కనిపిస్తాయి. మరి ఈశ్వర సంకల్పం వల్ల కలిగిన భావాలు అందరికీ కనిపిస్తున్నాయి కదా ! అనే అనుమానం వ్యక్తమవుతుంది. ఈశ్వరుడు సర్వ స్వతంత్రుడు. పరిపూర్ణుడు. తన సంకల్పంవల్ల కలిగే భావాలు అందరికీ కనిపించాలి అని సంకల్పిస్తాడు. అందుచేత అవి అందరికీ కనిపిస్తాయి. మానవుడికి ఆశక్తిలేదు. కాబట్టి అతడి భావాలు ఇతరులకు తెలియవు. అయితే మానవుడు జ్ఞాని అయినప్పుడు, అంటే తానే సాక్షాత్తూ పరబ్రహ్మ స్వరూపుడయినప్పుడు, అతని భావాలు కూడా ఇతరులకు తెలుస్తాయి.

గారడీవాడు చిత్ర విచిత్రమైన వస్తువులు సృష్టిస్తాడు. అతడు సృష్టించినవి అందరికీ కనిపిస్తాయి. అతడు సృష్టించిన కుండతో నీరు తెస్తాడు. అది అతని సొంత పనులకు మాత్రమే ఉపయోగిస్తుంది. తాను సృష్టించిన దాన్ని తిరిగి తనలోనే మాయం చేసుకుంటాడు. అదేవిధంగా ఈశ్వరుడు సృష్టించిన జగత్తు అందరికీ కనిపిస్తుంది. చివరకు అతనిలో లీనమవుతుంది. విశ్వామిత్రుడు లాటివారు సృష్టి చేసినవి కొంతకాలం పాటు ఉంటాయి.

యోగులు సర్వ వ్యాప్తులు కారు. అందుకే వారి సృష్టి కొంతవరకే కనిపిస్తుంది. పరమేశ్వరుడు సర్వవ్యాపి కాబట్టి ఆయన సృష్టి అందరికీ కనిపిస్తుంది.

ఒకదానిలో ఒకటి భాసించేది ప్రతిబింబ తుల్యం. ప్రతిబింబం దర్పణం కన్న వ్యతిరిక్తము కాలేదు. ప్రతిబింబ రూపమైన జగత్తు దర్పణమ రూపంగానే సత్యం. ప్రతిబింబ రూపంగా అసత్యమే. అలాగే జగత్తుకూడా అసత్యమే.

**8. సత్యాసత్యాలు :** అసలు సత్యం అంటే ఏమిటి ? అసత్యం అంటే ఏమిటి ? తన స్వభావాన్ని వదలకుండా ఉండేది సత్యం. వదలిపెట్టేది అసత్యం. అద్దం ఎప్పుడూ ఒక లాగానే ఉంటుంది. ఏరకమైన మార్పు ఉండదు. మరి అందులో ప్రతిబింబాలు మాత్రం మారుతుంటాయి. కాబట్టి అద్దం సత్యం. ప్రతిబింబం అసత్యం. సూర్యకాంతి వస్తువులు మనకు కనిపించేటట్లు చేస్తుంది. కాని ఆ వెలుగులో గుడ్లగూబలు చూడలేవు. అలాగే చీకట్లో మనం చూడలేము. కాని అదే చీకట్లో గుడ్లగూబలు చూస్తాయి. కాబట్టి ఏది ప్రకాశము, ఏది అంధకారము అనేది స్పష్టంగా చెప్పలేము. అంటే ప్రకాశము, అంధ కారముల యొక్క స్వభావాలు మనం చెప్పలేము. అలాగే విషం మనిషికి అపకారి కాని పాముకు అపకారి కాదు. అదేవిధంగా సామాన్యులు పోలేనిచోటుకు యోగులు, దేవతలు పోతారు. మనకు దూరమైనది వారికి దగ్గరగా ఉంటుంది. మనకు ఎక్కువ సమయం వారికి తక్కువ అవుతుంది. అందుచేతనే మానవకాలమానం, దేవకాలమానం వేరువేరు.

అదేవిధంగా ఈ ప్రపంచం యొక్క స్వభావం అంతా ఒకేలాగా ఉండదు. అందుచేత జగత్తంతా మనకాశ్రయమైన చితి తప్ప వేరు కాదు. అది చిదాత్మయందే ఉన్నది. అక్కడే ప్రకాశిస్తున్నది. ఆచితియే మహేశ్వరి" అని జగత్స్వరూపాన్ని గురించి దత్తాత్రేయుడు పరశురాముడికి వివరించాడు అంటూ పదకొండవ అధ్యాయాన్ని పూర్తి చేశాడు రత్నాకరుడు.

## 21. గండశైలవృత్తాంతము

"గురుదేవా ! భార్గవుడికి జగత్స్వరూపాన్ని వివరించిన తరువాత ఏం జరిగింది ?" అన్నాడు కృష్ణశర్మ చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

గురువుగారైన దత్తాత్రేయుడే స్వయంగా జగత్స్వరూపం ఇది అని భోదించినప్పటికీ అనుమానం తీరలేదు పరశురాముడికి అందుకని గురువుగారితో "గురువర్యా, మీరు చెప్పినట్లుగా జగత్తు చిద్రూపమే అయినప్పటికీ అది అన్నికాలాలలోనూ సత్యమే అని ఎందుకనిపిస్తున్నది ? బుద్ధిమంతులు కూడా జగత్తు సత్యమే అని ఎందుకంటున్నారు ? ఈ విషయాలు నాకు వివరించండి" అని ప్రాధేయపడ్డాడు. ఆ మాటలు విన్న దత్తాత్రేయుడు శిష్యుడి అనుమానం తీర్చటం ప్రారంభించాడు.

"జగత్తు అనే భ్రాంతికి మూలమైనది అవిద్య. దానివల్లనే ఆత్మ అంటే ఏమిటో తెలియక శరీరమే ఆత్మ అనుకుంటున్నారు. మాంసము, నెత్తురు, ఎముకలు, చర్మము, మలమూత్రాలతో కూడిన శరీరము ఆత్మ కాదు. శరీరమే ఆత్మ అనే దృఢభావం వల్లనే, చిదాత్మ అంటే దేహం అనిపిస్తున్నది. ఆ దృఢభావం వల్లనే జగత్తు సత్యము అనిపిస్తున్నది. దానికి వ్యతిరేకంగా "బ్రహ్మసత్యం, జగత్తుమిధ్య" అనే భావన చేస్తే, అది పోతుంది. ఈ జగత్తు ఉన్నదే, దాన్ని ఎవరు ఏరకంగా భావన చేస్తే, వారికి ఆవిధంగా కనిపిస్తుంది. యోగులు ధ్యానం ద్వారా జగత్తును వారికి కావలసిన రూపంలో చూస్తారు. దీనికి ఉదాహరణగా ఒక కథ చెబుతాను వినవలసినది.

పూర్వకాలంలో వంగ దేశంలో "సుందరము" అనే పట్టణాన్ని సుషేణుడు అనే రాజు పరిపాలిస్తున్నాడు. అతడు వేదవేదాంగ విధుడు ధర్మపరుడు. అతని తమ్ముడు 'మహాసేనుడు' అన్నకు తగిన తమ్ముడు.

ఒకసారి సుషేణ మహారాజు లోక కల్యాణం కోసం అశ్వమేధ యాగం ప్రారంభించాడు. మహా బలవంతులైన రాకుమారులు పెద్దసేనతో అశ్వాన్ని వెంబడించి వెళ్ళారు. త్రోవలో ఎదిరించిన వారిని ఓడిస్తూ ఇరావతీ నదీ ప్రాంతానికి చేరారు. అక్కడ 'తంగణుడు' అనే మహర్షి ఉన్నాడు. రాకుమారులు బలగర్వంతో మహర్షిని దర్శించకుండా వెళ్ళిపోయారు. ఈవిధంగా తండ్రిని అవమానించటం తనయుడికి కోపం కలిగించింది. అతడు గుర్రాన్ని బంధించాడు. రాకుమారులు తమసేనతో అన్నివైపుల నుండి అతన్ని చుట్టుముట్టారు. తంగణ పుత్రుడు అశ్వాన్ని తీసుకుని, దగ్గరలో ఉన్న పర్వతంలో ప్రవేశించాడు.

రాకుమారులు సైన్యసమేతులై పర్వతాన్ని బ్రద్దలు చేశారు. తంగణ పుత్రుడు పర్వతంలోంచి బయటకు వచ్చి సేనను అంతటినీ తృటిలో సంహరించి, రాకుమారులను బంధించి మళ్ళీ పర్వతంలోకి వెళ్ళిపోయాడు. చావగా మిగిలిన భటులు పరుగెత్తుకుంటూ

పోయి తమ రాజుగారికి ఈ వార్తను విన్నవించారు. ఆ మాటలు విన్న సుషేణుడు ఒక్క క్షణం నివ్వెర పోయాడు. తరువాత తేరుకుని తమ్ముడైన మహాసేనుణ్ణి పిలిచి "సోదరా, తపస్సంపన్నుల శక్తి మనం తెలుసుకోలేము. దేవతలు కూడా వారిని జయించలేరు. కాబట్టి నువ్వు ఆ మహర్షిని ప్రసన్నం చేసుకుని అశ్వాన్ని, రాకుమారులను తీసుకొని రావలసినది. ఇది వసంత ఋతువు. ఈ కాలం దాటిపోతే యజ్ఞం చెయ్యరాదు. కాబట్టి గడువులోపే అశ్వాన్ని తోడ్కొని రావలసినది" అన్నాడు. అన్నగారి మాటలు విన్న మహాసేనుడు తక్షణమే బయలుదేరి తంగణ మహర్షి ఉన్న గండశైల ప్రాంతాన్ని చేరాడు.

మహాసేనుడు మహర్షిని దర్శించి, అతణ్ణి పరిపరివిధాల స్తోత్రం చెయ్యనారంభించాడు. అది చూసిన తంగణ పుత్రుడు చాలా సంతోషించి రాజుతో "రాజా" నీ స్తోత్రానికి ఎంతగానో సంతసించాను. నేను తంగణ మహర్షి కుమారుడను. ప్రస్తుతము మహర్షి సమాధి స్థితిలో ఉన్నాడు. ఈ స్థితిలోకి వెళ్ళి ఐదు సంవత్సరాలైంది. ఇంకా ఏడు సంవత్సరాల పాటు ఆయన ఇలాగే ఉంటాడు. కాబట్టి నీకు ఏంకావాలో నాకు చెప్పు. నీ కోరిక నేను తీరుస్తాను. నేను చిన్నవాడినే అయినప్పటికి, నా తండ్రికి ఉన్నంత శక్తి నాకున్నది. నీకు ఏం కావాలి" అన్నాడు.

ఆ మాటలు విన్న మహాసేనుడు ఋషి పుత్రునికి నమస్కరించి "బాలకా ! నువు నిజంగా నాకోరిక తీర్చతలచుకుంటే, ఇప్పుడు నీ తండ్రి సమాధి నుంచి లేచి నాతో మాట్లాడేటట్లు చెయ్యి" అన్నాడు. ఆ మాటలకు ముని బాలకుడు "రాజా ! ఇది దుర్లభమైన పని. నీకు వాగ్దానం చేశాను కాబట్టి కొద్దిసేపు ఉపేక్షించు. నా యోగశక్తితో అతణ్ణి మేలు కొలుపుతాను" అనిచెప్పి, యోగాసనంలో కూర్చుని, ఇంద్రియాలను నిరోధించి, శరీరం నుండి బయటకు వచ్చి, తండ్రి శరీరంలోకి ప్రవేశించి అతణ్ణి జాగ్రదవస్థలోకి తెప్పించాడు. ఈ రకంగా మేల్కొన్న తంగణుడు తన ఎదురుగా ఉన్న రాజును చూసి, జరిగినదంతా యోగదృష్టితో తెలుసుకుని, కుమారుణ్ణి పిలిచి "నాయనా యజ్ఞాలకు విఘ్నం కలుగచేయటం రాక్షస స్వభావం. కాబట్టి ముందు రాకుమారులను, అశ్వాన్ని విడుదలచెయ్యి. అన్నాడు. ఆ మాటలువిన్న మునికుమారుడు మరుక్షణంలో అశ్వాన్ని, రాకుమారులను తెచ్చి మహాసేనుడికప్పగించాడు.

మహాసేనుడు అశ్వాన్ని, రాకుమారులను రాజ్యానికి పంపించివేసి, "మునిబాలకా! ఈ అశ్వాన్ని, రాకుమారులను, ఈ పర్వతంలో ఎలా దాచావు ?" అన్నాడు. అప్పుడు తంగణుడు మహాసేనునితో "రాజా ! పూర్వకాలంలో నేను కూడా ఒక రాజును చాలాకాలం రాజ్యం చేశాను. పరమేశ్వరి అనుగ్రహంవల్ల ఆ త్రిపురాదేవియే పరమేశ్వరి అని

తెలుసుకున్నాను. లోక వ్యవహారాలు మీద విరక్తి కలిగింది. కుమారులకు రాజ్యం అప్పగించి అరణ్యానికి వచ్చాను. నా భార్య కూడా నన్ను అనుసరించింది. నేను ఇక్కడికి వచ్చి ఒక అర్బుదము అయింది. అర్బుదము అంటే – పదికోట్ల సంవత్సరాలు నాకు సేవ చెయ్యటం చేత నా భార్య కూడా ఉన్నత స్థితికి చేరింది. విధి బలీయమైంది. ఆ స్థితిలో ఉన్న నా భార్యకు ఒకనాడు కామవికారం కలిగింది. అప్పుడు నేను సమాధి స్థితిలో ఉన్నాను. ఆమె ఆగలేకపోయింది. నాతో సంభోగించినట్లుగా మనసులోనే భావించింది. గర్భవతి అయి, ఇదిగో ఈ కుమారుణ్ణి కని కన్ను మూసింది. ఈ బాలుణ్ణి నేనే పెంచి పెద్ద చేశాను. ఇతడు మంచి శక్తియుక్తులు గలవాడు, గొప్ప యోగి. ఈ కొండలలోనే ఒక పట్టణాన్ని తన యోగశక్తితో నిర్మించాడు. అందులోనే నీ గుర్రాన్ని, రాకుమారులను దాచాడు" అన్నాడు. ఆ మాటలు విన్న మహాసేనుడు అమితాశ్చర్యం పొంది, 'ఆ పట్టణాన్ని చూడాలని ఉన్నది. దయచేసి నాకు చూపండి' అన్నాడు.

తండ్రి ఆనతి పైన తంగణ పుత్రుడు మహాసేనుడితో గండశైల ప్రాంతం చేరి, తాను ఆ పర్వతంలోకి ప్రవేశించాడు. రాజు వెళ్ళలేకపోయాడు. అప్పుడు తంగణ పుత్రుడు రాజుతో "రాజా ! నువు యోగివి కావు. అందుకే ఇందులో ప్రవేశింపలేకపోయావు. ఇది ఘన పదార్థం. యోగసిద్ధి లేనివారు దీనిలో ప్రవేశించలేరు. తండ్రి ఆనతి మీద నిన్ను నేను తీసుకువెడతాను. నీ శరీరాన్ని ఈ మర్రిచెట్టు తొర్రలో ఉంచి నాతో రా !" అన్నాడు.

అప్పుడు రాజు "మునిబాలకా ! నాకు యోగం తెలియదు. శరీరాన్ని వదలటం ఎలా ? బలవంతంగా వదిలితే చచ్చిపోతాను" అన్నాడు. అప్పుడు మునిబాలకుడు రాజు శరీరంలో ప్రవేశించి, అతని లింగ శరీరాన్ని ఆకర్షించి, స్థూల శరీరాన్ని చెట్టు తొర్రలో ఉంచాడు. రాజు కళ్ళు తెరచి చూసేప్పటికి ఆకాశంలో తనను మునిబాలకుడు పట్టుకుని ఉన్నాడు. అంతా శూన్యం భూమికి చాలా ఎత్తున ఉన్నాడు. అప్పుడు రాజు భయంతో "మునిబాలకా, నన్ను వదలకు. ఆధారం లేక క్రిందపడి చచ్చిపోతాను. రక్షించు" అని వేడుకున్నాడు. అది విన్న మునిబాలకుడు "రాజా భయపడకు ధైర్యం తెచ్చుకుని ఈ పర్వతంలో ఉన్న లోకాన్ని, అన్ని వైపులా పూర్తిగా చూడు" అన్నాడు. ఎలాగో ధైర్యం తెచ్చుకుని చుట్టూ చూశాడు రాజు. నక్షత్రాలతో నిండిన ఆకాశం తెల్లని చంద్రమండలం అక్కడి చల్లదనంతో అతని శరీరం చల్లబడిపోయింది. తరువాత సూర్యలోకంలో ప్రవేశించారు. అక్కడికి చేరేసరికి రాజుకు బాగా తాపం కలిగింది. మునిబాలకుడు యోగశక్తితో రాజు శరీరంలోని ఉష్ణోగ్రతలను మారుస్తున్నాడు. అక్కడ అంతా స్వర్గంలా ఉన్నది.

తరువాత హిమాలయాలకు వెళ్ళారు. అక్కడి అందాలను చూశారు. ఇతర లోకాలను చూడటానికి మునిపుత్రుడు రాజుకు దివ్యదృష్టిని ప్రసాదించాడు. అప్పుడు మహాసేనుడు ఆ లోక పర్వతం చూశాడు. అక్కడ అంతా చీకటి. అక్కడి నేల అంతా బంగారుమయం. సప్త ద్వీపాలు, సప్త సముద్రాలు, నదులు, పర్వతాలు, చతుర్దశ భువనాలు అక్కడ ఉన్నాయి. ఇంద్రాది దేవతలు, యక్ష, కిన్నెర, కింపురుష, సిద్ధ, సాధ్యగణాలన్నీ ఉన్నాయి. అక్కడ ఈ లోకాలను రక్షించటానికి మునిపుత్రుడే బ్రహ్మగా, విష్ణువుగా, రుద్రుడుగా దర్శనమిస్తున్నాడు. అతడే ఇంకో రూపంలో భూలోకాన్ని పాలిస్తున్నాడు. ఇదంతా చూసి ఆశ్చర్యపోయాడు మహాసేనుడు. అప్పుడు మునిబాలకుడు "రాజా ! ఈ లోకాలను చూడటానికి మనకు పన్నెండు అద్భుతాలు అంటే నూట ఇరవై కోట్ల సంవత్సరాలు పట్టింది. కాని ఇక్కడి కాలమానం ప్రకారము ఇది ఒకరోజు. ఇక ఇప్పుడు నా తండ్రిగారున్న బ్రహ్మలోకానికి పోదాం" అంటూ గండశైలంలోకి తీసుకువెళ్ళినట్లుగానే రాజును పర్వతం నుంచి బయటకు తీసుకువచ్చాడు మునికుమారుడు. అంటూ పన్నెండవ అధ్యాయాన్ని పూర్తి చేశాడు రత్నాకరుడు.

## 22. దేహి - దేహము

"గురువు గారూ ! గండశైలాన్నుంచి బయటకు వచ్చిన తరువాత ఏంజరిగిందో వివరించండి" అన్నాడు నారాయణభట్టు. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

మహాసేనుడు మునికుమారుడితో కలిసి ఆ పర్వతం నుంచి బయటకు వచ్చాడు. అప్పుడు మహాసేనుని లింగశరీరాన్ని అతని స్థూల శరీరంలోకి చేర్చాడు మునికుమారుడు. రాజు నిద్ర నుంచి లేచినట్లుగా లేచాడు. ఈ ప్రపంచాన్ని చూశాడు. అంతా క్రొత్తగా ఉంది. చుట్టూ ఉన్న వాతావరణం ఈ చెట్లు, చేమలు, నదులు అంతా చాలా వింతగా ఉన్నాయి. వాటిని చూసి అమితాశ్చర్యం చెందినవాడై మునిబాలకుడితో "ఆర్యా ! ఇది ఏ లోకము దీన్ని ఇదివరకు ఎప్పుడు చూడలేదు. అంతా క్రొత్తగా ఉన్నది. అత్యద్భుతంగా ఉన్నది" అన్నాడు. దానికి మునికుమారుడు "రాజా ! ఇది మనం గతంలో ఉన్నలోకమేనయ్యా ! మనం ఇక్కడి నుండి వెళ్ళి నూట ఇరవైకోట్ల సంవత్సరాలైంది. అందుకనే మనకి ఈ లోకం క్రొత్తగా కనిపిస్తోంది. ఇక్కడ ఇప్పుడున్న ఆచార వ్యవహారాలు, మనుషులు, పరిసరాలు అంతా క్రొత్తగానే ఉన్నాయి. కాలంతోపాటు లోకం కూడా మారిపోతుంటుంది. నా తండ్రి సమాధిస్థితిలో ఉన్న దేశం ఇదేనయ్యా !

నే సృష్టించిన లోకాన్ని ఈ పర్వతంలోనే చూశావు. రాజా ! ఇంతవరకు నీ అన్నగారి వంశంలో కొన్ని వేలమంది పుట్టారు. గతంలో 'సుందరము' అనే పేరుగల పట్టణము ఇప్పుడు కారడవిగా మారిపోయింది. అందులో క్రూరమృగాలు నివశిస్తున్నాయి. నీ అన్నగారి వంశంలోవాడు వీరబాహువు అనే పేరుగల రాజు ఇప్పుడు క్షిప్రా నదీతీరంలో విశాల అనే పట్టణాన్ని రాజధానిగా చేసుకుని మాలవతీ నగరాన్ని పాలిస్తున్నాడు, మీ వంశంలోని వాడే అయిన సుశర్మ అనే రాజు తామ్రపర్ణి నదీతీరంలోని 'వర్ధనము' అనే నగరాన్ని పాలించాడు. ఈ కొంచెం కాలంలోనే మనం చూసిన ఈ లోకమంతా మారిపోయింది. ఇంకా కొంతకాలానికి ఇప్పుడున్న పర్వతాలు, నదులు, భూములు, అన్నీ ఇంకో రూపంలో కనపడతాయి.

కొండలు లోయలవుతాయి. లోయలు కొండలౌతాయి. ఎడారులన్నీ జలమయం అవుతాయి. పర్వతాలన్నీ ఇసకదిబ్బలు అవుతాయి. రాళ్ళతో నిండిన భూమి మెత్తగా మారిపోతుంది. మెత్తని భూములు రాళ్ళమయమవుతాయి. చవిటినేలలు సస్యశ్యామల మవుతాయి. ఉప్పునీరు తియ్యగా మారుతుంది. తియ్యని నీరు ఉప్పగా మారుతుంది. జనావాసాలు అరణ్యాలవుతాయి. అరణ్యాలు పంటపొలాలవుతాయి. అందుచేతనే గతంలో మనం చూసిన లోకం ఈరకంగా మారిపోయింది" అన్నాడు.

ఆ మాటలు విన్న మహాసేనుడు చాలా దుఃఖించాడు. తన వారంతా పోయినందుకు విలపించాడు. స్పృహ తప్పిపోయాడు. తన అన్న, వదిన, భార్య, కుమారులు ఇలా ఒక్కొక్కరినీ పేరు పేరునా తలచుకుని బాధపడుతున్నాడు. రాజును ఆస్థితిలో చూసిన మునికుమారుడికి, రాజుకు జ్ఞానోపదేశం చెయ్యాలనుకుని "రాజా ! నువు చాలా బుద్ధిమంతుడివి కదా ! ఎందుకు విలపిస్తున్నావు. మంచి చెడు ఆలోచించకుండా పనిచేసేవాడు మూర్ఖుడు. బుద్ధిమంతులు అలా ఎన్నటికీ చెయ్యరు. ఇప్పుడు నీ దుఃఖానికి కారణం ఏమిటి ?" అన్నాడు.

"మునికుమారా ! నేను ఎందుకు దుఃఖిస్తున్నానో నీకు తెలియదా ! నా అన్నగారు, వదినగారు, భార్య, పిల్లలు స్వజనము అంతాపోయారు. బంధుజనంలో ఏఒక్కరు మరణించినా అమితమైన దుఃఖం వస్తుంది కదా ! మరి ఇంతమంది మరణించినప్పుడు నేను దుఃఖించకుండా ఎలా ఉండగలను?" అన్నాడు రాజు. ఆ మాటలు విన్న మునిపుత్రుడు చిరునవ్వుతో "రాజా ! మరణించిన వారిని గురించి ఏడవటం మీ వంశాచారమా ? అలా దుఃఖించకపోతే దోషం ఏదైనా వస్తుందా ? ఒకవేళ ఏడిస్తే పోయినది తిరిగివస్తుందా? జాగ్రత్తగా ఆలోచించు, దుఃఖిస్తే వచ్చే ఫలం ఏమిటి ? పోయిన వాళ్ళంతా తిరిగివస్తారా?

బంధువులు మరణిస్తే ఏడవాలి అంటావా ? బంధువర్గంలో లెక్కలేనంతమంది ఇదివరకే పోయారు. వాళ్ళందరి గురించీ ఏడవాలంటే ఒక జీవితకాలం చాలదు. అసలు బంధువులంటే ఎవరు? నాసోదరులు, నేను ఒకే గర్భాన జన్మించాం కాబట్టి మాకు రక్తసంబంధం ఉంది. అదే మా బంధుత్వం అంటావా? నీ తల్లితండ్రుల మూత్రపురీషాల్లో అనేక క్రిములు పుట్టినాయి కదా ? మరి అవి కూడా నీకు బంధువులేనా ? వాటిని గురించి నువు ఎప్పుడూ ఏడవలేదు ఎందుకని ? రాజా ! అసలు నువ్వు అంటే ఎవరు? మరణించింది ఎవరు ? నువ్వు అంటే ఈ శరీరమేనా ? అంతకన్న వేరైనదా ? దేహము అంటే అవయవాల కలయిక, అది నశించిందని ఏడుస్తున్నావా ? లేక అందులో ఒక భాగం నశించిందని ఏడుస్తున్నావా ? శరీరంలో భాగమే అయితే మలమూత్రాలు, నఖము, కేశము, శ్లేష్మము. ఇవన్నీ ప్రతిరోజూ పోతూనే ఉన్నాయి. మరి వీటికోసం ఏడవటం లేదే ? శరీరం పంచభూతాత్మకం. నీ బంధువులు చనిపోయినప్పటికీ వారి శరీరంలో భాగాలయిన పృథివి, నీరు, నిప్పు, గాలి ఇక్కడే ఉన్నాయి. అందులోని నాలుగు భూతాలు అనిత్యాలే. ఆకాశం మాత్రమే నిత్యం, అది ఎప్పటికీ నశించదు. కాబట్టి శరీరం పూర్తిగా నశించదు. మరణం అంటే పాంచ భౌతికమైన శరీరము పంచ భూతాలలో కలిసిపోవటం.

రాజా ! జాగ్రత్తగా ఆలోచించు నువు దేహం కాదు. దేహివి అంటే - శరీరం కలవాడివి. ఇది నా దేహము అనుకుంటున్నావు. ఇది నా వస్త్రము అన్నప్పుడు ఆ వస్త్రం నువు కాదు. అలాగే ఈ శరీరం కూడా నువు కాదు. పోనీ నేను ఈ శరీరం కన్న భిన్నమైనవాడిని అంటావా ? మరి ఆ భిన్నమైన దానితో నీకు సంబంధం ఏమిటి ? నీ సోదరుల వస్త్రాలతో నీకు సంబంధం లేనట్లే, వారి శరీరాలతో కూడా నీకు సంబంధం ఏమీలేదు. అలాంటప్పుడు వారి కోసం నువు ఎందుకు దుఃఖించాలి" అన్నాడు. అంటూ వివరించాడు రత్నాకరుడు.

## 23. జగత్తు భావనా మాత్రమే

"గురువుగారూ ! 'దేహి - దేహము' గురించి మునికుమారుడు వివరించాక ఆ రాజు ఏంచేశాడు ? స్పష్టత చెందాడా ? లేక ఇంకా ఏమైనా అనుమానాలు ఉన్నాయి అన్నాడా ? వివరించండి" అన్నాడు కృష్ణశర్మ. వివరించటం ప్రారంభించాడు రత్నాకరుడు.

మునికుమారుని మాటలు విన్న మహాసేనుడు ఒక్కక్షణం ఆలోచించాడు. అతని ప్రశ్నలకు సమాధానం దొరకలేదు. అప్పుడు "భగవత్స్వరూపుడివైన ఓ ముని బాలకా ! ఎంత విచారించినా నేనెవరో నాకు ఏమాత్రం తెలియటం లేదు. ఆకలి దప్పికలు ఎందుకు

కలుగుతున్నాయో తెలియదు. కాని మానవుడు తినటము, త్రాగటము చేస్తూనే ఉన్నాడు. అదే స్వభావం చేత బంధువులంతా నాశనమయిన ఈకాలంలో నేను విలపిస్తున్నాను. అంతేకాని నా దుఃఖానికి కారణం ఏమిటో మాత్రం నాకు తెలియదు. నేను దీనాతిదీనుడనై నిన్ను శరణు వేడుతున్నాను. నేనెవరో నాకు తెలియచెయ్యి. బంధువులుపోతే అందరూ ఏడుస్తారు. అదే ఇతరులుపోతే ఏడవరు. తమ స్వరూపం ఏమిటో ఎవరికీ తెలియదు. మీరే నా గురువు. నాకు ఆ విషయాలు తెలియచెయ్యండి" అంటూ ప్రాధేయపడ్డాడు మహాసేనుడు ఆమాటలు విన్న మునిబాలకుడు.

"రాజా ! విను జగత్తులోని జనులంతా త్రిపురాదేవి యొక్క మాయవల్ల మోహితులవుతున్నారు. స్వాత్మను తెలుసుకోలేకపోవటం వల్ల ఎల్లవేళలా వ్యర్థంగా దుఃఖిస్తూ ఉన్నారు. అజ్ఞానమే శోకానికి కారణం. ఆ పరమేశ్వరుని మాయవల్లనే అజ్ఞానం కలుగుతుంది. ఉపనిషత్తులలో కూడా ఇదే చెప్పబడింది. మాయ అనేది మానవులను ఆవరించి ఉన్నది. ఈ అజ్ఞానం కూడా ఆ శక్తి అంశమే అయినందువల్ల ఆత్మజ్ఞానం అనేది మాయా మూలకమవుతున్నది. ఆత్మతత్త్వం తెలియనంతకాలము జనులు శోకిస్తూనే ఉంటారు. తెలిసిన తరువాత ఇంక శోకించరు. నిద్రలో ఉన్నవాడు, తాను నిద్రిస్తున్నానని తెలుసుకోలేక దొంగలు తన సర్వస్వాన్నీ హరించారని కలగని బాధపడతాడు. తీరా అది కల అని తెలిసిన తరువాత అతడికి బాధ ఉండదు. గారడీ వాడు ఒక పెద్ద పామును సృష్టిస్తాడు. దాన్ని చూసి అది నిజమైన పాము అనుకుని అందరూ భయపడతారు. ఇది గారడీవాని మాయ అని తెలియగానే ఇంక భయం ఉండదు. పైగా భయపడే వాళ్ళని చూసి నవ్వుతాడు. అలాగే ఆత్మజ్ఞాన సంపన్నులు మాయను అతిక్రమించి పోగలుగుతారు. వారెప్పుడూ దుఃఖించరు. కాబట్టి ఓ రాజా ! నువ్వు ఇప్పుడు ఆత్మతత్త్వాన్ని గురించి తెలుసుకో. ఈ మాయ నుంచి తరించు" అన్నాడు.

"మునిబాలకా ! నువు చెప్పిన ఉదాహరణలు నాకు తృప్తినివ్వలేదు. ఎందుచేతనంటే కలలో చూసేదిగాని, గారడీవాడు చూపించేదిగాని నిజమైనదికాదు. కేవలము ఉన్నట్లుగా భ్రాంతిని కలుగచేస్తుంది. జాగ్రదవస్థలో కనిపించే పదార్థాలు సత్యమైనవి. వాటిని మనం వాడుకోవచ్చు. అవి కలలో మాదిరిగా గాక, ఇతర కాలాలలో కూడా స్థిరంగా ఉంటాయి. 'అవిలేవు' అనే జ్ఞాన రూపమైన బాధ వాడికి ఉండదు. కాబట్టి ఈ జగత్తు కలలాటిది కాదుకదా ? జగత్తు స్వప్న సమానం కాదు" అన్నాడు రాజు.

**మునిబాలకుడు :** రాజా ! జాగ్రత్తగా విను, కలలో కనిపించే చెట్టు కూడా నీడనిచ్చి తాపాన్ని హరిస్తుంది. పండ్లు, పూలు ఇచ్చి తృప్తినిస్తుంది. అందువల్ల స్వప్నంలోని పదార్థాలు

కూడా ఉపయోగపడేవిగా, అబాధితులుగా ఉన్నాయి కదా ! అవి కూడా స్థిరంగానే ఉంటున్నాయి.

**రాజు :** స్వప్నంలో కనిపించేవి అన్నీ కూడా జాగ్రదావస్థలో భాసించటం లేదు. అంటే మునికి బాధ కలుగుతోంది కదా. జాగ్రత్ప్రపంచం ఆవిధంగా పూర్తిగా భాసించకపోవటం ఎప్పుడూ లేదే.

**మునిబాలకుడు :** సుషుప్తిలో జాగ్రత్ప్రపంచం ఏమాత్రం భాసించదు. బాధ అంటే భాసించకపోవటం అని కాదు. ఈనాడున్న జాగ్రత్ప్రపంచమే రేపు కూడా ఉంటుంది. అందుకనే అది నిన్నటి వస్తువే అనుకుంటున్నాము. స్వప్నంలో ఉన్న పదార్థాలు ఆవిధంగా జాగ్రత్తలో అనువృత్తంగా లేవు గదా అనేది సందేహం. 'అనువృత్తం' అంటే ఎడతెగకుండా ఒకే వరుసగా ఉండటం. అది నిజం కాదు. ఎందుకంటే స్వప్నవృత్తం కూడా మరునాడు అనువ్యక్తం అవుతూనే ఉన్నది. అయితే ఇది నిన్నటిది అని మర్నాడు అనుకుంటాం. అలాగే నిన్నటి స్వప్నమే ఇది అని అనుపించదు కదా ! ఇది ఎక్కడా అనుభవంలో లేదు. అని మళ్ళీ అనుమానం.

జాగ్రదావస్థలో మాత్రం ఇది నిన్నటిదే అని ఎక్కడ అనిపిస్తున్నది ? క్రియ వంటి క్షణికమైన భావాలు ప్రతిక్షణము నశిస్తూ ఉంటాయి. అందువల్ల అవి భాసించటము అనేది జరగదు. ఎప్పుడూ క్రొత్త వస్తువులే భాసిస్తాయి.

**రాజు :** క్షణికమైనవి నశిస్తాయి. వాటికి అనువృత్తి లేదు. అన్నారు బాగున్నది. మరి స్థిరములైన పర్వతాలు, సముద్రాలవంటివి గతంలో ఉన్నవే, ఉత్తరకాలంలో కుడా అనువ్యక్తమవుతున్నాయి కాదా ?

**మునిబాలకుడు :** కలలో కూడా పెద్ద పెద్ద కలలు వస్తాయి. ఆ కలలో కొన్నేళ్ళు గడిచిపోతుంది. చాలాకాలం క్రిందట ఉన్న పుత్రులు, మిత్రులే అప్పుడు కూడా ఉన్నారనిపిస్తుంది. ఇది సహజం. ఇది అనుభవమే.

**రాజు :** అయితే కలలో కనిపించిన పుత్రులు, మిత్రులు నిజం కాదు. కాబట్టి అవి అనువ్యక్తమవుతున్నాయనటం కూడా నిజం కాదు కదా !

**ముని బాలకుడు :** అలా అయితే జగత్తులో స్థిరంగా ఉన్నట్లు భాసించేది కూడా అసత్యమే రాజా! అంధపరంపరగా వచ్చే విశ్వాసాన్ని వదలి పెట్టి సూక్ష్మ దృష్టితో పరిశీలించు.

ఈ శరీరము, వృక్షాలు, నదులు, పర్వతాలు అన్నీ క్షణభంగురాలే. క్షణక్షణం వాటి రూపం మారుతూనే ఉంటుంది. అలాంటప్పుడు ఆ అనువృత్తి అసత్యంకాదని చెప్పటానికి

లేదు. ఈ శరీరంలోనే కాని పర్వతాలు మొదలైన వాటిలో మార్పురాదు అనటం నిజం కాదు. సెలయేళ్ళు ప్రవహించటంవల్ల రాళ్ళు అరిగిపోతాయి, బ్రద్దలవుతాయి. సెలయేళ్ళు లేనిచోట్ల ఎలుకలు, చెదలు త్రవ్వటం వల్ల రాళ్ళు క్రుంగుతాయి. ఒక్కొక్కసారి పర్వతాలు పెరుగుతాయి. అలాగే భూమిలోకి దిగిపోతాయి. ఈ రకంగా పర్వతాలు, నదులు ఒకటేమిటి ? అన్నీ తమ పూర్వరూపాన్ని కోల్పోతాయి.

ఇది అంతా విన్న రాజుకు మళ్ళీ అనుమానం వచ్చింది. కార్యరూపంలో కాకపోతే కారణ రూపంలో అనువృత్తి ఉంటుంది కదా ! అన్నాడు. దానికి ముని బాలకుడు రాజా! భౌతికమైన కార్యాలన్నీ పంచభూతాల రూపంలో ఉన్నాయి. జాగ్రత్ప్రపంచంలో లాగానే స్వప్న ప్రపంచంలో కూడా పృథివి మొదలైన వాటిని చూస్తూనే ఉంటాము. అక్కడ స్వప్న పురుషుడు వాటిని అనుభవిస్తూనే ఉన్నాడు.

**రాజు :** స్వప్నంలో కనిపించినవి, స్వప్నానంతరము కనిపించవు. కాని జాగ్రదావస్థలోని భావాలు అందరికీ కనిపిస్తాయి కదా !

**మునిబాలకుడు :** స్వప్నంలోని పదార్థాలు స్వప్నానంతరము కనిపించనట్లే, జాగ్రదవస్థలోని భావాలు సుషుప్తిలో ఉండవు. ఈవిధంగా క్రియ, కారణము అనే రెండూ జాగ్రస్వప్నాలకు సమానమే.

**రాజు :** జాగ్రదవస్థలో నేను మేలుకొని ఉన్నాను అనుకుంటాము. మరి స్వప్నావస్థలో అలా అనుకోము కదా !.

**మునిబాలకుడు :** కలలో చూసిన విషయాలను పూర్తిగా కాని, కొన్నింటినికాని మళ్ళీ జాగ్రదావస్థలో స్మరిస్తాడు. అలాగే జాగ్రత్తులోని విషయాలను స్వప్నంలో చూస్తాడు. కల వచ్చినప్పుడు తాను మెలకువగానే ఉన్నాను అనుకుంటాడు. ఈరకంగా పూర్వానుభవ జ్ఞానం జాగ్ర, స్వప్నాలు రెండింటిలోనూ ఉంటుంది. అందుకే ఈ రెండింటికీ బేధం లేదు. ఒకవేళ తేడా ఉంటే కలలో కనిపించిన బందు నాశనం గురించి దుఃఖించాలి కదా ! కల నిజం కాదని నీకు తెలుసు. అందుకే నువు దుఃఖించటం లేదు. ఈ జగత్తు సత్యము అని నువ్వు అనుకుంటున్నావు. కల నిజం కాదు అనుకున్నట్లుగానే ఈ జగత్తు కూడా నిజం కాదు అని భావిస్తే, జగత్తంతా శూన్యమే అవుతుంది. రాజా ! త్రాడును చూసి పాము అనుకుంటున్నావు. ఇది త్రాడే అని ఎప్పుడైతే భావించావో, అప్పుడు అది పాము అనే భ్రాంతి పోతుంది. త్రాడు మాత్రమే మిగులుతుంది. అలాగే ఈ జగత్తంతా మిధ్య అని భావించు. ఉదాహరణగా ఇప్పుడు నేను సృష్టించిన జగత్తునే తీసుకో. అదంతా

ఇట్టిదే కదా ! అయినా ఈ పర్వతం చుట్టూ తిరిగి చూద్దాం రా అని రాజును పర్వతం చుట్టూ త్రిప్పి చూశావా రాజా ! ఈ పర్వతం ఎంత చిన్నదో మరి ఇంత చిన్న పర్వతంలో ఇంత పెద్ద జగత్తును చూశావుకదా ! మరి ఇది కలా, నిజమా ! ఈ లోకం ఉన్నదా ? లేదా ? ఈ పర్వతంలో ఒకరోజు గడిచింది అంటే ఈ లోకంలో నూట ఇరవైకోట్ల సంవత్సరాలు గడిచాయి. ఇందులో ఏదిసత్యం ? ఏది అసత్యం ?

రాజా ! రెండు వేరు వేరు కలలొచ్చాయి. వాటిలో ఏది సత్యమో చెప్పగలమా ? ఒకటి నిజమైతే రెండవది ఎందుకు కాగూడదు ? కాబట్టి ఈ రెండూ అసత్యాలే. ఈ జగత్తంతా భావనా మాత్రమే. అందుచేత ఈ జగత్తంతా ఒక కలగా భావించి శోకాన్ని వదిలిపెట్టు.

స్వప్నానికి ఆధారమైన నీ ఆత్మ అద్దం వంటిది అని భావించి కలలో కలిగిన బంధు నాశనము, రాజ్య లాభముల వల్ల ఏరకంగా సుఖదుఃఖాలనుభవించవో, అదేవిధంగా జగత్తును కూడా ఒక కలగా భావించు పోయిన వారికోసం విచారించకు. అన్ని వాసనలను వదలివేసి ఆత్మానందాన్ని అనుభవించు ఈ జగత్తు భావనా మాత్రమే !! అని ఉపదేశించాడు అంటూ పదమూడవ అధ్యాయాన్ని పూర్తిచేశాడు రత్నాకరుడు.

## 24. మాయాతత్త్వ సృష్టి

"గురువుగారూ ! 'ఈ జగత్తంతా భావనా మాత్రమే' అని మునిబాలకుడు చెప్పిన మాటలు మహాసేనుడు నమ్మాడా ? ఆ తరువాత ఏంజరిగింది ?" అని అడిగాడు నారాయణభట్టు. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

మునిబాలకుడు చెప్పిన మాటలు చాలా శ్రద్ధతో విన్నాడు రాజు. వాటిని గురించి బాగా ఆలోచించాడు. ఈ జగత్తంతా ఒక కలలాంటిది అని తెలుసుకుని శోకాన్ని వదిలిపెట్టాడు. ఆ తరువాత ముని బాలకుడితో "బాలకా ! నీకు తెలియనిది లేదు. ఈ జగత్తంతా భావనా మాత్రమే అన్నావు. అది ఏరకంగా అవుతుంది ? ఎన్నిసార్లు ఆలోచించినా అందరూ దీన్ని నమ్ముతారని నాకు అనిపించటం లేదు. నువ్వు పర్వతంలో ఒక లోకాన్ని సృష్టించావు. అదే లోకం ఇక్కడా ఉన్నది. ఒకేసమయంలో ఒకే లోకాలు రెండుచోట్ల ఎలా ఉన్నాయి ? ఆ రెండూ కలలాంటివే అని అంటావు. అయితే ఈ రెండింటిలోనూ ఒకటే అసత్యం. దీనికి కారణం ఏమిటో వివరించవలసినది" అన్నాడు.

ఆ మాటలు విన్న ముని బాలకుడు "రాజా ! ఇది కేవలము భావన. భావన అంటే 'ఇది ఈ రకంగా ఉండాలి' అని మనసులో సంకల్పించటమే" అన్నాడు.

**రాజు :** మరి భావన సిద్ధించటం అంటే ఏమిటి ?

**మునిబాలకుడు :** భావన అనేది రెండు రకాలు 1. సిద్ధ భావన. 2. అసిద్ధ భావన.

ఏదైనా ఒక విషయాన్ని గురించి 'ఇది ఈ రకంగా ఉంటుంది' అనే సంకల్పం చేసినప్పుడు దానికి విరుద్ధమైన సంకల్పాలు కలగకుండా ఉన్నప్పుడు ఆ భావన సిద్ధిస్తుంది. ఉదాహరణకు ఒక వస్తువు ఈ రకంగా ఉండాలి అని సంకల్పించాము. మళ్ళీ అది కాదేమో అనే ఆలోచన రాకూడదు. అంటే మొదట చేసిన సంకల్పం ధృఢంగా ఉండాలి. దానిమీద ఏరకమైన అనుమానాలు రాకూడదు. అటువంటప్పుడు ఆ సంకల్పం సిద్ధిస్తుంది. అదే సిద్ధభావన. ఒకదానియందే 'ఇది సత్యము' అనే ధృడసంకల్పం చేస్తే అది సిద్ధిస్తుంది. అదే భావనాసిద్ధి ఆ సంకల్పం వల్ల ఉద్భవించిన జగత్తు అందరికీ కనిపిస్తుంది. అనుభవం లోకి కూడా వస్తుంది. ఈ జగత్తంతా బ్రహ్మయొక్క సంకల్పం వల్లనే ఆవిర్భవించింది.

బ్రహ్మ ఈ జగత్తును సత్యము అని భావించాడు. ఈ లోకంలో ఉండే వారందరూకూడా అదే భావనతో ఉన్నారు. అందుకే అందరికీ జగత్తు ఉన్నట్లుగానే కనిపిస్తోంది. కాని ఇందులో ఏ ఒక్కడైనా సరే 'ఇది సత్యంకాదు' అని అనుకుంటే, అతడికి ఈ జగత్తు అసత్యమే అవుతుంది.

నీ భావనలో, నువు సృష్టించాలనుకునే జగత్తు సత్యము అనే నమ్మకం నీకు లేదు. అది కాదేమో అనికూడా నువ్వే అనుకుంటావు. అందుకనే నీకు కలిగేది 'అసిద్ధ భావన'. ఆ కారణం చేతనే నువు సృష్టించాలనుకున్న జగత్తు ఎవరికీ కనపడటంలేదు.

**రాజు :** సిద్ధభావన ఎలా వస్తుంది ?

**మునిబాలకుడు :** రాజా ! భావనాసిద్ధి అనేది పూర్వజన్మ కృతం వల్ల కలుగుతుంది. మణుల వల్ల కలుగుతుంది, ఓషధుల వల్ల కలుగుతుంది, మంత్రసిద్ధి వల్ల కలుగుతుంది. వరాల వల్ల కూడా కలుగుతుందయ్యా, బ్రహ్మదేవుడికి ఈ భావన పుట్టుకతోనే వచ్చింది. అది పూర్వజన్మ కృతం. యక్షులకు, రాక్షసులకు ఇది మణులను ధరించటం వల్ల వస్తుంది. దేవతలకు ఓషధులు సేవించటం వల్ల వస్తుంది. యోగులకు యోగం వల్ల వస్తుంది. తాపసులకు తపస్సు వల్ల వస్తుంది. మాంత్రికులకు మంత్రసిద్ధి వల్ల వస్తుంది. యముడు, విశ్వకర్మ మొదలైన వారికి వరాలవల్ల వచ్చింది.

**రాజు :** అటువంటి భావనను సాధించటం ఎలా ?

**మునిబాలకుడు :** పూర్వ సంకల్పాన్ని పూర్తిగా మరచిపోవాలి. 'లోగడ నేను ఫలానా పనిచేశాను' అనే భావన రాకూడదు. అంటే వెనుకటి వాసనలేవీ ఉండకూడదు.

పూర్వం అది లేదు. ఇది చెయ్యాలని సంకల్పించాను. అనుకున్నప్పుడు 'అదిలేదు' అనే భావన కూడా ఉన్నది. అది వికల్పం. అసలు సంకల్పాన్నే మరిచిపోతే అది నిర్వికల్పం అవుతుంది. రాజా ! పూర్వ విషయాలను గుర్తుచేసుకోనంతవరకు అది స్థిరభావనే అవుతుంది. ఒకవేళ నిర్వికల్ప భావనే గనక స్థిరమైన అది మహాఫలితాన్ని ఇస్తుంది. ఈ జగత్తంతా బ్రహ్మమయం. ఇక్కడ పరబ్రహ్మ తప్ప ఇంకెవరూ లేరు. అనే భావన కలిగిననాడు అంతా పరమేశ్వర స్వరూపమే దర్శనమిస్తుంది. నీకు కలిగే భావన వికల్పాలతో కలిసి ఉంటుంది. అందువల్ల నీది సిద్ధ భావన కాదు. నువ్వు గనక సృష్టి చెయ్యాలనుకుంటే, ముందుగా సిద్ధ భావనను సాధించు.

రాజా ! నువ్వు అడిగిన దానిలో రెండవభాగం గురించి చెబుతాను విను. దేశకాలాలు రెండు విధాలుగా కనిపిస్తున్నాయి అన్నావు అంటే నీకు లోకజ్ఞానం చాలా తక్కువ. అందుచేతనే దేశకాలాలలో నీకు బేధం కనిపిస్తున్నది.

విరుద్ధంగా కనిపించటం అనేది లోక స్వభావము. సూర్యుడు ఒక్కడే. అతని నుంచి వచ్చే కాంతి ఒక్కటే. కాని అది అందరికీ ఒకేరకంగా ఉండదు. పగటిపూట సూర్యునికాంతులలో అన్ని జీవరాశులు తమ తమ కార్యాలు పూర్తిచేసుకుంటాయి. కాని గుడ్లగూబకు పగలు కళ్ళు కనిపించవు. అది దానికి చీకటి లోతైన నీటిలో మానవుడు బ్రతకలేడు. కాని అదే నీటిలో జలచరాలు హాయిగా ఉంటాయి. అవి నీరు లేకపోతే బ్రతకలేవు రాజా ! నిప్పుదేన్నైనా కాల్చి వేస్తుంది. ఆ నిప్పు మీద నీళ్ళు పోస్తే చల్లారిపోతుంది. అదే నిప్పు సముద్రంలో బడబాగ్నిగా మండుతూ ఉంటుంది. ఈరకంగా జగత్తులోని ప్రతిదానికీ రెండు భావాలున్నాయి. అంతే కాదు మహారాజా ! కంటికి కనిపించే తేడాలన్నీ నేత్రదోషాలకు సంబంధించినవే. కామెర్ల రోగికి లోకమంతా పచ్చగానే కనిపిస్తుంది. అది లోకం తప్పుకాదు. అతని కంటికి ఉన్న దోషము. అలాగే రేచీకటి వాడికి వస్తువులు రెండుగా చీలి కనపడతాయి. రాజా ! తూర్పు సముద్రంలో కరండము అనే ద్వీపం ఉన్నది. అక్కడున్న వాళ్ళకి అన్ని వస్తువులూ ఎర్రగా కనపడతాయి. అలాగే రమణకద్వీపంలో ఉండే వారికి వస్తువులు తలక్రిందులుగా కనపడతాయి. ఇవన్నీ నేత్ర దోషాలవల్ల వచ్చినవే. వీటిని మందులతో తగ్గించవచ్చు.

ఇక క్రమం అంటే చెబుతా విను. క్రమం అంటే ముందు వెనుక ఉండటమే. ప్రయాగలో ఉన్నవాడికి కాశీపట్నం తూర్పున ఉంటుంది. కాశీలో ఉన్నవాడికి ప్రయాగ పడమరన ఉంటుంది. ఇక్కడ క్రమం అంటే దిశ. ఆ పని ముందు, ఈ పని తరువాత అన్నప్పుడు క్రమం అంటే – కాలము అని అర్థం.

రాజా ! బయట కనిపించేది జగత్తు అనే చిత్రానికి తెరవంటిది. అదే సమస్త జగత్తుకు మూలం. దానికి ఉపాదానము ఏమిటో తెలుసుకోవాలి. కుండకు మట్టి ఉపాదానము. పండుకు చెట్టు ఉపాదానము. అలాగే ఈ జగత్తుకు ఉపాదానము ఏది ? అనే విషయం తెలుసుకోవాలి.

భాస్యము భాసకము కన్న బయట ఉన్నది అనటం కుదరదు. భాస్యము అంటే - ప్రకాశించేది. భాసకము అంటే - ప్రకాశింపచేసేది. సూర్యుడి యొక్క కాంతిలో లేకుండా, కుండ చీకట్లో ఉంటే కంటికి కనిపించదు. కాంతిలో ఉంటేనే వస్తువులు ప్రకాశిస్తాయి. అందువల్ల భాస్యము భాసకము లోపలే ఉంటుంది. శరీరము, వస్తువులు అన్నీ భాస్యాలే. అంటే ప్రకాశించేవి. అంతేకాని భాసకాలు (ప్రకాశింపచేసేవి) కాదు. కాబట్టి భాస్యమే భాసకము కాదు. అంటే - ప్రకాశింపచేసేది, ప్రకాశించేది ఒకటి కాదు.

**రాజు :** ఒకదానికి భాసకమవుతూ, ఇంకొక దానికి భాస్యము కావచ్చును కదా. అంటే ఒకే వస్తువు భాసకము, భాస్యము కూడా అవవచ్చును కదా ?

**మునిబాలకుడు :** కాదు. అలా ఎన్నటికీ జరగదు. తనకు స్వయం ప్రకాశం లేనివస్తువు, ఇంకొక దానికి కాంతిని ఎలా ఇవ్వగలుగుతుంది. వెలగని దీపం కాంతులను ప్రసరిస్తుందా?

**రాజు :** ఇంకొక భాసకం వల్ల అది భాసిస్తూ, వేరొక దానిని భాసింపచేయవచ్చును కదా ! అంటే తాను మరిదేని సహాయంతోనైనా ప్రకాశిస్తూ, ఇంకొక దానిని తాను ప్రకాశింపచేయవచ్చునుకదా ?

**మునిబాలకుడు :** ఇంకొక దాన్ని ప్రకాశింపచేయటానికి వేరొక భాసకం, దాన్ని భాసింపచేయటానికి ఇంకొకటి ఇలా చెప్పుకుంటూపోతే అనవస్థా దోషం పడుతుంది. దీనికి అంతం ఉండదు. అది ముక్తి హేతువు కాదు. సూర్యకాంతి వల్ల చంద్రుడు ప్రకాశిస్తాడు. ఆ చంద్రుని కాంతిలో వస్తువులు ప్రకాశించే మాట నిజమే. కాని సూర్యుడు దేనివల్ల ప్రకాశిస్తాడు ? పరమేశ్వరుని కిరణముల వల్ల. కాబట్టి అన్నింటికీ కాంతులనిచ్చేది ఆ పరమేశ్వరుడే.

**రాజు :** భాసకము అంటే – ప్రకాశించటమనే క్రియ కలిగినది. క్రియ అనిత్యమైనది. అటువంటప్పుడు భాసకమూ అనిత్యమే కదా ! భాసకత్వము అంటే - ప్రకాశింపచేసే గుణము ఎప్పుడూ ఉండదు. అలాంటప్పుడు పరాచితి ఎప్పుడూ ప్రకాశిస్తూనే ఉంటుందని ఎలా చెబుతారు ?

**ముని బాలకుడు :** ఇక్కడ కర్తకు క్రియకు బేధం లేదు. క్రియతో కలిసినదే కర్త. అది క్రియాత్మకము. భాసకము అంటే ప్రకాశరూపమే. అందుచేతనే అది పూర్ణము, ఏక రసాత్మకము అవుతున్నది.

అన్నింటినీ ప్రకాశింపచేసేటటువంటి ఆ భాసకము దేశకాలాలన్నింటి యందు వ్యాపించి ఉంటుంది. అందుకే అది పూర్ణమయింది. అదేవిధంగా చిన్మాత్రమైన ఆత్మకన్న వేరైన సత్త ఈ దృశ్య ప్రపంచానికి లేదు. చితియే దృశ్యరూపంగా ప్రకాశిస్తుంది. అందుకే చితికి పూర్ణత్వము సిద్ధించినది. అన్నీ ప్రకాశలతో తాదాత్మ్యం చెందుతాయి. లేకపోతే జగత్తులో ఏదీ ప్రకాశించదు. అందుచేతనే దానిని 'భారూపైకరసం' అంటారు.

**రాజు :** సూర్యకాంతిలో ప్రకాశించే కుండలు మొదలైనవి ఇతరమైన వాటివల్ల కూడా ప్రకాశిస్తున్నాయి. కాబట్టి వేరొక కాంతితో సంబంధం ఉన్నందువల్ల భాస్యము భాసించటం అనేది ఎందుకు జరగదు ?

**మునిబాలకుడు :** రాజా ! కుండకూ సూర్యకాంతికీ సంబంధం ఉన్నది. కుండ సూర్యకాంతిలో ఉన్నప్పుడే ప్రకాశిస్తుంది. భాస్యము, భాసకము కాకుండా ఇంకొకటి కూడా ఉంటే నువ్వు చెప్పినది సరిపోతుంది. ఇలా చెప్పుకుంటూపోతే, గతంలో చెప్పినట్లుగా అనవస్థా దోషం వస్తుంది. అద్వైతసిద్ధాంతం ప్రకారం ప్రకాశరూపమైన పరబ్రహ్మ కన్న వేరొకటిలేదు. దృశ్యప్రపంచమంతా మాయామయం. అంతఃపదార్థం కాని, బహిః పదార్థంకాని ప్రకాశంలోనే ఉన్నాయి.

**రాజు :** ఆకాశంలో విడివిడిగా నక్షత్రాలు ప్రకాశిస్తున్నట్లే భారూపం అంటే – ప్రకాశంలో కూడా భిన్నరూపాలుండవచ్చును, గదా !

**మునిబాలకుడు :** ఈ భారూపము సమస్త దేశకాలాలనూ మ్రింగివేస్తుంది. అన్నిచోట్ల, అన్ని కాలములందు తానే అయి ప్రకాశిస్తుంది. అలాంటప్పుడు ఇంకొక దానికి తావులేదు.

**రాజు :** ప్రపంచాన్ని ప్రకాశింపచేసేది చిచ్ఛక్తి. ఆ చిఛక్తికి ప్రకాశము అనే ధర్మం తనకన్న వేరుగా ఉన్నదా ? అంటే చిచ్ఛక్తి స్వయంగా ప్రకాశిస్తుందా ?

**మునిబాలకుడు :** భాసకత్వం స్వతసిద్ధం కాదు. మంకెన్న పువ్వు దగ్గర ఉన్నప్పటికి ఎర్రగా ప్రకాశిస్తుంది. అలాగే భాస్య సంబంధం వల్ల దానికి భాసకత్వం అనే ధర్మం వచ్చింది. కాబట్టి ఆ భాసకత్వం కూడా ప్రతిబింబాత్మకమే. అంతకన్న వేరు కాదు. అందుచేత చిదాత్మకు భాసకత్వం అనే ధర్మం భాస్యం అనే ఉపాధి వల్ల వచ్చిందే.

బయటకు కనిపించే ఈ జగత్తంతా అద్దంలోని ప్రతిబింబంలాగా, చిదాత్మ యొక్క ప్రకాశంలోనే ఉన్నది. దాన్నిమించి ఎక్కడా లేదు. పగుళ్ళు లేకుండా ఒకే ముక్కగా ఉన్న మంచి అద్దంలో, అద్దం కన్న వేరుగా ఏదీ కనపడదు. అలాగే పూర్ణ చిదాత్మలో ఈ జగత్తంతా భాసిస్తున్నది. చిదాత్మ కాకుండా ఈ జగత్తు ఎక్కడా ఉండదు.

**రాజు :** చిదాత్మ అనేది ఆకాశంలాగా సర్వగతం. అన్నిచోట్లా ఉంటుంది. ఆకాశంలో ఉండే పదార్థాలు వేరువేరుగా ఉన్నాయి. అలాంటప్పుడు ఇందాక అద్దంలో చూసినట్లుగా అని చెబుతూ భాసకము కన్న భాస్యం విడిగా ఉండదు. ఆ రెండూ కలిసే ఉంటాయి అని చెప్పటం ఎలా జరుగుతుంది.

**మునిబాలకుడు :** ఆకాశము అంటే - అవకాశాన్నిచ్చేది అని అర్థం. అంతా శూన్యం కాబట్టి అద్దం లాగా గట్టిగా ఉండదు. ఘనిష్టము, దట్టమయినది కాదు. అందుచేత దీనిలోని పదార్థాలు దానికన్న విడిగా ఉన్నట్లుగా కనిపిస్తుంది.

అనేకరూపాలు గల ప్రతిబింబాలు కనిపిస్తున్నప్పటికీ అద్దము ఒకటిగానే ఉన్నది. అలాగే విచిత్రమైన ఈ జగత్తు అనేక విధాలుగా ఆత్మతత్త్వంలో ప్రకాశిస్తున్నప్పటికీ నిద్రలో కలను చూసిన నేను, మెలకువగా ఉన్న నేను. ఈ రెండు దశలలోనూ నేను అనేది ఒక్కటే. కాబట్టి ఆత్మతత్త్వం ఒకటే అనటంలో ఏమాత్రం సందేహం లేదు.

**రాజు :** సృష్టి అంతా కల్పనా మాత్రసారమే అన్నారు. మరి ఎప్పుడూ నిర్వికల్పంగా ఉండే చితి నుంచి వికల్పమైన సృష్టి ఏరకంగా వచ్చింది ?

**మునిబాలకుడు :** పరాచితి ఏకరూపమే అయినప్పటికీ, బాహ్యమైన ఆకాశం అద్దంలో కనిపించే విధంగా, తనలో బాహ్యమైన ప్రపంచాన్ని ప్రకాశింపచేస్తుంది.

**రాజు :** ఆకాశమనేది బయట ఉండటం వల్ల అద్దంలో కనిపిస్తున్నది. మరి పరాచితి కన్న వేరైనది లేదు కదా !

**మునిబాలకుడు :** చితికి స్వాతంత్ర్య మనేది ఉన్నది. స్వాతంత్ర్యము అంటే - ఇహమైన కోరికలు లేకపోవటమే. అద్దము - జడము. కాబట్టే దానికి ఇతరమైన అపేక్ష ఉన్నది. చితి - చైతన్యము. దీనికి స్వాతంత్ర్యం ఉన్నది కాబట్టి బాహ్యబింబా పేక్ష లేదు. మొట్టమొదటి సారిగా బాహ్య ప్రపంచాన్ని ప్రకాశింపచేయటాన్నే 'సృష్టి' అంటారు. ఈ సృష్టినే - అవిద్య, తపస్సు అని కూడా అంటారు. పూర్ణమైన వస్తువు తన ఒక అంశతో ఉన్నట్లుగా భాసించటాన్నే 'బాహ్యభాసన' అంటారు.

**రాజు :** మునిబాలకా సరిగా అర్థం కాలేదు. ఇంకా వివరించు.

**మునిబాలకుడు :** రాజా ! పరమేశ్వరుడు నిర్వికల్పుడు. చిదేకరసుడు. అతడు చేతనుడు, జడత్వం ఉన్న వస్తువు తాను ప్రకాశించాలంటే, తనకన్న భిన్నమైన చైతన్యం గల వస్తువు యొక్క సాయం కావాలి. ఉదాహరణకు చీకటిలోఉన్న కుండ ప్రకాశించదు. అంటే – మన కంటికి కనపడదు. ఆ కుండను చూడాలంటే వెలుతురు కావాలి. ఈ రకంగా జడము ప్రకాశించాలంటే చైతన్యము యొక్క సహాయం కావాలి. కాని దీపాన్ని లేదా సూర్యుణ్ణి చూడటానికి ఏసాధనముగాని, దేనిసాయంగాని అవసరం లేదు. అది స్వయంప్రకాశం. అలాగే పరమాత్మ స్వయం ప్రకాశం గలవాడు. చిదాత్మకు ఇతర అపేక్ష ఏదీ లేదు. అది స్వతంత్రము. ఈ స్వాతంత్ర్యాన్నే శక్తి, క్రియ, విమర్శ మొదలైన పేర్లతో పిలుస్తారు. సృష్టి కాలంలో చిదాత్మ తన రూపాన్ని మాత్రమే ప్రకాశింపచేస్తుంది. తాను మాత్రమే ప్రకాశిస్తూ ఉంటుంది. పరమేశ్వరునికి ఈ స్వాతంత్ర్యమనేది నిత్యము, అనన్యము అయి ఉన్నది. ఈ స్వాతంత్ర్యమే ప్రళయకాలంలో, జీవుల యొక్క అదృష్ట సహకారంతో, తన స్వరూపాన్ని పరిమితమైన దానిలాగా భాసింపచేస్తుంది. అది తన అంశము అన్నట్లు స్ఫురింపచేస్తుంది. పరిచ్ఛిన్నమైన అనగా పరిచ్ఛేదమైనది. అంటే కొంతమేర మాత్రమే ఆక్రమించినది అయినటువంటి ఈ ఆత్మావభాసనాన్నే బాహ్యావభాసనము అంటారు.

రాజా ! నేను అంటే 'ఈ దేహము' అని అనుకుంటారు. అంటే 'అహత' అనేది దేహాన్నంతటినీ వ్యాపించి ఉంటుంది. శరీరంలో ఏదో ఒక భాగము విడిపోతే అనగా ఒక కాలుగాని, చెయ్యిగాని తెగిపోతే అలాపోయిన భాగాన్ని 'నేను' అనం కదా. అంటే అక్కడ 'అహంత' ఉండదు. విడిపోయిన భాగం అహంత కన్న వేరుగా అనిపిస్తుంది. పోయిన ఆ భాగంలో అహభావం లేదు. ఆత్మలో ఈరకంగా భాసించటమే 'బాహ్యావ భాసనం'. దీన్నే అవ్యక్తము, జడశక్తి అంటారు. పూర్ణమైనటువంటి చిదాత్మ, తన స్వాతంత్ర్యశక్తి వలన పరిచ్ఛిన్నంగా కనిపించటమే అవిద్య. ఇదే బాహ్యావభాసనం. పరమేశ్వరుని మొదటి సృష్టి.

ఈ భాహ్యావభాసనాన్నే ఉపనిషన్మతం వారు 'మూలవిద్య' అంటారు. భగవంతుని శక్తినే "స్వాతంత్ర్యము" అంటారు. ఈ స్వాతంత్ర్యము అనే శక్తికి మూడు అవస్థలున్నాయి.

1. ప్రళయకాలంలో నిర్వికల్పంగా ఉన్నప్పుడు దాన్ని 'చిచ్ఛక్తి' అంటారు.

2. ప్రళయావసానకాలంలో దాన్ని 'మాయాశక్తి' అంటారు.

3. వికల్పదశ బాగా వచ్చినప్పుడు దాన్ని 'జడశక్తి' అంటారు. ఈ జడశక్తినే ప్రకృతి అనికూడా అంటారు.

ఆ మాటలు విన్న మహాశేనుడు బ్రహ్మ ఒక్కటే సత్యము. ఈ జగత్తు అంతా మిధ్య. ఆత్మ ఒక్కటే నిత్యము సత్యమైనది అని తెలుసుకుని సమాధిస్థితిని చేరి, ఒకలోకాన్ని తాను కూడా నిర్మించి, చాలాకాలం అందులో విహరించి, చివరకు దేహాన్ని చాలించాడు.

కాబట్టి ఓ పరశురామా ! ఈ జగత్తు సత్యము అని భావన చేస్తేనే అది సత్యంగా కనిపిస్తుంది. ఈ విషయాన్ని తరచి తరచి ఆలోచించి నిర్ణయించుకో. అప్పుడు నీ భ్రాంతి పూర్తిగా తొలిగిపోతుంది అన్నాడు దత్తాత్రేయుడు అంటూ పద్నాల్గవ అధ్యాయాన్ని పూర్తి చేశాడు రత్నాకరుడు.

## 26. పరోక్ష జ్ఞానం

"గురువుగారూ ! మునిబాలకుడు చేసిన ఉపదేశం వల్ల పరశురామునికి జ్ఞానోదయం అయిందా ? ఆ తరువాత ఏం జరిగిందో ? వివరించండి". అన్నాడు నారాయణభట్టు విరించటం మొదలుపెట్టాడు రత్నాకరుడు.

శైలలోకం గురించి విన్న పరశురాముడు చాలా ఆశ్చర్యపోయాడు. తన గురువైన దత్తాత్రేయుడు చెప్పిన విషయాలను సునిశితంగా పరిశీలించాడు. మళ్ళీ దత్తాత్రేయుడి దగ్గరకు వెళ్ళి, ఆయనకు నమస్కరించి "గురుదేవా ! తమరు చెప్పిన విషయమంతా పూర్తిగా విన్నాను. బాగా ఆలోచించి, దాన్ని అర్థం చేసుకున్నాను. జ్ఞానము ఒక్కటే సత్యము. జ్ఞానంలో దృశ్యము అద్దంలో కనిపించే ప్రతిబింబంలాగా కల్పితమైనది. అందుకే దాన్ని 'మిధ్య' అంటారు. ఆ జ్ఞానము దృశ్యము కన్నవేరైనది. అది బ్రహ్మాదులకు కూడా ఈశ్వరి. జ్ఞానమే చితికి రూపము అనంతమైన శక్తి. ఈ జగత్తుకు పరమేశ్వరి యొక్క స్వాతంత్ర్యమే కారణము. ఈ విషయమంతా నాకు అర్థమయింది. అయితే 'జ్ఞేయము లేని కేవల జ్ఞానము ఒకటే ఉన్నది" అనే విషయం నాకు అర్థం కాలేదు. జ్ఞేయము అనేది ఎప్పుడూ భాసిస్తూనే ఉంటుంది కదా ! జ్ఞేయము అనగా తెలుసుకోతగినది జ్ఞానము అంటే తెలియబడినది ఏ విధంగా ఉంటుంది ? గ్రహించటానికి సాధ్యం కాని దానివల్ల ప్రయోజనం ఏమిటి ? అజ్ఞానం పురుషార్థ సాధకమెలా అవుతుంది ? మోక్షానికి సాధనం కానటువంటి సాధనము కూడా బంధహేతువే అవుతుందికదా ? పురుషార్థ స్వరూపమైన మోక్ష స్వరూపం ఏమిటి ? జ్ఞానం కలిగిన తరువాత కూడా జీవించి ఉన్నవాడిని జీవన్ముక్తుడు అన్నారు కదా ! అటువంటి వాడు దైనందిన కార్యక్రమాలు ఏ విధంగా నిర్వహిస్తాడు?

చాలామంది జ్ఞానులు లోక వ్యవహారాలు నడుపుతూనే ఉన్నారు కదా ! ఇక్కడ వ్యవహారము అంటే వికల్ప జ్ఞానం. జ్ఞానమనేది ఒక్కటే అది అద్వితీయము అంటారు కదా ! జ్ఞానం ఒక్కటే అయినప్పుడు, జ్ఞేయం అనేకం ఎలా అవుతుంది ? శుద్ధజ్ఞానం ఒక్కటే ఉన్నప్పుడు, భేద స్వరూపమైన వికల్పజ్ఞానం ఎలా ఉంటుంది ? ఏకము, అనేకము అనేవి పరస్పర విరుద్ధాలు కదా. మోక్ష సాధనమైన విజ్ఞానము, జ్ఞాన ఫలమైన మోక్షము అనే ఈ రెండిటిలోనూ నానాత్వం లేకపోయినట్లైతే అంటే జ్ఞానము, మోక్షము ఒకటే అయితే లోకంలో జ్ఞానులు అనేకరకాలుగా ఎందుకున్నారు ?

ఏయే కాలాలలో ఏయే కర్మలు చెయ్యాలని శాస్త్రాలు చెబుతున్నాయో, జ్ఞానులు ఆయా కాలాలలో ఆయా కర్మలను చేస్తున్నారు. కొందరు దేవతలను వివిధ మార్గాలలో ఆరాధిస్తున్నారు. కొందరు ఇంద్రియ నిగ్రహంతో సమాధి స్థితిలో ఉంటారు. కొందరు తపోదీక్షలో ఉంటారు. కొందరు ఇంద్రియాలను నిగ్రహించి వ్రతాలు ఆచరిస్తుంటారు. కొందరు తమ శిష్యులకు బోధిస్తుంటారు, కొందరు రాజ్యాన్ని పాలిస్తుంటారు, కొందరు సభలలో వాదిస్తుంటారు, కొందరు గ్రంథాలు వ్రాస్తుంటారు, కొందరు లోకనింద్యములైన పనులు చేస్తుంటారు. వీరందరినీ 'జ్ఞానులు' అనే అంటున్నాము.

ఈ రకంగా అనేక రకాలుగా ఉన్నటువంటి వీరి 'జ్ఞానిత్వం' ఒకటేనా ? లేక వేరు వేరా ? జ్ఞానము, దానిఫలమైన మోక్షము. ఈ రెండింటిలోనూ భేదం లేనప్పుడు జ్ఞానులలోను, వారి జ్ఞానిత్వంలోనూ ఎందుకు భేదం కనిపిస్తోంది ? ఎవరి జ్ఞానం వారిదే, ఎవరి ముక్తి వారిదే అయినప్పుడు జ్ఞానము, మోక్ష స్వరూపము ఒకటే అనటంలో అర్థం లేదు. ఓ గురుదేవా ! ఇవి నాకున్న అనుమానాలు. వీటిని తీర్చవలసినది అంటూ ప్రార్థించాడు. ఆ మాటలు విన్నదత్తాత్రేయుడు "పరశురామా ! నువ్వు తెలుసుకున్నదే సత్య స్వరూపం. ఇంకొకటికాదు. అయినా నీకింకా బాగా తెలియలేదు. పరాచిత తనయందు జగచిత్రాన్ని ప్రకాశింపచేస్తున్నది అంటున్నావు. అది పరోక్ష జ్ఞానమే. అనుభవానికి వచ్చిన అపరోక్ష జ్ఞానం కాదు. ఇటువంటి దాన్నే తటస్థ జ్ఞానం అంటారయ్యా. ఇటువంటి పరోక్ష జ్ఞానం వల్ల ఉపయోగం లేదు. 'అపరాచితియే నేను' అనే అపరోక్ష జ్ఞానం నీకు కలిగితే అప్పుడు "ఆపరాచితి తనలో జగచ్చిత్రాన్ని ప్రకాశింపచేస్తుంది". అని చెప్పావు. తటస్థ జ్ఞానము స్వప్న జ్ఞానంలాంటిది. కలలో పెద్ద నిధి దొరికినా దానివల్ల ప్రయోజనం ఏమీ లేదు. అలాగే ఈ పరోక్ష జ్ఞానం వల్ల కూడా ప్రయోజనం లేదు. దీనికి ఉదాహరణగా ఒక కథ చెబుతాను విను" అన్నాడు.

## 27. అష్టావక్రుడు - ఆత్మదర్శనం

గురువుగారూ! పరశురాముడు చాలామంచి ప్రశ్న వేశాడు. జ్ఞానమనేది రకరకాలుగా ఉండదు. అలాగే మోక్షం కూడా. మరి దీనికి దత్తాత్రేయుడు ఏం సమాధానం చెప్పాడు? అన్నాడు కృష్ణశర్మ చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

పూర్వకాలంలో విదేహ దేశాన్ని జనక మహారాజు పాలిస్తుండేవాడు. అతడు చాలా ధర్మపరుడు, ఆధ్యాత్మిక వేత్త, మహాజ్ఞాని, తత్త్వం బాగా తెలిసినవాడు. అతడు యజ్ఞయాగాలు, క్రతువులు మొదలైనవి అనేకంచేసి వయోవృద్ధులను, జ్ఞానవృద్ధులను కళాకారులను, పండితులను అనేకమందిని సన్మానించాడు.

ఒకసారి జనక మహారాజు ఒక గొప్ప యాగం తలపెట్టాడు. ఆ యాగానికి దేశంలో ఉన్న పండితులు, తపస్సంపన్నులు, కళాకారులు, జ్ఞానులు అంతా వచ్చారు. అదే సమయంలో వరుణుడు కూడా ఒక యాగం చేయ ప్రారంభించి అందరినీ ఆహ్వానించాడు. పండితులు అందరూ జనకుడి యాగానికే వెళ్ళారు కాని వరుణుని యాగానికి ఎవరూ పోలేదు. తన యాగానికి పండితులు ఎవరూ రానందుకు చాలా విచారించాడు వరుణడు.

వరుణుని కుమారుడు 'తర్కకుశలుడు' చాలా గొప్ప పండితుడు. ఎదుటివారితో వాదించి వారిని ఓడించటంలో చాలా నేర్పరి. వాదనలో ముఖ్యమైనవి రెండు 1. జల్పము, 2. వితండ వాదము. జల్పము అంటే తను ఒక సిద్ధాంతాన్ని కలిగి ఉండి, ఆ సిద్ధాంతాన్ని స్థాపించటానికి మాత్రమే ఎదుటి వారి వాదాన్ని ఖండించటం. ఇక వితండవాదము అంటే తనకు ఒక సిద్ధాంతమంటూ లేక కేవలము ఎదుటి వారి సిద్ధాంతాన్ని ఖండించటానికి మాత్రమే ఉపయోగించే వాదము. పండితులు ఎవ్వరూ తన తండ్రి చేసే యాగానికి రాకపోవటం చూసి చాలా బాధపడి ఏరకంగా అయినాసరే వారిని ఈ యాగానికి రప్పించాలి అనుకుని సాధారణ బ్రాహ్మణ వేషధారియై జనకుని యాగశాలకు వచ్చాడు. జనక మహారాజు అతణ్ణి ఆహ్వానించి తగిన విధంగా సన్మానించాడు. అప్పుడు తర్కకుశలుడు మహారాజును ఆశీర్వదించి "రాజా ! పద్మములతో నిండి ఉన్న సరస్సు కాకులు, గ్రద్దలతో కూడి ఉంటే శోభించదు. అది హంసలతో కూడి ఉంటేనే శోభిస్తుంది. అలాగే ఇంత గొప్ప యాగం చేస్తున్న నీ సభలో పండితులు ఉంటే దేదీప్యమానంగా ఉండేది. కాని ఒక్క పండితుడు కూడా నాకు కనిపించటంలేదు. మూర్ఖులతో నిండి ఉన్న సభలోకి నేనెలా ప్రవేశిస్తాను ? కాబట్టి నేను వెళ్ళిపోతున్నాను" అన్నాడు.

తర్కకుశలుని మాటలు విన్న పండితులకు బాగా కోపం వచ్చి "ఓ మూర్ఖుడా ! మమ్మల్నందరినీ అవమానిస్తున్నావు. అసలు నువ్వు ఏ విద్యలో పండితుడవు ? మమ్మల్ని దేనిలో జయించగలవు ? లోకంలోని పండితులంతా దాదాపుగా ఇక్కడ ఉన్నారు. నువ్వు ఈ లోకాన్నే అవమానిస్తున్నావు. అంత గొప్పవాడివైతే మమ్మల్ని ఓడించు" అన్నారు.

ఆ మాటలు విన్న తర్కకుశలుడు వారితో "మిమ్మల్నందర్నీ క్షణంలో ఓడిస్తాను. అయితే ఒక పందెం. వాదనలో నేను ఓడిపోతే నన్ను సముద్రంలో ముంచండి. మీరు ఓడిపోతే, ఓడినవారిని ఓడినట్లుగా సముద్రంలో ముంచి వేస్తాను. దీనికి ఇష్టమైతే నాతో వాదానికి దిగండి" అన్నాడు.

సభలోని పండితులంతా దీనికి అంగీకరించారు. తర్కకుశలుడు పండితులను జల్పంతో కొందరినీ, వితండవాదంతో కొందరినీ ఓడించి, ఓడిన వారిని సాగరగర్భంలో ముంచివేశాడు. వరుణుడి దూతలు సముద్రంలో మునిగిన పండితులను సగౌరవంగా వరుణుని యాగశాలకు తీసుకుపోయారు. వరుణుడు వారందరినీ ఉచిత రీతిన సత్కరించాడు. పండితులు కూడా చాలా సంతోషించారు.

'కుషీతకుడు' అనేవాడు ఒక మహర్షి, మహాజ్ఞాని అతని కుమారుడు 'కహోలుడు' చాలా గొప్ప పండితుడు. జనకుని ఆస్థానంలో యాజ్ఞవల్క్య సంవాదం జరిగినప్పుడు యాజ్ఞవల్క్యుడితో వాదనకు దిగి ఆత్మను సమిష్టిగా వివరించమని అడిగాడు. ఇప్పుడు తర్కకుశలుడు కహోలుణ్ణి కూడా ఓడించి సముద్రగర్భంలో ముంచివేశాడు.

కహోలుడి కుమారుడు అష్టావక్రుడు. వేదవేదాంగవిదుడు, శాస్త్రాధ్యయనం చేసినవాడు. ప్రత్యేకించి తర్కశాస్త్రంలో అందివేసిన చెయ్యి. వాద ప్రతివాదాలలో అఖండుడు. తండ్రి సముద్రంలో మునిగిపోయాడన్న వార్త వినగానే కోపితుడయి హుటాహుటిన రాజసభకు విచ్చేసి తర్కకుశలుడితో వాదనకు దిగాడు. వాదప్రతివాదాలు భయంకరంగా సాగాయి. ఎట్టకేలకు అష్టావక్రుడి వాదనాపటిమ ముందు తర్కకుశలుడు నిలువలేకపోయాడు. ఓడిపోయిన తర్కకుశలుడు పందెం ప్రకారం కడలిలో కలిసిపోవాలి. అలాగే చెయ్యమని సభాసదులతోపాటు అష్టావక్రుడు కూడా ఆజ్ఞాపించాడు. అప్పుడు తర్కకుశలుడు బ్రాహ్మణవేషాన్ని వదిలి, నిజ స్వరూపంతో నిలచి, తానింతవరకు సముద్రగర్భంలో ముంచి వేసిన పండితులనందరినీ భూలోకానికి రప్పించాడు. చనిపోయారనుకున్న వారంతా బ్రతికి రావటంతో అష్టావక్రుడు కొంచెం అతిశయం చెందాడు. అతడు బాగా గర్వించాడు. వీరంతా తన మూలంగానే బ్రతికి బయటపడ్డారు.

కాబట్టి వీరందరికి ప్రాణదాత తానే అనుకున్నాడు. దాంతో వారందరినీ తనకన్న తక్కువగా చూసి అవమానించాడు. దీంతో పండితులంతా బాగా బాధపడ్డారు. గతంలో ఒకసారి అవమానం పొందాము. మళ్ళీ ఇది రెండవసారి. అంతా విధిలిఖితం అని విచారిస్తున్నారు. ఇంతలో రాజాస్థానంలోకి ఒక తాపసి వచ్చింది. కాషాయాంబరాలు ధరించి నవయవ్వనవతిలా ఉన్నది. ఆమె ముఖం బ్రహ్మతేజస్సుతో వెలిగిపోతుంది. ఆమెను చూడగానే తమ కష్టాలు, అవమానాలు తీర్చేది ఈమె మాత్రమే అనుకున్నారు పండితులు. దాంతో వారందరూ ఆమెను శరణుచొచ్చారు. ఆమెకు పరిస్థితి అర్ధమయింది. తాపసులను ఓదార్చింది. జనక మహారాజు ఆమెను ఉచితరీతిన గౌరవించాడు. అప్పుడామె అష్టావక్రునితో "వత్సా ! నువ్వు చాలామంచి బుద్ధిమంతుడవు. వరుణ కుమారుడైన తర్కకుశలుణ్ణి వాదంలో ఓడించి పండితులందరినీ విడిపించావు. ఒకచిన్న విషయం అడుగుతాను. ఏమాత్రం కపటం లేకుండా సమాధానం చెప్పు. ఏరకమైన వాదప్రతివాదాలకు తావులేకుండా యదార్ధం చెప్పు. దేనిని గురించి తెలుసుకున్నంత మాత్రంచేత అపరిచ్ఛిన్నమైన అమృతత్త్వం వస్తుంది ? దేనిని తెలుసుకున్నంత మాత్రాన సంశయాలన్నీ తొలగిపోతాయి ? ఇంకా తెలుసుకోవలసినది ఏదీ ఉండదు ? వేద్యమైనది. తెలుసుకోటానికి వీలులేనటువంటిది అయిన ఆ తత్త్వం గురించి నీకు తెలిస్తే నాకు చెప్పు. అన్నది.

ఆ మాటలు విన్న అష్టావక్రుడు "అమ్మా ! నువ్వు అడిగినది చాలా చిన్నవిషయం. నేను అన్ని శాస్త్రాలను చాలాసార్లు నిశితంగా పరిశీలించాను. నువ్వు అడిగినదానికి ఉన్నదున్నట్లుగా సమాధానం చెబుతాను విను. నువ్వు అడిగినది అన్ని జగత్తులకు మూలకారణము. అది మధ్యాంతరహితమైనది. దేశకాలముల వల్ల అది పరిచ్ఛన్నము కాదు. అది శుద్ధమైనది, అఖండమైనది. దానిని ఆశ్రయించియే చరాచర జగత్తు అంతా ప్రవర్తిల్లుతున్నది. అదే పరమపదము. దాన్ని గురించి తెలుసుకుంటేనే మానవుడు నిశ్చలము, అమృతము అయిన స్థితిని పొందగలుగుతాడు. అద్దము యొక్క స్వరూపాన్ని గురించి తెలుసుకుంటే, దానిలో కనిపించే ప్రతిబింబాలన్నీ తెలుస్తాయి. అలాగే ఈ పరమపదాన్ని గురించి తెలుసుకుంటే అన్ని విషయాలు తెలుస్తాయి. ఒక కోరిక అనేది ఉండదు. ఆత్మ కన్నా భిన్నంగా తెలుసుకోలేదు. అందువల్ల ఆత్మ వేద్యము లేదా జ్ఞేయము కాదు. శాస్త్ర దృష్టితో పరిశీలించి ఈవిషయం చెబుతున్నాను. జ్ఞాత అనేవాడున్నప్పుడే జ్ఞేయమనేది ఉంటుంది" అన్నాడు.

ఆ మాటలు విన్న తాపసి "మునిపుత్రా ! నువ్వు చెప్పింది అంతా బాగుంది. దీన్ని అందరూ ఒప్పుకుంటారు. అయితే నీ మాటలలో పరస్పర విరుద్ధం కనిపిస్తోంది. జ్ఞాత అనేవాడు లేనందువల్ల ఆపరతత్త్వము జ్ఞేయము కాదు అనిచెప్పి, ఆతరువాత వెంటనే దానిని తెలుసుకున్నవాడు అమృతమయుడవుతాడు అంటున్నావు. ముందు చెప్పిన మాటలకు, తరువాత చెప్పిన మాటలకు పొంతన లేదు. అవి పరస్పర విరుద్ధంగా ఉన్నాయి. ఆత్మ లేదంటావా ? దాన్ని నిరూపించు. ఒకవేళ ఉన్నది అంటావా ? అది తెలియతగినది కాదు అనకు.

ఇంకో విషయం శాస్త్ర దృష్టితో దాన్ని నిరూపించాను అన్నావు. అంటే, స్వయంగా నీకు తెలియదన్నమాట. జనకమహారాజు సభలో ఉన్నావు. అసందర్భంగా మాట్లాడితే నిన్ను అంతాచులకనగా చూస్తారు. అవమానం పొందుతావు జాగ్రత్త" అన్నది.

ఆ మాటలు జాగ్రత్తగా విన్నాడు అష్టావక్రుడు. అతడికి సమాధానం దొరకలేదు. ఏంచెయ్యాలో తెలియలేదు. సిగ్గుతో తలవంచుకుని ఆ తాపసితో "తల్లీ ! నీ ప్రశ్నలకు సమాధానం నాకు తెలియదు. ఇకనుంచి నేను నీకు శిష్యుడను" అన్నాడు. ఈ విధంగా పలికిన అష్టావక్రుని మాటలు విన్న తాపసి చాలా సంతసించి "వత్సా ! నేనడిగిన ప్రశ్నలకు సమాధానాలు నీకేకాదు. చాలామందికి తెలియదు. ఉపయోగం లేని తర్కశాస్త్రం వల్ల ఇది తెలియదు. శాస్త్రాలలో ఇది చెప్పబడలేదు. ఈ సభలోని వారెవరికీ ఇది తెలియదు. ఒక్క జనక మహారాజుకు, నాకు మాత్రమే తెలుసు. విద్వాంసులు కేవలము తర్కం వల్ల దీన్ని తెలుసుకోవటానికి ప్రయత్నిస్తున్నారు. అంతేకాని అనుభవం ద్వారా మాత్రం కాదు. సద్గురుసేవ, దేవతానుగ్రహము లేనిదే ఇది తెలియబడదు.

ఆత్మ సూర్యునిలాగా స్వయం ప్రకాశమైనది. ఈ విషయాన్ని గురువు ద్వారా తెలుసుకోవాలి. ఏకాగ్రతతో, అంతర్ముఖుడై పరిశీలించాలి. అంతవరకు ఆత్మ స్వయం ప్రకాశమైనదని గురువు ఎన్నిసార్లు చెప్పినా ఉపయోగం ఉండదు. తటస్థ భావాన్ని వదలి, ఆత్మ పరిశీలన చేసుకోందే ఆత్మవిజ్ఞానం అబ్బదు. ఒక పెద్దమనిషి ముత్యాలహారం మెడలో వేసుకున్నాడు. ఆ మాట మరిచిపోయి, దాన్ని దొంగ ఎత్తుకుపోయాడు అనుకుంటు న్నాడు. ఇంతలో ఎవరో వచ్చి హారం నీమెడలోనే ఉన్నది అనిచెప్పారు. అయినా అతడు చూచుకోలేదు. ఆ హారం తనమెడలోనే ఉన్నదని తెలియలేదు. అలాగే ఆత్మతత్త్వాన్ని గురించి గురువు ఎన్నిసార్లు బోధించినప్పటికి, దృష్టి అంతర్ముఖం కానిదే ఆత్మతత్త్వం బోధపడదు.

**అష్టావక్రుడు :** దృష్టిని అంతర్ముఖం చేసినప్పటికీ, తెలుసుకోటానికి సాధ్యం కాని ఆత్మను గురించి ఏవిధంగా తెలుసుకోగలుగుతాము ?

**తాపసి :** దీపము వస్తువులను ప్రకాశింపచేస్తుంది. అయినా తాను ప్రకాశించటానికి ఇంకొక వస్తువు అవసరం లేదు. అలాగే సూర్యుడు కూడా అయితే ఈ దీపము, సూర్యుడు మొదలైనవి చిచ్ఛక్తి వల్లనే ప్రకాశిస్తున్నాయి. అందుచేత చిదాత్మ స్వయంగా ప్రకాశిస్తున్నదా? లేదా ? అనే విషయాన్ని అంతర్ముఖుడవై బాగా ఆలోచించు.

**అష్టావక్రుడు :** సుషుప్తిలో, ప్రళయకాలంలో ఏదీ ప్రకాశించదు కదా ! అందుచేత చిత్ప్రకాశము కూడా పరిచ్ఛిన్నమేకదా .

**తాపసి :** ప్రకాశించటం లేదు అనేటప్పుడు కూడా చితి ప్రకాశిస్తూనే ఉన్నది. లేకపోతే అది ప్రకాశించటం లేదు అనే జ్ఞానమే నీకు కలగదు. ప్రకాశించటం లేదు అన్న భావనలోనే జ్ఞానమున్నది.

**అష్టావక్రుడు :** అప్పుడు ప్రకాశంలేకపోవటమే భాసిస్తున్నది కాని చితి భాసించటం లేదుకదా !

**తాపసి :** ప్రకాశాభావము అంటే అప్రకాశము. అది స్వయంప్రకాశము కాదు. అందుకే అది ప్రకాశింపదు. కాబట్టి దాన్ని ప్రకాశింపచేసే జ్ఞానము (చితి) అప్పుడు ఉండి తీరాలి. అందుచేత చితి ఎప్పుడూ ప్రకాశిస్తూనే ఉంటుంది. సూక్ష్మదృష్టితో పరిశీలించు.

**అష్టావక్రుడు :** వస్తువు ఏదైనా కనిపిస్తే, దాన్ని గురించి ఆలోచించవచ్చు. మరి శుద్ధచితి కనిపించదుకదా. దాన్ని గురించి ఏవిధంగా విచారిస్తాము ?

**తాపసి :** దృష్టిని అంతర్ముఖం చెయ్యలేనివాడు శుద్ధచితిని చూడలేడు. అందుకే మోహంలోపడి సంసార చక్రంలో గిరగిరాతిరుగుతుంటాడు. మనస్సు నిశ్చలం కానంతవరకు, సంకల్పాలను వదలనంత వరకు అంతఃదృష్టి రాదు. అంతఃదృష్టి రానంతకాలము చిత్స్వరూప దర్శనం కాదు.

ఘటం ఆకాశంతోనిండి ఉంటుంది. అయితే ఘటాన్ని ధ్యానంతో కూడా నింపవచ్చు. అప్పుడు ఘటంలో ఆకాశముండదు. ఘటంలో నుంచి ధ్యానాన్ని గనక తీసివేస్తే అది ఆకాశంతో నిండుతుంది. అలాగే మనస్సు సహజంగా శుద్ధచితితో నిండి ఉంటుంది. ఎప్పుడైతే అది సంకల్పాదులతో నిండుతోందో అప్పుడు శుద్ధచితి భాసించదు. సంకల్పా

వికల్పాలను వదలివేస్తే మళ్ళీ శుద్ధచితితో ప్రకాశిస్తుంది. అప్పుడు స్వస్వరూప సాక్షాత్కారం జరుగుతుంది. అంటే చితిదర్శనం కోసం ఏమీ చెయ్యవలసిన పనిలేదు. కేవలం సంకల్ప వికల్పాలను వదలి మనసును నిశ్చలం చేస్తే చాలు. ఈ స్థితిలో ఒక్కక్షణం ఉంటే చాలు నీకు ఆత్మదర్శనమవుతుంది. అదే మోక్షము, మునిపుత్రా ! నీకు సర్వమూ వివరించాను. ఇంకా తెలుసుకోవాలంటే జనకమహారాజును అడుగు. నేను ఇక సెలవు తీసుకుంటాను" అనిచెప్పి తాపసి నిష్క్రమించింది. అని దత్తాత్రేయుడు పరశురాముడి అనుమానం తీర్చాడు అంటూ పదిహేనవ అధ్యాయం పూర్తిచేశాడు రత్నాకరుడు.

## 28. సుషుప్తి

"గురువుగారూ ! తాపసి చేసిన ఉపదేశాన్ని విన్న తరువాత అష్టావక్రుడికి పూర్తిగా జ్ఞానోదయమైందా ? ఆ తరువాత ఏం జరిగిందో తెలియజేయండి" అన్నాడు నారాయణభట్టు. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

తాపసి వెళ్ళిపోయిన తరువాత అష్టావక్రుడు మునులతో కలిసి జనకమహారాజు దగ్గరకు వెళ్ళి "రాజా ! ఆ తాపసి ఆత్మయొక్క వృత్తాంతాన్ని సంక్షిప్తంగా చెప్పింది. అందుకని నాకు పూర్తిగా అర్థం కాలేదు. ఆత్మస్వరూపాన్ని పూర్తిగా తెలుసుకునే మార్గం ఏమిటో నాకు పూర్తిగా వివరించు" అన్నాడు. ఆ మాటలు విన్న జనకమహారాజు "మునిపుత్రా ! శుద్ధచితి అనేది పూర్తిగా జ్ఞేయము అంటే తెలియతగినది కాదు. పూర్తిగా అజ్ఞేయమూ కాదు. ఒకవేళ అది పూర్తిగా అజ్ఞేయము (తెలియరానిది) అయితే గురువు మాత్రం దానిని ఏవిధంగా బోధిస్తాడు ? తెలిసినటువంటివాడు మాత్రమే పూర్తిగా చితితత్త్వాన్ని వివరించగలడు. అందుకే గురువును ఆశ్రయించాలి. ఆత్మతత్త్వ జ్ఞానము అనేది అతి సులభమూ అతికష్టము కూడా. ఇది ఎవరికి సులభం అంటే అంతర్ముఖుడికి ఇది చాలా సులభం. బాహ్యదృష్టి కలవాడికి దానిని నిషేధిస్తూ నిరూపించవచ్చునయ్యా. ఈవిధంగా అది వేద్యము అవుతుంది. ఘటము, పటము మొదలైనవి వేద్యములైనట్లే, జ్ఞానం కూడా వేద్యమే. ఎవరైనా నాకు ఘట జ్ఞానమున్నది అంటే, అక్కడ ఘటము, దాని ఆకారంలో ఉన్న జ్ఞానము రెండూ జ్ఞేయములే. అంటే ఘటాకారంలో ఉన్న జ్ఞానం కూడా జ్ఞేయమే అవుతుంది. ఘటము మొదలైన ఉపాధులు లేకుండా జ్ఞానం వేద్యంకాదు. ఘటజ్ఞానము, పటజ్ఞానము అనేటటువంటి జ్ఞానాలన్నింటిలోనూ జ్ఞాన స్వరూపము అంతర్లీనంగా భాసిల్లుతూ ఉంటుంది. అప్పుడు ఆ జ్ఞానము, ఆయా రూపాలతో వేద్యమే అవుతుంది.

ఈరకంగా ఉపాధిరహితంగా అన్నింటిలోనూ అనుస్యూతంగా ఉండే జ్ఞానము చితి యొక్క నిజస్వరూపము. నాకు ఘటజ్ఞానం కలిగింది అనేజ్ఞానంలో ఘటము, జ్ఞానము అనే రెండు అంశాలూ ఉన్నాయి. అందులో ఘటము ప్రకాశ్యము - ప్రకాశించేది జ్ఞానము ప్రకాశకము - ప్రకాశింపచేసేది. ప్రకాశక మాత్రంగా ఉండే జ్ఞానాన్ని "భావశక్తి" అంటారు. కనిపించే ఘటంలో మట్టి, నీలంరంగు అంతర్లీనంగా ఉన్నాయి. అలాగే భాసకరూపమైన జ్ఞానంలో భాస్యం అనేది అంతర్గతంగా లేదు.

జ్ఞానమనేది విషయాన్ని బట్టి ఉంటుంది. అదే ఘట జ్ఞానము; పటజ్ఞానము, వృక్షజ్ఞానము మొదలైనవి. ఈవిషయాన్ని, జ్ఞానాన్ని కలిగిన పురుషులు అనేకమంది ఉంటారు. అందుచేత విషయాన్ని బట్టిగాని, వ్యక్తులను బట్టిగాని వివిధ రకాలుగా కనిపించినా, అన్నిటిలోనూ ఏకరూపంగా అనుగతంగా ఉండే భాసకమైన జ్ఞానం ఒక్కటే. అంటే జ్ఞేయ భేదాన్ని, జ్ఞాతృభేదాన్ని అనుసరించి వచ్చిన భేదమే తప్ప అసలు జ్ఞానంలో భేదం లేదు. అన్నిభావాలకు ఆశ్రయమైన చితిశక్తి ఒక్కటే. వేద్యాంశంలేని కేవలజ్ఞానమే ఆ చితి యొక్క తత్త్వము. మునిపుత్రా ! వేద్యములన్నీ జ్ఞానమువల్లనే ప్రకాశిస్తున్నాయయ్యా. కాబట్టి జ్ఞానం కన్నా వేరైనవి. తెలుసుకోవలసి లేదా, తెలియతగిన వస్తువుల ధర్మాలతో జ్ఞానస్వరూపానికి సంబంధం లేదు. సంకల్పరహితమైన బుద్ధితో, వేద్యాకారంలేని జ్ఞానాన్ని నీలో పరిశీలించు. అన్నిటినీ తెలుసుకునే ఆ జ్ఞాతయే చితి. అదే నీయొక్క నిజస్వరూపం.

బింబాల ఆకారంలో భేదాలున్నందువల్ల ఒకే అద్దం. ఆ బింబాలు ఆకారంలో అనేకంగా కనపడుతుంది. అలాగే చితి ఒక్కటే. కాని దృశ్యముల ఆకారంలో అనేకంగా కనిపిస్తుంటుంది. ఈరకంగా దృశ్యాల సంబంధంవల్ల చితివేద్యంగా భాసిస్తుంది. అంతేకాని సహజంగా అది వేద్యం కాదు. చరాచరజగత్తుకూ ఆధారం అదే. అసలు శుద్ధచితి అనేది తెలుసుకునేవాడి రూపమే. అలాంటప్పుడు ఇంకా తెలియబడేది ఎలా అవుతుంది? ఆత్మగా భావించే ఈ దేహాదులన్నింటినీ ఇది ఆత్మకాదు అని నిషేధించగా చివరకు మిగిలేదే నీ నిజస్వరూపం. అదే చితి. అదే సర్వనిషేధాలకు అవధి. స్వప్రకాశమైనది. మునిపుత్రా ! ఈరకంగా నీ నిజస్వరూపాన్ని గుర్తించవయ్యా.

శరీరము, ప్రాణము, మనస్సు మొదలైనవన్నీ అస్థిరములు. ఇది నా శరీరము. ఇది నా ప్రాణము అన్నప్పుడు, స్థిరమైనటువంటి నువ్వు అస్థిరమైన శరీరము మొదలైన వాటిలో 'నేను' అనేరూపంతో స్థిరంగా ఉన్నావయ్యా, కాని నువ్వే ఈశరీరం కాదు. ఈప్రాణం అంతకన్నా కాదు. శరీరము అంటే నవధాతువులతో, కూడినటువంటిది.

అది నీరూపం ఎలా అవుతుంది ? ఆత్మ అనేది 'నేను' అనేరూపంలో ఎప్పుడూ ప్రకాశిస్తూనే ఉంటుంది. అయితే శరీరం కన్న వేరైన ఘటాదులను చూసే సమయంలో నేను అనే ఈ శరీరము మొదలైనవి ఉండవు.

**అష్టావక్రుడు :** వస్తువులను చూసేటప్పుడు కూడా నేను చూస్తున్నాను అన్నప్పుడు, నేను అంటే ఈ దేహమే కదా.

**జనకుడు :** అప్పుడు తెల్లగా, లావుగా, ఎత్తుగా ఉండే ఈ శరీరం భాసించటంలేదు. ఒకవేళ అలా అయితే తెల్లగా ఉన్న నేను చూస్తున్నాను అనుకోవాలి అదిలేదు. అప్పుడు ఆత్మకాని శరీరాన్ని, ఆత్మగా భావించి నేను చూస్తున్నాను అంటున్నాము 'ఇది నా శరీరము' అన్నప్పుడు శరీరం ఆత్మకన్న వేరైనదే కాని ఆత్మకాదు.

**అ :** ఘటాదులు భాసించేటప్పుడు నేను అని శుద్ధాత్మ భాసించటం లేదు. అలాంటప్పుడు శుద్ధాత్మనైన నేను అనుకుంటున్నామా ?

**జ :** అప్పుడు శుద్ధ భావం లేకపోతే ఘటాదులు ప్రకాశించవు. దీపం లేకపోతే వస్తువులు కనిపించవుకదా ? అవి కనపడుతున్నాయంటే దీపం ఉన్నదనే అర్థం. అలాగే దృశ్యం భాసిస్తున్నది అంటే, దృక్కు అయిన సంవిత్తు ప్రకాశిస్తున్నది అనే చెప్పాలి.

**అ :** ఒకవేళ అది ప్రకాశించినా, నేను అని ప్రకాశించటం లేదుకదా ?

**జ :** ఒక రూపమనేది లేకుండా ఏదీ ప్రకాశించదు. చితి నేను అనేరూపంలోనే ప్రకాశిస్తుంది. అందుకనే "జ్ఞానము స్వతఃప్రమాణము" అని వాదించేవారు. 'నేను ఘటాన్ని తెలుసుకుంటున్నాను' అనేదే జ్ఞానాకారము అంటారు. ఈ ఘటాదిజ్ఞానాలలో నేను అనే స్ఫురణ ఉన్నందువల్ల, నేనున్నానా ? లేనా ? అనే అనుమానం కలగదు.

**అ :** నేను ఘటాన్ని చూస్తున్నాను అన్నప్పుడు నేనుగా భాసించేది శరీరమే కాని చితి కాదుకదా ?

**జ :** ఘటాన్ని గురించి చెప్పేటప్పుడు నువ్వు చెప్పింది ఒప్పుకున్నా, దేహాది జ్ఞానకాలంలో నేను చూస్తున్నాను అన్నప్పుడు, నేను అంటే దేహంకాదు చితియే. నేను అనే జ్ఞానం లేనప్పుడు పరాచితి ఉండదు. 'అహం' అని ఉన్నా అన్ని జ్ఞానాల్లోనూ పరాచితి ప్రకాశిస్తూనే ఉంటుంది. సర్వస్వాన్ని తెలుసుకునేది ఈ పరాచితియే.

**అ :** సుషుప్తిలోను, సమాధిలోను 'నేను' అనే జ్ఞానం ఉండదు కదా ! అయినా చితి ఉన్నది అంటారుకదా !

వేరైనది కాదు. పరమాత్మ ఒక్కడే జగద్రూపంలో ప్రకాశిస్తున్నాడు. ఈరకంగా పరమాత్మ స్వరూపమే జగత్తు కాబట్టి అద్వైత సిద్ధాంతానికి హానిలేదు.

అద్దంలో కనిపించే ప్రతిబింబం అద్దం కన్న భిన్నంగా కాదు. అలాగే పరచితిలో భాసించే జగత్తు పరిచిదాత్మకమే. అంతకన్న వేరు కాదు అన్నప్పుడు ద్వైత ప్రసక్తి లేదు.

పరమాత్మ మాయ అనే పేరుతో గల తన స్వాతంత్ర్యంతో తనను తాను ప్రపంచంగా భాసింపచేసుకుంటున్నది. ఈ ప్రపంచాన్ని చూసేప్పటికి జీవుడికి ద్వైతదృష్టి కలుగుతుంది. ఈ ద్వైత దర్శనమే బంధము. అద్వైతదృష్టియే మోక్షము. స్వాతంత్ర్యము వికృతిరూపంగా భాసించటము, జీవుడు లాగా భాసించటము, బంధనాలు, మోక్షము ఇవన్నీ అద్దంలోని ప్రతిబింబాలలాటివే. సుషుప్తిలో నిద్రారూప జడశక్తి ప్రతిబింబాలు విమర్శలను ఆవరిస్తాయి. అందువల్ల మూఢత ఏర్పడుతుంది. అందుచేత విమర్శాంశలు పైకి రావు. అందుకనే సుషుప్తిని మూఢస్థితి అంటారు. దీపం కూడా కాంతి పుంజమే అయినా విమర్శాంశల ఆవిర్భావం లేకపోవటం వల్లనే దానిని జడం అంటున్నాము.

**అ :** సుషుప్తిలో విమర్శలను ఆవరించే నిద్రాస్వరూపం ఏమిటి? నిద్ర అంటే ఎవరు?

**జ :** నిద్ర అనేది తొలి చూలు అవ్యక్తము, మహాశూన్యము. అన్నీ ఒకటే. మొట్టమొదటిసారిగా పరాచితితో ఒక స్వరూప సంకోచం అవభాసితమవుతుంది. దానితోనే తప్పనిసరిగా బాహ్యావభాసముంటుంది. ఈ భాహ్యావభాసమే జగత్తు అనే చిత్రానికి గోడలాగా ఆధారంగా ఉంటుంది. ఈ ఆభాసం అన్నింటి కన్న ముందు పుట్టింది. కాబట్టి దీన్ని 'ప్రథమజ' తొలిచూలు అన్నారు. అది ఏ ఆకారంతోనూ కనపడదు. అందుకే 'అవ్యక్తము'. ఆకారం లేకపోవటం వల్లనే దాన్ని 'మహాశూన్యము' అంటారు. దృశ్యాన్నంతటినీ నిషేధించటమే, నిషేధరూప వాక్యజ్ఞానమే నిద్ర.

**అ :** జాగ్రదవస్థలో కుండ మొదలైన వస్తువులను చూసినప్పుడు కూడా మనోమౌఢ్యదశ ఉంటుందంటారు. అది గనక ఉంటే వస్తువును చూసిన వెంటనే 'నాకేమీ కనిపించటంలేదు' అనే జ్ఞానం కలగాలికదా ? అది ఎందుకు కలగటంలేదు ?

**జ :** వస్తువులను చూసినప్పుడు, జాగ్రదావస్థలో మనస్సు ఒక్కక్షణం మాత్రమే మూఢదశలో ఉంటుంది. రెండవక్షణంలో వికల్పాలు, విమర్శలు దాన్ని ఆవరిస్తాయి. అందుచేత జాగ్రదావస్థలోని మూఢతాదశను మనం గుర్తించలేకపోతున్నాము. సుషుప్తిలో అలాకాదు. మనస్సు అవ్యక్తశక్తి ప్రకాశరూపంగా ఉంటుంది. విమర్శలు అప్పుడు భాసించవు. అంటే, ఆస్థితిలో మనసు నిశ్చలంగా ఉంటుంది. అందుకే మనస్సు లీనమైంది

అంటాము. అంతేకాని సుషుప్తిలో అసలు మనసే ఉండదని మాత్రంకాదు. ఆమనస్సేచేతనత్వాభిముఖమైనప్పుడు 'చిత్తం' అని పిలువబడుతుంది.

మునికుమారా ! సమాధి, సుషుప్తులకు భేదం ఉన్నది. నిర్వికల్ప సమాధి, సుషుప్తి, వస్తుదర్శనము ఈ మూడూ ఒకవిధమైనవే. ఈ మూడింటిలోనూ విమర్శరూపమైన వికల్పశక్తి ఉండదు. కాబట్టి విమర్శలు ఉండవు. ప్రకాశం ఒక్కటే ఉంటుంది.

**అ :** సమాధి, సుషుప్తి, వస్తుదర్శనము వీటిమధ్య తేడా ఎలా తెలుస్తుంది ?

**జ :** నిర్వికల్ప జ్ఞానం కలిగిన తరువాత, రెండవక్షణంలో కలిగే విమర్శ స్వరూపాలలోని భేదాన్ననుసరించి వీటిలో భేదముంటుంది. దృశ్య పదార్థాలలో భేదాన్ననుసరించి విమర్శలలో భేదం వస్తుంది. ఈ మూడింటిలోనూ ఉన్న ప్రకాశంలో మాత్రం భేదంలేదు. సమాధిస్థితిలో దేహాదుల ఆకారాలు లేని కేవల చితి భాసిస్తుంది. అందులో భేదముండదు. సుషుప్తిలో అవ్యక్తము భాసిస్తుంది. వస్తుదర్శనములో ఘటపటాది భేదము భాసిస్తుంది.

అయితే సమాధి, సుషుప్తి ఇవి ఎక్కువకాలం ఉంటాయి. అందుచేతనే ఆస్థితుల తరువాత, ఆస్థితిలో కలిగిన అనుభవాలను గుర్తుతెచ్చుకోగలము. వస్తుదర్శనము ఒక్కక్షణం మాత్రమే ఉంటుంది. అందుకని రెండవక్షణంలో దృశ్యం కనిపించదు. అందుకే దాన్ని విమర్శించలేము. క్షణికసమాధి, క్షణిక సుషుప్తి కూడా ఉంటాయి. వాటిని కూడా విమర్శించలేము. కేవలము సూక్ష్మదృష్టి గలవారు మాత్రమే క్షణిక సుషుప్తిని విమర్శించగలుగుతారు.

మానవులందరికీ సూక్ష్మ సుషుప్తి, సమాధి దశలు కలుగుతూనే ఉంటాయి. అయినప్పటికీ, వాటి పరిచయం లేనందువల్ల వాటిని గుర్తించలేకపోతున్నాము. జాగ్రదవస్థలో కూడా విమర్శజ్ఞానం లేని స్థితి సమాధియే. అందువలన సుషుప్తిలోను, వస్తుదర్శనంలోనూ సమాధులుంటాయి. ఈ సమాధులకు ముఖ్యత్వం లేదు. జాగ్రద్దశలో కూడా విమర్శరూపమైన వస్తుదర్శనం కలుగుతుంది.

మునికుమారా ! బాహ్యము అనేపదానికి అర్థమైనటువంటి "చితి" నుండి మొదట పుట్టిన 'అవ్యక్తము' అనేది లేదు అని మాత్రమే భాసిస్తుంది. అది అత్యంతా భావరూపము. ఎప్పుడూ లేనిది. దీనినే సుషుప్తి అంటారు. ఇది చితి యొక్క జడశక్తి. దీన్నే అవ్యక్తము అంటారు. ఇంకా చెప్పాలంటే చితి యొక్క జడశక్తి, అవ్యక్తము, సుషుప్తి ఈ మూడూ ఒకటే.

సుషుప్తి నుంచి మేల్కొన్నవాడు "నాకేమీ తెలియదు" అంటాడు అంటే సుషుప్తి జ్ఞానము అభావరూపమే. అది అవ్యక్తము. సుషుప్తిలో చితి యొక్క జడశక్తి దర్శనం మాత్రమే జరుగుతుంది.

సమాధిస్థితిలో ప్రకాశించే చితి, పరబ్రహ్మ స్వరూపిణి. ఇది అన్ని దేశాలలోను, అన్నికాలాల్లోను ఉంటుంది. దేశకాలమానాలు ఈ చితిని పరిచ్ఛన్నం చెయ్యలేవు. ఆచితియే త్రిపురాసుందరి ఆత్రిపురాదేవి సుషుప్తి కాదు. అందుచేత సుషుప్తిని అనుభవించినంత మాత్రాన కృతార్థతలేదు. అంటూ జనకమహారాజు అష్టావక్రుడికి జ్ఞానబోధ చేశాడు అంటూ రత్నాకరుడు పదహారవ అధ్యాయాన్ని ముగించాడు.

## 29. సమాధిస్థితి

గురుదేవా ! రత్నాకరా ! జనకమహారాజు అష్టావక్రుడికి సుషుప్తిని గురించి వివరించాడు కదా ! అతడు దానితో తృప్తి చెందాడా ? ఆతరువాత ఏంచేశాడో వివరించండి అన్నాడు కృష్ణశర్మ. వివరించటం ప్రారంభించాడు రత్నాకరుడు.

సుషుప్తావస్థను గురించి విన్న అష్టావక్రుడు జనకునితో "రాజా ! వ్యవహారదశలో కూడా సూక్ష్మసమాధులుంటాయి అన్నావు కదా ! అవి ఏదశలో భాసిస్తాయో తెలియచెయ్యవలసినది" మునికుమారా ! కొన్ని సందర్భాలలో మానవుణ్ణి నిద్ర ఆవహించదు. అతనికి బాహ్యప్రపంచం తెలియదు. అంతరమైన సుఖదుఃఖాలు అంతకన్నా తెలియవు. ఆరకంగా ఒక్కక్షణం నిశ్చేష్టుడైపోతాడు. అటువంటి స్థితులన్నీ సూక్ష్మసమాధులే అటువంటిస్థితులను వివరిస్తాను విను.

1. ప్రేయసీప్రియులున్నారు వారికి ఎడబాటు కలిగింది. ఎవరెక్కడున్నారో, ఎలా ఉన్నారో తెలియదు. అటువంటిస్థితిలో, చాలాకాలం తరువాత అనుకోని పరిస్థితులలో, ఊహించని విధంగా ప్రేయసి అతణ్ణి చేరింది. అప్పుడు తన స్థితి ఊహించు. మనసు పనిచెయ్యదు. నోటమాట రాదు. కాళ్ళుచేతులు పనిచెయ్యవు. ఒక్కక్షణం నిశ్చేష్టుడైపోతాడు. ఆక్షణమే సూక్ష్మసమాధి స్థితి.

2. చాలాకాలంగా ఒకడు ఒక వస్తువు కావాలనుకుంటున్నాడు. ఇంక ఆ వస్తువు దొరకదు అని నిశ్చయించుకున్నాడు. ఉన్నట్టుండి అకస్మాత్తుగా ఆ వస్తువు అతనికి లభించింది. ఆక్షణంలో అతని స్థితే సూక్ష్మసమాధి.

3. బాటసారి నిర్భయంగా ప్రయాణం చేస్తున్నాడు ఉన్నట్టుండి అతడికి ఎదురుగా పెద్ద పులి నిలబడింది. ఆక్షణంలో అతని స్థితి సూక్ష్మసమాధి.

4. ఒకడికి ఒకకుమారుడున్నాడు. అతడు మంచి వ్యవహారదక్షుడు, మంచి ఆరోగ్యమంతుడు, ఉత్తముడు. అకస్మాత్తుగా సేవకుడు వచ్చి నీకుమారుడు మరణించాడని చెప్పాడు. ఆక్షణంలో అతని స్థితే సూక్ష్మసమాధి.

మానవుడికి హర్షము, భయము, శోకము, గొప్ప సుఖము అనుకోకుండా ఒకేసారి అకస్మాత్తుగా కలిగినప్పుడు మొట్టమొదటి క్షణంలో అతడు నివ్వెరపోతాడు. అతని మనస్సు నిర్వికల్పంగా స్వరూపస్థితిలో ఉంటుంది. ఇదే క్షణిక సమాధిస్థితి. సమాధి ఇంకొక దశలో కూడా కలుగుతుంది. అది

1. బాహ్యేంద్రియాల వ్యాపారం ఉండే జాగ్రదావస్థలోను.

2. మనస్సు మాత్రమే పనిచేసే స్వప్నావస్థలోను.

3. మనస్సు కూడా నిద్రించే సుషుప్తిలోను

ఈదశలకు మధ్యకాలంలో మనస్సు నిర్వికల్పంగా ఉంటుంది. అటువంటివన్నీ సూక్ష్మసమాధులే.

ఇంకొక దశలో కూడా సూక్ష్మసమాధులు కలుగుతాయి.

1. ఒకవ్యక్తి ఏకాగ్రతతో సూర్యబింబాన్ని చూస్తున్నాడు.

2. జలగ ఒక గడ్డిపోచ మీంచి ఇంకొక గడ్డిపోచ మీదికి ప్రాకేటప్పుడు శరీరాన్ని సాగదీస్తుంది.

సూర్యబింబాన్ని చూసేటప్పుడు నేత్రము దృష్టిని సూర్యమండలం దాకా పొడిగిస్తుంది. మనసు శరీరంలో ఉన్నప్పుడు శరీరాకారంగా ఉంటుంది. సూర్యమండలాన్ని గ్రహించినప్పుడు ఆ ఆకారాన్ని పొందుతుంది. ఈమధ్యకాలంలో మనసు నిరాకారంగా నిశ్చలంగా ఉంటుంది.

**అ:** రాజా ! దేహానికి, సూర్యమండలానికి మధ్య మనస్సు గగనాకారంగా ఉంటుంది కదా !

**జ:** గగనం అంటే ఆకాశం. ఆకాశానికి రూపం లేదు. ఏదైనా ఒకరూపం అంటూ ఉంటే, దాన్ని కళ్ళ ద్వారా మనస్సు గ్రహిస్తుంది. ఒకవేళ రూపంలేకపోయినా. గ్రహించవచ్చు అనుకుంటే, గాలిని కూడా గ్రహించాలి. ఈ మనస్సు అనేది సాకారంగానూ, నిరాకారంగానూ కూడా ఉంటుంది. అందుచేతనే రాజర్షుల మనస్సులో ఒకభాగం లోకవ్యవహారాలలోను, ఒకభాగం సమాధిలోను ఉంటుంది. అటువంటివారు జీవన్ముక్తులు.

లోక వ్యవహారంలో జ్ఞానం ఎప్పుడూ ఒకేరూపంగా ఉండదు. ఘటాది ఆకారంలో ఉండే జ్ఞానాలే ధారారూపంగా ఉంటాయి. అటువంటి ఖండజ్ఞానాల సముదాయమే లోకవ్యవహారం. అసలు జ్ఞానమనేది ఒకటే అయితే లోకవ్యవహారమే కుదరదు. ఈ రకమైన భేదంవల్ల ఖండజ్ఞానాల ధారయే ఆత్మ అని సౌగతులంటారు. అదే ఆత్మ ధర్మమైన బుద్ధి అని కాణాదులంటారు.

మునిబాలకా ! సమాధి స్వరూప పరిచయమున్నవారు ఈ సమాధిస్థితిని ప్రతిక్షణము గుర్తించగలరు. పరిచయంలేనివారు "క్షణికసమాధి అసంభవం" అంటారు.

**అ :** రాజా ! లోకవ్యవహారంలో కూడా నిర్వికల్ప సమాధి అందరికీ కలుగుతూనే ఉన్నది అంటున్నారు. అదే నిజమయితే అందరూ సంసారంలోపడి ఎందుకు కొట్టుకుంటు న్నారు? జననమరణాలతో కూడిన ఈ బంధంలో ఎందుకు కూరుకుపోతున్నారు? నిర్వి కల్పసమాధి రూపమైన జ్ఞానం అజ్ఞానాన్ని నాశనం చేస్తుంది కదా? అలాంటప్పుడు సంసారం ఉండకూడదు కదా ?

**జ :** నాయనా ! అన్ని అనుమానాలూ తీర్చే పరమరహస్యం ఒకటి చెబుతాను విను. ఈ సంసారమనేది అజ్ఞానం వల్లనే అనాదికాలం నుంచి సాగుతోంది. సుఖదుః ఖాలుగా కనిపించే జ్ఞానాల ప్రవాహమే సంసారం. మనం దీన్ని అన్నికాలాలలోను అనుభవిస్తూనే ఉన్నాము. అయితే ఇది కూడా స్వప్నంలాంటిదే. జ్ఞానం వల్ల మాత్రమే ఇది నశిస్తుంది.

"సోஉహం" అతడు నేనే. అనేటటువంటి ప్రత్యభిజ్ఞారూపమైనటువంటి గుర్తింపుతో కూడిన సవికల్ప జ్ఞానమే అజ్ఞానాన్ని రూపుమాపుతుంది. వైరాగ్యము, ముముక్షత్వము మొదలైన జ్ఞానసాధనాలు గల పురుషుడు వేదాంతాన్ని వినటంచేత అతడికి పరోక్షమైన ఆత్మతత్త్వజ్ఞానం కలుగుతుంది. ఆవిషయాలను బాగా మననం చేస్తే సంశయాలు తొలగి పోతాయి. అప్పుడు నిధి ధ్యానం చెయ్యాలి. దీనివల్ల ఇంతవరకు మనకున్నటువంటి 'దేహమే నేను' అనేభావంపోయి శుద్ధ ప్రత్యగాత్మ జ్ఞానం కలుగుతుంది. ఆ తరువాత ఉపనిషత్తులలో చెప్పినట్లుగా 'పరమాత్మ ప్రత్యగాత్మలు ఒక్కటే' అనే అఖండాకార జ్ఞానం కలుగుతుంది. దీన్నే 'సోஉహం' రూపప్రత్యాభిజ్ఞా జ్ఞానము అంటారు. ఇది సంసార బంధనాలకు మూలమైన అజ్ఞానాన్ని నశింపచేస్తుంది.

**అ :** ఈ జ్ఞానంలో కూడా అతడు (సః) నేను (అహమ్) అని రెండు దశాలున్నాయి కాదా ? మరి అలాంటప్పుడు ఇది అద్వైతము ఎలా అవుతుంది ? దీనివల్ల ద్వైతభావం ఏరకంగా నశిస్తుంది.

జ: రాముడు అనేవ్యక్తి సోముడనే వ్యక్తిని కాశీలో కలుసుకున్నాడు. కొంతకాలానికి అతడు విజయవాడ వచ్చాడు. ఇప్పుడు సోముడు ఎవరు ? అంటే కొంతకాలం క్రితం కాశీలో కలిసిన వాడే ఇతడు ఈ సోముడు. ఇక్కడ సోముడు, ఇతడు వీరిద్దరూ వేరువేరు కాదు. ఇద్దరూ ఒక్కటే అలాగే 'సోऽహం' కూడా.

అ: అయితే దీన్ని సవికల్ప జ్ఞానం అని ఎందుకంటున్నారు ?

జ: అతడు, నేను అనే రెండు శబ్దాలకు ఐక్యము లేనందువల్ల భేదమున్నట్లుగా కనిపిస్తోంది. వికల్పము అనేభావంతో ఇవి సమానంగా కనిపిస్తున్నాయి. రెండు శబ్దాలు భాసింపని నిర్వికల్ప జ్ఞానం కన్న ఇది విలక్షణమైనది. అందువల్ల దీనిని సవికల్పము అంటున్నాము. అంతమాత్రంచేత ఇది ద్వైతము కాదు.

అ: నిర్వికల్ప సమాధి రూపమైన జ్ఞానానికి, ప్రత్యభిజ్ఞా జ్ఞానానికి, ఈరెండింటికీ విషయం ఆత్మేకదా ! అలాంటప్పుడు నిర్వికల్ప సమాధి అజ్ఞానాన్ని ఎందుకు నశింపచెయ్యలేదు ?

జ: రెండింటికీ విషయం ఒక్కటే. అయినప్పటికీ అజ్ఞానరూపమైన కారణస్వరూపాల్లో భేదం ఉన్నది. సః, అహమ్ అనే రెండు శబ్దాల అర్థజ్ఞానము కలిగి, ఇతర విషయాల నుండి పరావృతమైన మనస్సు ప్రత్యభిజ్ఞానానికి కారణం. 'ఆ ఘటమే ఇది' అనేటటువంటి జ్ఞానానికి, 'ఘటం' అనే జ్ఞానానికి ఫలంలో తేడా ఉన్నట్లే ప్రత్యభిజ్ఞకు, సమాధికీ తేడా ఉన్నది. ఇక నిర్వికల్పజ్ఞానము అజ్ఞానాన్ని తొలగించలేదు. ఎందుకంటే నిర్వికల్ప జ్ఞానానికి దేనితోనూ విరోధం లేదు. ప్రతిబింబాలకు నిర్వికల్పమే ఆధారము. అద్దానికి, ప్రతిబింబానికి విరోధం లేదు. అద్దం ప్రతిబింబాన్ని నాశనం చెయ్యదు. అసలు 'నిర్వికల్పం' అంటే - ప్రతిబింబంలేని అద్దంలాగా, జ్ఞేయం లేని జ్ఞానం మాత్రమే. తెరమీద ఉన్న చిత్రాలు అద్దంలో ప్రతిబింబాలుగా కనిపిస్తాయి. అలాగే శుద్ధజ్ఞానంలోనే సంకల్పదశలో వికల్ప జ్ఞానాలన్నీ భాసిస్తున్నాయి. అందుచేత వికల్పాలతో కూడిన జ్ఞానమే అజ్ఞానం. అజ్ఞానమనేది రెండురకాలుగా ఉంటుంది. 1. కారణరూపము 2. కార్యరూపము 'నేను పరిపూర్ణుడను' అనే జ్ఞానం లేకపోవటమే కారణరూపమైన అజ్ఞానం.

అ: ఖ్యాతి లేకపోవటమన్నా, జ్ఞానంలేకపోవటమన్నా ఒకటే కాదా ?

జ: దేశకాలాలకు ఆధారం చిదాత్మ. అటువంటి చిదాత్మలో ఈ దేశకాలాలు విభాగాలను సృష్టించలేవు. అటువంటి జ్ఞానం లేకుండా, 'నేను ఇక్కడ ఇప్పుడున్నాను' అనుకున్నప్పుడు, ఆత్మకు సంబంధించినటువంటి పరిపూర్ణజ్ఞానం భాసించటం లేదు.

అసంపూర్ణత్వమే భాసిస్తున్నది. ఇందులో నేను, ఇక్కడ, ఇప్పుడు అంటే నేను అనే ఆకారము, దేశము, కాలము ఈ మూడూ ఆత్మను పరిచ్ఛిన్నం చేస్తున్నాయి. అంటే భాగాలుగా చేస్తున్నాయి. ఈ రకంగా పరిపూర్ణమైన ఆత్మకు అపరిపూర్ణత కలిగించే జ్ఞానాన్నే "మూలజ్ఞానము" అంటారు. ఇదే కారణరూప అజ్ఞానం. దీని మూలంగానే నేను సన్నగా ఉన్నాను, లావుగా ఉన్నాను, నేను గ్రుడ్డివాడిని అనే జ్ఞానం కలుగుతుంది. ఇక్కడ ఆత్మకు దేహానికి, ఆత్మకు నేత్రానికి ఐక్యాన్ని ఆరోపణ చేస్తున్నాము. దీన్నే కార్యరూప అజ్ఞానము అంటారు. అజ్ఞానంవల్లనే సంసార బంధనాలు కలుగుతున్నాయి. పరిపూర్ణమైన ఆత్మ విజ్ఞానం కలగనంతవరకు అజ్ఞానం పోదు.

ఇక పరిపూర్ణ ఆత్మవిజ్ఞానం రెండువిధాలుగా ఉంటుంది. 1. పరోక్షము 2. అపరోక్షము.

గురూపదేశంవల్ల, శాస్త్రాలను చదవటంవల్ల పరోక్షజ్ఞానం కలుగుతుంది. దీనివల్ల మోక్షం సిద్ధించదు. దీర్ఘకాలసమాధి వల్ల పరిపక్వత పొందిన ఆత్మవిజ్ఞానం మాత్రమే చిరకాల వాసనలవల్ల పాతుకుపోయిన అజ్ఞానాన్ని, ద్వైతభావాన్ని సమూలంగా నాశనం చేస్తుంది. ఇదే పరోక్షజ్ఞానము.

**అ :** అలా అయితే పరోక్షజ్ఞానం అవసరం లేదా ?

**జ :** అలాకాదు, సమాధిస్థితికి చేరే ముందు శాస్త్రవిజ్ఞానం, గురూపదేశం ఉండితీరాలి. అంటే పరోక్షజ్ఞానం ఉండాలి. పరోక్షజ్ఞానం లేనివారికి సమాధిస్థితి అపరోక్షజ్ఞానం కలుగదు. ఎలాగంటే, ఒకడికి రత్నము అంటే ఎలా ఉంటుందో తెలియదు. ఊరికే పేరు మాత్రం విన్నాడు. అతడు ఒకనాడు రాజుగారి దగ్గర రత్నాన్ని చూశాడు. కాని అది రత్నము అని అతడికి తెలియలేదు. ఇంకొకడు రత్నాన్ని ఎప్పుడూ చూడలేదు. కాని దాన్ని గురించి పూర్తిగా విన్నాడు, తెలుసుకున్నాడు. ఇప్పుడు రాజుగారి దగ్గర కనపడింది. వెంటనే ఇది రత్నము అని గుర్తుపట్టేశాడు. అంతకు ముందు రత్నాన్ని గురించి తెలుసుకున్నవాడు కూడా దాన్ని పరిశీలించి చూడకపోతే గుర్తించలేడు. అంటే దాన్ని గురించి గతంలో పూర్తిగా తెలుసుకుని ఉండాలి. ఇప్పుడు దృష్టిని కేంద్రీకరించి పరిశీలించాలి. ఈ రెండూ లేని మొదటివాడు రత్నాన్ని చూసినా ఉపయోగంలేదు. వాడు ఎంత తెలివిగలవాడైనా ఫలితముండదు. అలాగే శాస్త్రజ్ఞానంలేని మూఢులు ఆత్మను గుర్తించలేరు. ఏకాగ్రత, పరిశీలన లేకపోతే పండితుల పాండిత్యం కూడా వ్యర్థమే. కాబట్టి "దేహం కన్నవేరైన చిద్రూపమే నేను" అనే శాస్త్రవిజ్ఞానాన్ని సాధించాలి. అప్పుడే అపరోక్ష జ్ఞానం సిద్ధిస్తుంది.

బాగా ప్రకాశిస్తున్న నక్షత్రం ఆకాశంలో కనిపిస్తున్నప్పటికీ, 1. దానిని గురించి వినని, చూడని వాడు. 2. విన్నప్పటికీ దాన్ని గుర్తించాలనే పట్టుదల లేనివాడు. వీరిద్దరూ కూడా దాన్ని గుర్తించలేరు. సూర్యుడు అస్తమించిన తరువాత, శుక్రనక్షత్రం పడమటి దిక్కున తెల్లగా ప్రకాశిస్తుంది అని తెలసినవాడు, నేను ఆ నక్షత్రాన్ని చూసితీరాలి అనే పట్టుదల, దీక్ష ఉంటే దాన్ని చూడగలుగుతాడు.

సమాధి దశలు కలుగుతున్నప్పటికీ, ఏకాగ్రత లేకపోవటంచేతనే మూఢులు ఆపరాచితిని గూర్చి తెలుసుకోలేకపోతున్నారు. రత్నరాశుల మీద మనం నడుస్తున్నాం కాని అవి రత్నాలని గుర్తించలేకపోతున్నాం. అలాగే మనలోనే ఉన్న ఆత్మని మనం గుర్తించలేకపోతున్నాం. అప్పుడే పుట్టిన శిశువుకు లాగానే మనకు కలిగే నిర్వికల్పస్థితులు నిరుపయోగమవుతున్నాయి. అందుచేతనే ఈ సమాధులవల్ల శిశువుకున్న అజ్ఞానంపోవట్లేదు, మనకు కూడా అది ఉపయోగించదు. అందుచేతనే వికల్పరూపమైన ప్రత్యభిజ్ఞా రూపమైన జ్ఞానము, ఈ సంసారబంధనానికి మూలమైన అజ్ఞానాన్ని నాశనం చేస్తుంది.

అష్టావక్రా ! అనేక జన్మలలో పుణ్యం చేస్తేనేగాని మోక్షాపేక్ష కలగదయ్యా ! అసలు పుట్టినవారిలో చేతనత్వం కలగటమే దుర్లభం. అందులోనూ మానవజన్మ మరీ దుర్లభం. అందులోనూ సూక్ష్మబుద్ధి ఉండటమనేది మరీ దుర్లభం. స్థావరజంగమాత్మకమైనది ఈజగత్తు. స్థావరములు అంటే స్థిరంగా ఉండేవి. పర్వతాలు, చెట్లు చేమలు మొదలైన జంగమాలు కదిలేవి, నడిచేవి, పశుపక్ష్యాదులు, స్థావరాలలో జంగమాలు నూరోవంతు కూడాలేవు. జంగామాలలో మానవులు వందోవంతులేరు. ఇక మానవులలో ఎక్కువమంది అజ్ఞానులు, పశుప్రాయులు వీరికి మంచి చెడు, పాపము, పుణ్యము అనే విచక్షణ ఉండదు. వీరిలో చాలామంది ఐహిక సుఖాలకై వెంపర్లాడతారు. మిగిలిన వారిలో ఎక్కువమంది అశాశ్వతమైన స్వర్గసుఖాలకై వెంపర్లాడతారు. వీరంతా ద్వైతమునే నమ్ముతారు. వీరి దృష్టిలో భగవంతుడు వేరు, భక్తుడు వేరు. లోకంలో ఇంకొకరకం వారున్నారయ్యా. వారికి అద్వైతతత్త్వం తెలుసు. కాని వారికి ద్వైతము మీదనే ఆసక్తి. వీరు అద్వైతాన్ని ఆక్షేపిస్తారు కూడా. పరమేశ్వరి యొక్క మాయ చాలా చిత్రమైనది. ఆ మాయకు లొంగిపోయి, చేతికి దొరికిన చింతామణిని గాజురాయి అని పారేసినట్లుగా వీరు అందుబాటులో ఉన్న అద్వైత ఆత్మతత్వాన్ని ఉపేక్షిస్తున్నారు.

పరదేవతను ఆరాధించి, ఆమెను సంతోషపెట్టిన వారు మాయ నుండి విముక్తులవుతారు. వారికి శ్రద్ధ కలుగుతుంది. ఆత్మాద్వైతతత్త్వము అవగతమవుతుంది.

అప్పుడు వారికి పరమశాంతి కలుగుతుంది. ఆస్థితికి చేరిన వారు పురుషార్థమైన మోక్షము పొందుతారు.

మునిపుత్రా ! మోక్షప్రాప్తి ఎలా జరుగుతుందో చెబుతాను విను. అసలు దేవతాభక్తి కలగాలంటే అనేక జన్మలలో పుణ్యం చెయ్యాలి. సత్సాంగత్యం ఉండాలి. దేవతామహాత్మ్యం వినాలి. ఆరకంగా భక్తితో దేవతారాధన చేస్తే ఆమె అనుగ్రహం కలుగుతుంది. దానివల్ల నిత్యానిత్య వివేకం కలుగుతుంది. దానివల్ల విషయవాంఛలు నశిస్తాయి. వైరాగ్యం కలుగుతుంది. ఆ తరువాత శ్రేయోమార్గ మందు ఆసక్తి కలుగుతుంది. గురువు దగ్గర ఉపదేశం పొందటం వల్ల అద్వైతజ్ఞానం కలుగుతుంది. శాస్త్రజ్ఞానమే పరోక్షమైన అద్వైతజ్ఞానం. ఆ తరువాత ఈ అద్వైతజ్ఞానము సరియైనదా కాదా అని విచారించి, అది సత్యమే అని గ్రహించి ఒక నిశ్చయానికి వస్తాడు. దాన్నే నిశ్చయజ్ఞానం అంటారు. ఈ నిశ్చయజ్ఞానం వల్ల అనుమానాలన్నీ తీరిపోతాయి. అప్పుడు మనస్సును పరమాత్మరూపంగా భావించి ధ్యానం చెయ్యాలి.

"నా చిత్తాన్ని ఈ రూపంలోనే ఉంచుతాను" అని పట్టుదల ఉండాలి. మధ్యమధ్యలో ఆ చిత్తం క్షోభిస్తుంది. అయినప్పటికి తిరిగి మనస్సును దానియందే లగ్నం చెయ్యాలి. ఆరూపాన్ని వదలకూడదు. "తన చేతులతో మనస్సు యొక్క చేతులను నలిపివేసి, తన దంతాలతో దాని దంతాలను పిండిచేసి, తన అవయవాలతో దాని అవయవాలను ఆక్రమించి మనసును జయించాలి" ప్రాణాయామ ప్రత్యాహారాది సాధనాలతో మనస్సును వశం చేసుకుని, పరదేవతారూపంగా నిశ్చలంగా ఉండేటట్లు చెయ్యాలి. ఈ ప్రయత్నం ఎంతవరకు అంటే అపరోక్షజ్ఞానం కలిగేంతవరకు చెయ్యాలి. అప్పుడు "సోఽహం" ఆ పరదేవతయే నేను. అనేటటువంటి వికల్పజ్ఞానం కలుగుతుంది. అదే సంసారానికి మూలమైన అజ్ఞానాన్ని తొలగిస్తుంది.

**అ :** రాజా ! సమాధి అంటే వికల్పరహితమైన ప్రకాశము. సవికల్పమైన దానిని స్మరింపగలము కాని నిర్వికల్పాన్ని ఏవిధంగా స్మరింపగలుగుతాము ? కేవలము వస్తువులకు సంబంధించిన ప్రకాశమే నిర్వికల్పం. దానివల్ల మనస్సులో ఏరకమైన స్మృతి (గుర్తు) రాదు. మనం వెడుతూ ఉన్నప్పుడు అనేకరకాల వస్తువులు కనిపిస్తాయి. వాటన్నింటిని మనం పట్టించుకోం. అవన్నీ నిర్వికల్పాలే. కావాలన్నా అవి మళ్ళీ గుర్తుకురావు. అందుచేత నిర్వికల్ప జ్ఞానం కలిగినప్పుడు ఏ అంశం ఎంతవరకు చూశామో అనుకుంటాము కాని అది ఏదో పూర్తిగా తెలియదు. అలాంటప్పుడు, సమాధిలో కలిగిన నిర్వికల్పానుభవస్మృతి కలగటం అసంభవం కదా ?

**జ:** సవికల్పం ద్వారానే స్మృతి కలుగుతుంది. అయితే కొంతమంది మహానుభావుల అనుభవం ప్రకారం శుద్ధ పరమాత్మ సవికల్పానికి విషయం కానందువల్ల, నిర్వికల్పానుభవ స్మరణమే కలుగుతుంది. అంతేకాని సవికల్పమే స్మృతి కలిగిస్తుందనే నియమం ఏమీలేదు. వికల్పమంటే భేదభావమే. దారినపోయేవాడు ఎవరినో, దేన్నో చూశాను అనుకుంటాడు. కాబట్టి ఏ స్థితిలో ఏవస్తువు యొక్క రూపం ఎంతవరకు కనిపించిందో, అంతవరకే గుర్తుంటుంది. అందువల్ల "సర్వోవికల్పఃస్మృతి" - అన్ని వికల్పాలు స్మృతియే అయితే మన కోరికకు తగినదే మనకు గుర్తువస్తుంది. మునిబాలకా! తియ్యనిపండు మనకు ఇష్టమైందనుకో ఆ పండులోని తియ్యదనమే మనకు గుర్తుకు వస్తుంది. అలాగే నిర్వికల్ప సమాధియందలి శుద్ధ స్వరూపప్రకాశమే స్మృతి రూపంలో భాసిస్తుంది.

అద్వైతమైన ఆ పరమాత్మ స్వరూపాన్నే నేను అనేటటువంటి జ్ఞానం వల్ల సంసార బంధనానికి కారణమైన అజ్ఞానం నశిస్తుంది. ఘటజ్ఞానము, పటజ్ఞానము అని అనేక రకాలుగా కనిపించే అజ్ఞానమే వికల్పము. అది ఒకటిగా ఉంటే నిర్వికల్పము అని చెప్పబడుతుంది.

మనోవ్యాపారాలు వదిలిన వెంటనే వికల్పం పోతుంది. ఎప్పుడైతే వికల్పం పోయిందో, నిర్వికల్పం దానంతట అదే వస్తుంది. బొమ్మలను తుడిచేస్తే గోడ శుభ్రంగా ఉన్నట్లుగానే, వికల్పాలుపోతే మనస్సు నిశ్చలమవుతుంది. అద్దానికి ఎదురుగా ఏ వస్తువులూ లేకుండా చేస్తే అద్దం స్వచ్ఛంగా ఉంటుంది. అలాగే వికల్పాలను వదిలేస్తే చాలు. ఇంకేం చెయ్యనక్కరలేదు. నిర్వికల్ప స్థితి లభిస్తుంది. దీన్ని మించిందిలేదు. పండితులు కూడా మాయలోపడి దీన్ని గురించి తెలుసుకోలేకపోతున్నారు. కేవలం సూక్ష్మబుద్ధి గలవారు మాత్రమే దీన్ని గుర్తిస్తారు.

ఈ జ్ఞానానికి యోగ్యులు మూడు రకాలుగా ఉన్నారు. 1. ఉత్తములు 2. మధ్యములు 3. అధములు. ఒకసారి చెప్పగానే విషయాన్ని అర్థం చేసుకునేవారు ఉత్తములు. వీరు జ్ఞానం పొందటానికి పెద్దగా కష్టపడనవసరం లేదు.

మునిబాలకా ! ఎవరిదాకానో ఎందుకు ? నా విషయమే చెబుతా విను. ఒకసారి నిండువేసవిలో, పండు వెన్నెలలో ఇంటి ముందరిభాగంలో ప్రియురాలితో సుఖంగా ఉన్నాను. అప్పుడు ఆకాశంలో వెళ్ళే సిద్ధులు కొందరు అద్వైతతత్త్వాన్ని గురించి మాట్లాడుకుంటున్నారు. అది విన్నాను, నాకు వెంటనే ఆతత్త్వం అర్థమైంది. ఆలోచించాను. అతి తక్కువకాలంలోనే దాన్ని గురించి తెలుసుకున్నాను నేను కూడా సమాధిస్థితి పొందాను. కొంతసేపటికి లేచాను. ఆ స్థితి చాలా బాగుంది, మహదానందంగా ఉంది, అదే

బ్రహ్మానందస్థితి, మళ్ళీ ఆస్థితిలోకి వెళ్లాలి అనుకున్నాను. ఇంతకాలం వ్యర్థంగా గడిపాను. సాక్షాత్తూ చింతామణిని దగ్గర ఉంచుకుని భిక్షాటన చేశాను. ఈ ఆనందం తెలుసుకోలేక ఐహిక సుఖాలకోసం ప్రాకులాడాను. లోకంలో అందరూ ఇలాగే అవుతున్నారు. బాహ్యసుఖాలు శాశ్వతం కాదు. ఇంక ఇవిచాలు. ఈ సుగంధద్రవ్యాలు, పళ్ళు, పూలు, తినుబండారాలు, సుందరాంగులు ఏవీ అవసరం లేదు. ఇవన్నీ నశించిపోయేవే ఇంతకాలం అజ్ఞానంతో గడిపినందుకు సిగ్గుపడుతున్నాను.

ఈ విధంగా ఆలోచించి మళ్ళీ అంతర్ముఖుడవుదామనుకున్నాను. ఇంతలో ఒక ఆలోచన వచ్చింది. సమాధిలో నేననుభవించన సుఖము సర్వదా ప్రకాశమేకదా ! మరి ఇప్పుడు దాన్ని క్రొత్తగా సాధించటం ఏమిటి ? ఇంతవరకూ లేనిది, ఏదైనా ఇప్పుడు దొరకుతోందా ? గతంలో లేకుండా, ఇప్పుడు దొరికే సుఖం శాశ్వతం ఎలా అవుతుంది? పుట్టిన ప్రతిదీ గిట్టి తీరుతుంది. అలాంటప్పుడు ఆ సుఖం అనిత్యమే అవుతుంది. కాబట్టి ఆస్థితి క్రొత్తగా రాలేదు. అది ఎప్పుడూ ఉన్నది. అదే నిత్యము, సత్యము అయినది శాశ్వతమైనది. ఆస్థితిని నేను ఇప్పటికి చేరగలిగాను. నేను ఇక ఎప్పుడూ దేహాది అహంభావం లేకుండానే ఉంటాను. నేనే మహదానందము. ఇది ఉత్తమాధికారిగా ఉన్న నా స్థితి.

మధ్యమాధికారులకు క్రమంగా శాస్త్రాలు చదవటం వల్ల, ప్రవచనాలు వినటంవల్ల ధ్యానస్థితి కలిగి, తరువాత జ్ఞానోదయమవుతుంది. ఇక అధములకు ఎన్నో జన్మలు గడిస్తేనే గాని జ్ఞానంరాదు.

కుమారా ! జాగ్రదావస్థలో కలిగే సమాధులవల్ల ప్రయోజనం లేదయ్యా. దారిన పోతున్నప్పుడు కలిగే నిర్వికల్పం కూడా 'సోఽహం' అని సవికల్పంకానంత వరకు నిష్ప్రయోజనమే. దానివల్ల అజ్ఞానం నశించదు.

నిర్వికల్పం అంటే కేవలం జ్ఞానం మాత్రమే. అది ఎప్పుడూ, సవికల్పకాలంలో కూడా భాసిస్తూనే ఉంటుంది. అయినప్పటికీ వికల్పాలతో కప్పబడి ఉంటుంది. కాబట్టి భాసించనట్లుగా ఉంటుంది. అద్దం ఎదురుగా వస్తువులున్నాయి. అప్పుడు అద్దంలో వస్తువుల ప్రతిబింబాలే కనిపిస్తాయి. అంతేకాని అద్దం కనపడదు ఎదురుగా ఉన్న వస్తువులను తీసేస్తే అద్దం కనిపిస్తుంది. అలాగే వికల్పాలు గనకపోతే, పూర్వమే ఉన్నది, మనం లేదు అనుకుంటున్నది అయిన పరమాత్మ స్వరూపం సంభాషిస్తుంది. అప్పుడు జ్ఞానము, జ్ఞేయము ఒకటే అని తెలుస్తుంది.

అష్టావక్రా ! నీకు ఇంతవరకూ ఆత్మవిజ్ఞాన క్రమాన్ని చెప్పానయ్యా. నువ్వు విన్న దాన్నంతటినీ మళ్ళీ ఒకసారి విచారించు. ధ్యానం చెయ్యి "సోఽహం" అతడే నేను, ఆ పరమాత్మయే నేను. జీవాత్మ పరమాత్మా ఒక్కటే అని తెలుసుకుని నీ జన్మను తరింపచేసుకో అన్నాడు జనకమహారాజు. అష్టావక్రుడు ఆశ్రమానికి వెళ్ళి ఆ తత్త్వాన్ని శోధించి, సాధించి జీవన్ముక్తుడైనాడు అంటూ పదిహేడవ అధ్యాయాన్ని పూర్తిచేశాడు రత్నాకరుడు.

## 30. దృక్కు - దృశ్యము

గురువుగారూ ! "అష్టావక్రుడికి సుషుప్తి, సమాధి స్థితులగురించి వివరించి ఆత్మవిజ్ఞానాన్ని బోధించాడు జనక మహారాజు" అని దత్తాత్రేయుడు తన శిష్యుడైన పరశురాముడికి వివరించాడు. అప్పటికైనా అతని అనుమానాలు తీరినాయా ? ఆ తరువాత ఏం జరిగింది ? అంటూ ప్రశ్నించాడు నారాయణభట్టు. సమాధానం చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

జనక - అష్టావక్రుల సంవాదాన్ని వివరించిన తరువాత, దత్తాత్రేయుడు అంటున్నాడు "పరశురామా ! ఆ రకంగా ఆత్మస్వరూపిణి అయిన ఆ పరాచితిని గురించి తెలుసుకోవటం ఎలాగో వివరించాను. సాధకుని యొక్క దృష్టి అంతర్ముఖమైనప్పుడే ఆ పరాచితి తెలుస్తుంది. ఇతర సాధనాలద్వారా తెలియదు.

జ్ఞేయమైన వాటిని మనస్సుద్వారానే తెలుసుకుంటాము. అందుచేత మనసు వేద్యము కాదు. జ్ఞానానికి, వేద్యానికి మధ్య అంటే తెలుసుకున్న దానికి, తెలియవలసిన దానికి మధ్య వేద్యము కానటువంటి మనస్సు కూడా ఉన్నది. దానిని గూర్చి తెలుసుకోవటానికి వేరే సాధనం అంటూ ఏదీ లేదు. ఒక విషయాన్ని తెలుసుకోవటానికి ఇంకొకటి సాధనము అని ఈ రకంగా అంగీకరిస్తూపోతే, దానికి అంతముండదు. అందుచేత మనస్సు స్వయంప్రకాశం అని చెప్పాలి. అటువంటి ఇతరాన్ని అపేక్షించనటువంటి, వేద్య రహితమైనటువంటి స్వయంప్రకాశమైన మనస్సునే 'విత్తి' అంటారు. విత్తి అంటే - జ్ఞానము అని అర్థం.

ఇదే ఆత్మతత్త్వం. ఇది జ్ఞాన స్వరూపం. వేద్యం కాదు. అది జ్ఞానమే అయినందువల్ల ఎప్పుడు తెలిసినదే అవుతుంది. దానికన్న వేరైన, ఇతరమైనటువంటి జ్ఞాతలేదు. చిదాత్మనిత్యమూ ప్రకాశిస్తూనే ఉంటుంది. ఒక వస్తువును అంటే కుండనో, చెట్టునో చూస్తున్నప్పుడు 'నేను లేను' అని అనుకోము. అంటే - 'నేను' అనేది ఎప్పుడూ ఉంటుంది. 'నేను' లేకపోతే నా ఆత్మ స్వరూపాన్ని వివరించండి అని ఎలా అడుగుతారు ? కాబట్టి

ఆత్మ అనేది శూన్యం కాదు. ఆత్మశూన్యమనుకుంటే దాన్ని గురించి తెలుసుకోవటమెలా వీలవుతుంది?

**పరశురాముడు :** నేను అంటే సామాన్యరూపమే తెలుసు. అంతేగాని విశేషరూపం తెలియదు. అందుకే నా స్వరూపం వివరించండి అన్నాను.

**దత్తాత్రేయుడు :** నీకు తెలిసినటువంటి అతి సామాన్య రూపమే. నాశనంలేని నిజమైన రూపం. దానికి ఏ విధమైన విశేషమూ లేదు. ఇక్కడ చాలా కుండలున్నాయనుకో. అప్పుడు వాటిలో చిన్నవి, పెద్దవి, ఎర్రవి, నల్లవి ఇలా అనేక రకాలుంటాయి. అయితే ఇక్కడున్నది నీ స్వరూపం ఒక్కటే. అందుకే దానిలో విశేషాలుండవు. ఒకవేళ విశేష రూపంగా కనిపిస్తే, అది నీ స్వరూపం కాదు. అది ద్రష్ట కాదు. దృశ్యము అంతకన్నా కాదు.

**ప :** కుండ, వస్త్రము మొదలైన వాటికి భాసకమైన సామాన్య జ్ఞానము, నా స్వరూపమే కదా !

**ద :** అలా ఎన్నటికీ కాదు. ఘటపటాదులను ప్రకాశింపచేసే జ్ఞానము, ఘటపటాది రూపంలోనే ఉంటుంది. అందుకని భాసకంగా ఉండే జ్ఞానంకూడా సామాన్యం కాదు. అది నీ రూపం కాదు. అయితే కేవలం సామాన్యజ్ఞానమే నీ స్వరూపం. అటు నువ్వు ఇతరమైన ఆపేక్ష ఏదీ లేకుండా ప్రకాశిస్తున్నావు. సామాన్యము, విశేషము అనేవి ఒకటి లేకుండా ఇంకొకటి ఉండవు. ఆ రెండూ అవినాభావంగా ఉంటాయి. అయితే ఆత్మ అనేది సామాన్య, విశేషాలకు రెండింటికీ అతీతమైనది.

**ప :** గురుదేవా ! నేను చిద్రూపుడను అనే భావన నాకు కలగటం లేదు. 'ఈ దేహాన్నే నేను' అనే భావమే కలుగుతోంది. ఎందుకని ?

**ద :** దేహము మొదలైనవాటిని సంకల్పించేటప్పుడు నీకు, 'నేను దేహము' అనే భావన కలుగుతోందే తప్ప దేహం ఆత్మగా అనిపించదు. శరీరాన్ని కాకుండా ఇతరమైన వస్తువులను చూసేటప్పుడు, లేదా సంకల్పించేటప్పుడు ఘటము నేనే, పటము నేనే అనుకోవు కదా ! పోనీ ఈ దేహము చిదాత్మకము. నాకు సంబంధించినది. కాబట్టి నేనే ఈ దేహము అనుకుంటావా ? అలా అయితే కనిపించే వస్తువులు కూడా ఆత్మకు సంబంధించినవే అందుచేత అవి కూడా నీ దేహమే అనాలి కదా ? అందువల్ల దృశ్యము లేనటువంటి దృక్కు మాత్రమే నువ్వు. ఈ దృక్కు అనేది ఎప్పుడూ దృశ్యము కాదు. దృక్కు ఎల్లప్పుడూ స్వప్రకాశము.

నువ్వు దృక్స్వరూపుడివి. ఆ దృక్కే దేశకాలాలను బట్టి విచిత్ర రూపాలతో ప్రకాశిస్తూ ప్రతిబింబాలతో నిండిన అద్దంలాగా ఉన్నది. ఎదురుగా ఉన్న బింబాలను గనక తొలగిస్తే, అద్దం స్వచ్ఛంగా శుద్ధరూపంతో ప్రకాశిస్తుంది. ఆ శుద్ధ చితి ఉన్నదే, అదే నీ రూపం.

ఒక్కసారి గనక ఆ పరాచితి దర్శనమయినట్లైతే, ఆ చితిలోనే ఉన్నదేహాదులు ఇంక స్ఫురించవు. లావు, సన్నము మొదలైన నీ ఆకారము, నీ కులము, గోత్రము ఇవేవీ గుర్తుకు రావు. భ్రాంతులన్నీ నశించిపోతాయి. అజ్ఞానము కూడా నశిస్తుంది. అప్పుడు కలిగేది క్షణిక సమాధి కాదు. అది ప్రత్యభిజ్ఞారూపమైన సవికల్ప సమాధి. పరశురామా! మోక్షమనేది ఎక్కడో లేదు. సంకల్పాలను వదలివేసిన మరుక్షణం, స్వస్వరూపం భాసించు మోక్షము. ఇక్కడ గుర్తుంచుకోవలసినది ఒకటే. తన స్వరూపం ఎప్పుడూ ఉండేదే. క్రొత్తగా పొందేది ఏదీ లేదు.

**ప :** అలా అయితే శ్రవణము, మననము ఇవన్నీ దేనికి ?

**ద :** మోక్షమనేది క్రొత్తగా మనం పొందుతాము అనుకోవటం కేవలం అజ్ఞానం. శ్రవణము వలన, మననము వలన ఈ రకమైన అజ్ఞానం తొలగిపోతోంది. అంతవరకే వాటి పని. మోక్షమనేది స్వర్గాదులవంటిది కాదు. స్వర్గము మొదలైనవి యజ్ఞయాగాదుల వల్ల ప్రాప్తిస్తాయి. పుణ్యఫలం పూర్తికాగానే యజ్ఞయాగాదులు కూడా నశించిపోతాయి. కాని మోక్షం అలాంటిది కాదు. అది నిత్యము సత్యమైనది. కాని ఆత్మస్వరూపమైనది. ఆత్మ స్వరూపం అపరిఛిన్నము. పరిపూర్ణమైన ఆత్మ స్వరూపమే మోక్షము. ఆత్మస్వరూపంలోనే మోక్షమున్నది అనుకుంటే అది దర్పణంలోని ప్రతిబింబం వంటిదే అవుతుంది. అనగా – ప్రతిబింబం దర్పణంకన్న వేరైనది కానట్లే, మోక్షం కూడా ఆత్మకన్న వేరైనది కాదు.

"చెరసాల నుంచి విముక్తుడైనాడు" అన్నప్పుడు చెరసాల అనే బంధం నశించింది అని అర్థం. అంతేకాని అంతకన్న ఇతరమైన విముక్తి అంటూ ఏదీ లేదు. అలాగే మోక్షము అంటే, బంధాలు నశించటమే. అజ్ఞానం తొలగిపోవటమే.

**ప :** స్వప్నంలో సత్యంగా భాసించే స్వప్నజగత్తు, జాగ్రదావస్థలో అసత్యంగా భాసిస్తుంది. అంటే, స్వప్న జగత్తే ఒకసారి సత్యము, ఇంకొకసారి అసత్యము అనిపిస్తుంది. అలాగే, ఆత్మకూడా సత్యము, అసత్యము రెండూ కావచ్చు కదా ! ఆత్మ, మోక్షము ఈ రెండూ కూడా అదే విధంగా ఉభయాత్మకాలు ఎందుకు కాకూడదు ?

**ద :** నాయనా ! ముందుగా 'బాధ' అనే శబ్దానికి అర్థం తెలుసుకోవాలి. బాధ అంటే – అభావ జ్ఞానం. అంటే ఒక వస్తువు 'లేదు' అనే రూపంలో ఉండేటటువంటి జ్ఞానం. ఒక వస్తువు 'లేదు' అనే సమయంలో ఉండేటటువంటి 'లేదు' అనే జ్ఞానాన్నే 'బాధ' అంటారు. అది ఘటము, పటములాంటి వస్తుజ్ఞానాన్ని నాశనం చేస్తుంది. ఇక్కడ ఉండటం,లేకపోవటం అని రెండు దశలున్నాయి. అవి వేరువేరు కాలాల్లో, వేరువేరు దేశాల్లో సంభవించవచ్చు. కాబట్టి ఘట, పటాది వస్తు విషయంలో అది జరగవచ్చు. ఇటువంటి బాధ కలగటానికి అవకాశమున్న ఘటపటాది దృశ్య ప్రపంచాన్ని 'అసత్యము' అంటారు. అయితే ఆత్మ 'నేను' అనేది ఒకే కాలంలో ఏ దేశంలోనూ కూడా 'లేను' అనిభాసించదు. అందువల్ల దానికి బాధ లేదు. కాబట్టి అది అసత్యం కాదు.

ఆత్మ లేదా దృక్కు – దీనికన్న వేరైన జగత్తు 'సోऽహం' సమాధిస్థితిలో భాసించదు. అప్పుడు జగత్తు లేదనిపిస్తుంది. అందుకని దృశ్యమైనది అంతా బాధితమే. అసత్యమే అవుతుంది. ఈ విధంగా భావము, అభావముగా రెండు రకాలుగా ఉండేవన్నీ బాధితులే. ఇవన్నీ అసత్యాలే. దేనికైతే అభావన ఉండదో అది సత్యమైనది. అదే సర్వాత్మ పరాచితి.

**ప :** గురుదేవా ! చిన్నసందేహం, ఘటాదులు భాసించేటప్పుడు ఆత్మభాసించదు కదా ?

**ద :** ప్రతిబింబాలు భాసిస్తున్నప్పుడు, అద్దంకూడా భాసిస్తూనే ఉంటుంది. అసలు అద్దం అంటూ లేకపోతే ప్రతిబింబాలే ఉండవు కదా ! అలాగే కుండ మొదలైన వస్తువులు భాసించే సమయంలో కూడా ఆత్మభాసిస్తూనే ఉంటుంది. ఆత్మకన్న భిన్నమైనది ఏదీలేదు.

పూర్ణస్వరూపము యొక్క నిరంతర స్మరణే మోక్షము. దృశ్యభావాలు ఎప్పుడైతే తొలగించబడతాయో, అప్పుడే చితిపూర్ణ స్వరూపంతో ప్రకాశిస్తుంది. ప్రతిబింబాలు గనక ఉన్నట్లైతే అద్దం యొక్క రూపం పూర్తిగా కనపడదు. దృశ్యము లేకపోతే, అవిద్య ఆవరించకపోతే, చితిని పరిచ్ఛేదం చేసేవి ఏవీ లేవు కాబట్టి అది పూర్ణంగా ప్రకాశిస్తుంది.

**ప :** కాలాదులు చితిచేత ప్రకాశ జ్ఞానరూపాలవుతాయా ?

**ద :** చితిచేత అవి ప్రకాశింపబడవు. చితి అంటే జ్ఞానానికి విషయం కానిది ఏదీ ఉండదు. చితితో వ్యాప్తమైన కాలాదులు చితికి పరిచ్ఛే దాన్ని కలిగించలేవు. సూర్యకాంతితో ప్రకాశించే వస్తువులు సూర్యునికి పరిచ్ఛేదాన్ని కలిగించలేవు.

వ్యాప్తము అంటే – అల్ప దేశంలో ఉండేది.

వ్యాపకము అంటే – అధిక దేశంలో ఉండేది.

ఇక్కడ దృశ్యము వ్యాప్తము, చితివ్యాపకము చితికి బయట, అవల ఉన్న వస్తువు, చితికి పరిచ్ఛేదాన్ని కలిగించవచ్చు. అయితే చితికి వెలుపల, చితిని ప్రకాశింపచేసేది ఏదీ లేదు. చితికి వెలుపల ఉన్న వస్తువు కూడా చితి సంబంధం లేకుండా ప్రకాశించదు.

**ప:** చితి దేశకాలాలను సంపూర్ణంగా వ్యాపించదు. వాటిలో కొంత భాగాన్ని మాత్రమే వ్యాపిస్తుంది. అలాంటప్పుడు చితివ్యాప్తము కాని అంశాలు చితికి పరిచ్ఛేదాలు కావచ్చు కదా ?

**ద :** చితి వ్యాపించని అంశాలు ప్రకాశించవు. కాబట్టి అవి లేనట్లే. లేనివి ఏ రకంగా పరిచ్ఛేదాన్ని చేస్తాయి ? కాబట్టి బహి : పదార్థముకూడా చితిలో మునిగి ఉన్నదే. తనలో ఉన్న వస్తువులు తనకు పరిచ్ఛేదకాలు కావు. చైతన్యంకూడా చితిలోనిదే.

చితిలో ఉండే ప్రపంచం, చితికన్న భిన్నం కాదు. ఘటపటాదులన్నీ ఆకాశంలో ఉన్నట్లుగా, ప్రపంచమంతా చితిరూపంలోనే ఉండి, భిన్నంగా ఉన్నట్లు కనిపిస్తుంది. చితికన్న బాహ్యపదార్థం ఉన్నదనుకోవటం భ్రమ అంతే.

**ప :** గురుదేవా ! నాకు కొన్ని సందేహాలున్నాయి. శుద్ధచితి ఒక్కటే విచిత్రమైన రూపాలతో ప్రకాశిస్తూ ఉంటుంది. అన్నారు. కాని చితిప్రకాశము. చైతన్యము - ప్రకాశించబడేది. ఈ రెండూ వేరువేరు అని జనులనుకుంటున్నారు. చితి స్వప్రకాశము. చైతన్యము దృశ్యప్రపంచము. కాబట్టి చితిచైతన్యాన్ని ప్రకాశింపచేస్తుంది. అంటున్నారు. ఈ రెండూ ఒకటే అంటున్నారు. (చితి జగత్తు ఒక్కటే) కాంతిచేత ప్రకాశింప చెయ్యబడే వస్తువు కాంతికన్న వేరైనట్లే, చితిచేత ప్రకాశింపచేయబడే వస్తువు చితికన్న వేరు కావాలి కదా ? మరి చిదాత్మకమెలా అవుతుంది ?

2. సంకల్పాలను వదలివేస్తే చాలు నిర్వికల్ప సమాధి సిద్ధిస్తుంది. అదే సంసార బంధనాలను తెంచివేసే నిర్వికల్ప జ్ఞానమని, అదే ఆత్మస్వరూపమని జనక మహారాజు చెప్పాడు. ఇందులో కూడా నాకు సందేహమున్నది. మనస్సు ఆత్మకు జ్ఞాన సాధనం. మనస్సు లేకపోతే ఆత్మకు జ్ఞానం కలగదు. అప్పుడు ఆత్మజడం అవుతుంది కదా ? మనస్సు వల్లనే ఆత్మకు బంధమోక్షాలు కలుగుతున్నాయి. సవికల్పమైన మనస్సు బంధము. అదే నిర్వికల్పమైతే మోక్షము. అలాంటప్పుడు మనస్సే ఆత్మ ఎలా అవుతుంది ?

3. భ్రాంతికి విషయమైన ప్రపంచం అసత్యమే అయినప్పటికీ, భ్రాంతి అనేది ఒకటి ఉంది కదా ? మరి ఆ భ్రాంతి అసత్యం కాదు కదా ? ఇక్కడ ఆత్మ, భ్రాంతి అనేవి రెండూ ఉన్నప్పుడు అద్వైతం ఎలా సిద్ధిస్తుంది ?

4. త్రాడులోని పాములాంటి అసత్య పదార్థాలు ఎందుకూ పనికి రావు. ఎండమావుల వల్ల దప్పిక తీరదు. పైగా అవి స్థిరంగా ఉండవు. ప్రపంచంలోని అన్ని పదార్థాలు స్థిరంగానే ఉంటాయి. వాటివల్ల కొంత ప్రయోజనం కలుగుతుంది కదా ! కనిపించేదంతా భ్రమ అంటున్నారు. అసలు భ్రాంతికూడా అందరికీ ఒకే రూపంలో ఎందుకు కలుగుతుంది? త్రాడును చూసి అది పామే అని ఎందుకు అనుకోవాలి ? నీటిధార లేదా కర్ర అనుకోవచ్చు కదా ? దూరంగా ఒక మొద్దును చూసినప్పుడు అది మనిషి, చెట్టు, దెయ్యము ఇలా రకరకాలుగా అనుకోవచ్చు కదా ?

మహానుభావా ! దయచేసి నా యీ అనుమానాలను తీర్చండి.

**ద :** పరశురామా ! చాలామంచి ప్రశ్నలు వేశావయ్యా. వీటన్నింటికీ సమాధానాలు చెబుతాను విను.

1. చితి, త్రిపుర ఒక్కటే. అయినప్పటికీ విచిత్ర రూపాలతో ప్రకాశిస్తున్నది. అద్దం ఒకటే అయినా అందులో అనేక ప్రతిబింబాలు కనిపిస్తున్నట్లే ఇది కూడా జరుగుతోంది. మనస్సు స్వప్నంలో దృశ్యము, ద్రష్టలుగా కనిపిస్తోంది. సుషుప్తిలో నిర్వికారంగా ఉంటుంది. అలాగే చితికూడా చిత్రవిచిత్ర ప్రపంచంగా భాసిస్తుంది.

2. రెండుగా ఉన్నట్లు కనిపించి నంతమాత్రాన ద్వైతమున్నదని కాదు. స్వప్నంలో చితి, చైతన్యము రెండూ కనిపిస్తున్నాయి. అయినా అది సత్యం కాదు కదా ? స్వప్నంలో కనిపించే ద్వైతం సత్యం కాదు కదా ?

3. లోకంలో ప్రకాశము – నేత్రము, ప్రకాశ్యము – పటము ఈ రెండూ ఉన్నప్పుడే ఘటంకాని, పటంకాని ప్రకాశిస్తుంది. కాబట్టి ప్రకాశముకన్న ప్రకాశ్యము వేరుగా ఉండాలి. అంటే కన్నువేరు, ఘటము లేదా పటము వేరన్నమాట. ఇలా ఉన్నాయి అంటే ద్వైతాన్ని అంగీకరించినట్లే అనటం సరికాదు. లోకంలో కన్ను లేకపోయినా వస్తువు తెలుస్తుంది. ఉదాహరణకు గ్రుడ్డివాడు వస్తువును చేతితో తడిమి తెలుసుకుంటాడు. కాబట్టి లోకంలో ప్రకాశము, ప్రకాశ్యము రెండూ ఉండి తీరాలి అనే మాట సరికాదు.

చితివిషయంలో ఈ దోషం ఉండదు. అద్దంలేకపోతే ప్రతిబింబాలు లేనట్లే, చితిప్రకాశం లేకపోతే దృశ్యం ఉండదు. గ్రుడ్డివాడు కళ్ళు లేకపోయినా, మనసుతో కుండను గుర్తిస్తాడు. ఇక్కడ ఆ మనసుకూడా చితిచేతనే ప్రకాశింపబడుతోంది. కాబట్టి ప్రకాశము, ప్రకాశ్యము వేరువేరు కాదు. అందుచేత ద్వైత ప్రసక్తి లేదు.

4. మనస్సే స్వప్నంలో ద్రష్ట, దృశ్యము, దర్శనముగా మారింది. జాగ్రదావస్థలోకూడా మనస్సు ఆ మూడువిధాలుగానే ప్రకాశిస్తున్నది. మనస్సును కరణము అన్నాము. ఇది కేవలం లోక వ్యవహారం కోసరము మాత్రమే కాని జగత్తులో కరణము. కార్యము వేరువేరుకాదు.

5. ఇక స్వప్నంలో కనిపించేవాటిని స్వప్నంలోనే ఉపయోగిస్తాము. కలలో కనిపించిన గుర్రంమీద ఎక్కి కలలోనే స్వారీ చేస్తాము. కలలో కనిపించిన గొడ్డలితో, ఆ కలలోనే చెట్టును నరుకుతాము. అయితే ఈ కల అనేది అంతా అసత్యమే. అలాగే లోకంలో కనిపించేవి కూడా లోకదృష్టిలో ప్రయోజనకరములే అయినప్పటికీ నిజంగా అవి సత్యాలు కాదు. కల ఏ విధంగా నిజంకాదో, ఈ లోకంలో కనిపించేవి కూడా అలాగే నిజం కాదు. కలలో కనిపించిన గొడ్డలి అసత్యమైనప్పుడు, ఆ గొడ్డలితో చెట్టు నరకటం కూడా అసత్యమే కదా ? ఈ రెండూ అసత్యమైనప్పుడు వీటికి కారణమైన కలకూడా అసత్యమే. అదే విధంగా లోకంలో కనిపించేవి అసత్యమైనప్పుడు, వాటికి కారణమైన మనస్సుమాత్రం సత్యమెట్లా అవుతుంది ? అంటే కార్యరూపమైన లోకమూ లేదు. కరణ రూపమైన మనస్సూ లేదు.

**ప :** మరి బంధమోక్షాలకు మనస్సే కారణము అన్నారు కదా ?

**ద :** ఆ పరమేశ్వరియే గారడీవాడిలాగా ఈ లోకవ్యవహారాలు నడిపిస్తుంది. ఒక్కొక్కసారి ఏమీ చెయ్యకుండా నిర్వికారంగా ఉంటుంది. ఆ దశలే బంధమోక్షాలు.

పరశురామా ! ఇక చిత్తతత్త్వాన్ని చూడు. సర్వవ్యాపకత్వము, సూక్ష్మత్వము, నిర్మలత్వము, నిరాకారము, సర్వాధారము మొదలైన గుణాలు ఆకాశానికి, ఆత్మకి రెండింటికీ ఉన్నాయి. అయితే ఈ రెండింటికీ తేడా ఒక్కటే. ఆకాశానికి చైతన్యం లేదు. ఆత్మకి చైతన్యం ఉంది. వాస్తవంగా చూసినట్లైతే, చైతన్యపూరితమైన ఆత్మయే ఆకాశం. ఆకాశమే ఆత్మ. ఈ రెండింటికీ భేదం లేదు.

గుడ్లగూబకు పట్టపగలు చీకటిలా ఉంటుంది. అలాగే అజ్ఞానులు ఆత్మను ఆకాశం అని భ్రమిస్తారు. జ్ఞానులు ఆకాశంలో చిదాత్మను దర్శిస్తారు. పరమేశ్వరి తానే అనేక రూపాలయి ప్రకాశిస్తుంది. గారడీవాడు తన శక్తితో అనేక రూపాలలో కనిపిస్తాడు. ఆ రూపభేదం చూసేవారికి మాత్రమే తెలుస్తుంది. కాని గారడీ వాడి దృష్టిలో ఆ తేడా లేదు. అలాగే జీవులు పరమేశ్వరిని మాయ ఆవరిస్తుందని నమ్ముతారు. కాని ఆమె దృష్టిలో అసలు మాయే లేదు. పరమేశ్వరి యొక్క స్వతంత్ర శక్తే మాయ. లోకంలో యోగులు,

మాంత్రికులు, ఇంద్రజాలికులు అంతా పరమాత్మ స్వరూపులే. వీరందరూ సంపూర్ణమైన స్వతంత్రశక్తి కలవారే. అయినప్పటికీ ఆపరాచితి మాయతో వారి శక్తి కప్పబడింది. అందుచేతనే వారిది పరిమిత స్వాతంత్ర్యమైంది. ఆ కొంచెంతోనే వారు అద్భుతాలు చేయగలిగినప్పుడు, ఇక ఆ పరమేశ్వరి సృష్టి చెయ్యటంలో ఆశ్చర్యమేముంది ?

**ప :** పూర్ణమైన పరాచితికి పరిచ్ఛేదం రావటమంటే ఏమిటి ?

**ద :** పరాచితి ఈ జగత్తులోని దీపాలన్నింటికన్న విలక్షణమైన కాంతి కలది. అది పరిపూర్ణము. పరిపూర్ణ ఆత్మ సమస్త రూపాలలోను విస్తరించి ఉంటుంది. అందువల్ల దానిని పూర్ణాహంభావము అన్నారు. ఆ పరిపూర్ణ చితి తన సంకల్పంవల్ల తనదే అయిన ఒక దేశంలోనో కాలంలోనో విశ్రమించటాన్ని అహంభావము అంటారు. దీన్నే పరిచ్ఛేదమనికూడా అంటారు. దీనినే అపూర్ణఖ్యాతి, అవిద్య, అపూర్ణాహంభావము అని కూడా అంటారు. ఈ విధంగా ఒక ప్రదేశంలో విశ్రమించిన చితికన్న, మిగిలిన ప్రదేశాలలో ఉన్న చితినే ఆకాశము అంటారు. అందుచేతనే ఆకాశము ఆత్మకన్న వేరు కాదు. ఈ విషయంలో గొప్ప గొప్ప పండితులుకూడా భ్రమ పడుతున్నారు.

**ప :** మరి ఆ భ్రమ ఎందుకు కలుగుతోంది ?

**ద :** గురూపదేశం పొంది, వేదాంతాన్ని వినికూడా వారు అంతర్ముఖులు కావటంలేదు. వారి దృష్టి కేవలం బాహ్య విషయాలమీదనే ఉంటుంది. వారు అంతర్ముఖులు కానంతవరకు గురూపదేశము, శాస్త్రపరిజ్ఞానము నిష్ప్రయోజనము. నిధి ధ్యానం లేకపోతే ఈ భ్రమ తొలగిపోదు.

**ప :** మనసు ఆత్మ ఒకటే అయితే, ప్రమాత, ప్రమాణము అనే భేదము ఎలా కుదురుతుంది ?

**ద :** ఆకాశంలో ఉన్న జడశక్తిని ప్రధానంగా తీసుకున్నప్పుడు మనస్సును ప్రమాణము అని, దానిలోని చిచ్ఛక్తిని గ్రహించేటప్పుడు ఆ మనస్సునే ప్రమాత, జీవుడు అని అంటున్నాము. ఆకాశం మిక్కిలి కోమలంగాను, శిధిలంగాను, నిర్మలంగాను ఉంటుంది. దీనిలో కాఠిన్యము, సరళత్వము, ఘనత్వము కల్పన చేసినప్పుడు పంచభూతాలు ఆవిర్భవిస్తాయి. అది ఏ రకంగా అంటే -

1. ఆకాశానికి స్పర్శ కలిగించినప్పుడు - వాయువు అవుతుంది

2. వాయువుకు సంశ్లేషాన్ని కలిగిస్తే - అది తేజస్సు అవుతుంది ఆ తేజస్సులో ఘనత్వం లేదు.

3. తేజస్సుతో ఘనత్వాన్ని కల్పన చేస్తే – జలం అవుతుంది జలానికి ఘనత్వమున్నది. అందుచేతనే నీటిపైనగాని, నీటిలోపలగాని కొట్టటం అనేది సాధ్యమవుతోంది.

4. నిర్మలంగా ఉన్న జలానికి మాలిన్యం కలిగిస్తే – పృథివి అవుతుంది. పృథివిలో నిర్మలత్వం లేదు. నీళ్ళలో కుండను ముంచితే కుండ కనిపిస్తుంది. అదే కుండను మట్టితో కప్పితే కుండ కనపడదు.

పంచభూతాలతో ఆవరించినప్పుడు దేహాతాదాత్మ్య భావం కలుగుతుంది. అప్పుడు దాన్ని దేహాత్మ అంటారు. ఈ భావం పొందినా చితి తన స్వరూపాన్ని వదలదు. ఒక దీపాన్ని తెచ్చి కుండలో పెట్టినంత మాత్రంచేత, అది వెలగకుండా ఉండదు. దాని కాంతి కుండంతా వ్యాపిస్తుంది. చిల్లుల గుండా బయటకు ప్రసరిస్తుంది. అలాగే ఆత్మదేహంలో ఉన్నా, దేహమంతా వ్యాపించి ఉంటుంది. చెవులు, కళ్ళు మొదలైనవాటి ద్వారా బయటకు ప్రసరిస్తుంది. దీనివల్ల నిష్క్రియత్వం గల చీకటి నశిస్తుంది. ఈ ఆత్మ జడరూపమైన అజ్ఞానాన్ని తొలగిస్తుంది. దాన్నే "చిత్ప్రకాశ ప్రసారము" అంటారు. పరశురామా ! మనస్సంటూ విడిగా లేదు. ఆత్మే మనస్సు.

**ప :** చలనము అంటే ఏమిటి ?

**ద :** స్ఫూర్తితో ఆవరణ భంగం చెయ్యటమే చలనము. దీన్నే వికల్పము అనికూడా అంటారు. ఈ వికల్పం గనకపోయినట్లైతే, చితిలో ప్రకాశించే పరిచ్ఛేదం అంటే - విభాగము పోతుంది. అంటే అల్పజ్ఞానం తొలగిపోతుంది. కేవలం పరిపూర్ణమైన విజ్ఞానం ప్రకాశిస్తుంది. ఈ విజ్ఞానమే మోక్షసాధనము.

**ప :** ఒకవేళ వికల్పాలను వదలివేసినా, ఆవరణ శేషం ఉండచ్చును కదా ?

**ద :** పరశురామా ! అసలు ఆవరణ అనేదే లేదు. ఆవరణ అనేది నిజం కాదు. అది మనం కల్పించిందే. ఇదంతా పగటికలలాంటిది. కలలో అతణ్ణి శత్రువు బంధించి బాధిస్తున్నారు. కలను వదిలేస్తే, బాధ ఉండదు. ఇది కూడా అంతే. ఆవరణ అనేది కల్పన ఉన్నంతవరకే ఉంటుంది. కల్పన పోతే బంధనాలుండవు. అసలు విచిత్రము తెలుసా ? "బంధమే సత్యము" అనే నమ్మకమే మహాబంధమయ్యా, కాబట్టి బంధనాలను వదలిపెట్టు. ఈ బంధనాలున్నంతవరకు గురువుగాని, త్రిమూర్తులుగాని చివరకు పరమేశ్వరి కూడా సంసారాన్ని నాశనం చెయ్యలేదు.

నిర్వికల్ప దశలో మనస్సు ఉన్నప్పటికీ, అది ఆత్మస్వరూపమే కాబట్టి ద్వైతమనే ప్రసక్తి లేదు. ఇది, అది అనే రూపంతో భాసించే జ్ఞానమే మనస్సు. అది, ఇది అనేవి

గనకపోతే మిగిలేది శుద్ధజ్ఞానమే. అదే ఆత్మ. అంటే మనస్సే ఆత్మ అయినప్పుడు ఇక ద్వైతమెక్కడుంటుంది ?

**ప:** గురుదేవా ! రజ్జు సర్పభ్రాంతి కలిగింది. అంటే రజ్జువును ఆధారంగా చేసుకుని సర్పభ్రాంతి కలిగింది. తరువాత భ్రాంతిపోయింది. ఆ తరువాతకూడా రజ్జువు, అనే జ్ఞానం ఒకటి ఉన్నది కదా ! అది ఆత్మకన్న భిన్నమైనదే కదా ? అప్పుడు ద్వైతమున్నది కదా ?

**ద:** లేదయ్యా ! ఆ త్రాడుకూడా ఆత్మ యందు కల్పించబడినదే. అనే విషయం తెలుస్తుందో ఆ క్షణంలోనే రజ్జు జ్ఞానంకూడా నశిస్తుంది. ఇక మిగిలేది ఆత్మ ఒక్కటే. అసలు త్రాడే లేకపోతే ఇంక పాము అనే భ్రాంతి ఎక్కడుంటుంది ? కాబట్టి దృశ్యము లేకపోతే మిగిలేది దృక్కే ఆ దృక్కు చిదాత్మకన్న వేరైనది కాదు. అందుకే ఇక్కడ ద్వైత ప్రసక్తి లేదు.

పరశురామా ! లోకంలో అజ్ఞానులు సత్యాసత్యాలకున్న తేడా తెలుసుకోలేక పోతున్నారు. ఈ జగత్తే సత్యము అనుకుంటున్నారు. అన్ని కాలాలలోనూ ఉండేదాన్నే సత్యము అంటారు. చితి ఎప్పుడూ ప్రకాశిస్తూనే ఉంటుంది. అందుకే దాన్ని సత్యము అంటారు. చితి ప్రకాశించకపోతే అసలు కాలమే ప్రకాశించదు.

**ప :** చితి ఎల్లప్పుడూ ప్రకాశిస్తుంది అన్నారు నిజమే. అది సత్యమే. అయితే సత్యాసత్యాలకు భేదం ఏమిటో తెలియజెయ్యండి.

**ద:** రామా ! ఇతరాపేక్ష లేకుండా ప్రకాశించేది సత్యం. ఇతరాపేక్షతో ప్రకాశించేది అసత్యం. లేదు అనేది లేనిది సత్యము. లేదనే మాట ఉన్నది అసత్యం. ఒక్కొక్కసారి లేనిది కూడా ఉన్నట్లు కనిపిస్తుంది. అందుకే అసత్యాన్ని సత్యం అనుకుంటారు. కాని నిదానంగా విచారిస్తే విషయం బోధ పడుతుంది.

చితిప్రకాశం లేకపోతే ఏదీ ఉండదు. అసలు "ఏదీ ఉండదు" అనే జ్ఞానమే ఉండదు. ఏదైనా ఒక వస్తువు లేదు అన్నామంటే అది అసలు ఉన్నదన్నమాట. కాని ఇప్పుడు లేదు. అంతేకాని ఉన్నదాన్ని లేదనటం జరగదు. ఇక్కడ చితి తప్ప ఇంకేదీ లేదు. ఉన్నది ఒక్కటే పరాచితి త్రిపురాసుందరి.

జగత్తులోని విషయాలన్నీ భ్రమే. లోకంలోని విషయాలను ప్రమాణాలు అనుకోవటం మహాభ్రమ. "అది నిజం కాదు" అని తెలిసేవరకు ఈ భ్రమే ఉంటుంది. ముత్యపు చిప్పను చూసి వెండి అనుకుంటాము. అది వెండి కాదు అని తెలిసేవరకు ఆ భ్రమ అలానే ఉంటుంది. అలాగే ఆత్మజ్ఞానం కలిగేదాకా ఉండే లోకజ్ఞానం అంతా భ్రమే.

అయితే ఈ భ్రమ అందరికీ కలుగుతుంది. ఆకాశం నీలంగా ఉంది. ఇది సత్యము అనే భ్రమ అజ్ఞానంవల్ల అందరికీ కలుగుతుంది. చిదాత్మరూపంగా ఉన్న విజ్ఞానం ఒక్కటే ప్రమాణమైన జ్ఞానం ఈ జగత్తులో చిదాత్మ ఒక్కటే సత్యము నిత్యము, ప్రమాణమైనదని తెలుసుకో.

ప : గురుదేవా ! చిన్న ప్రశ్న. ముక్తి కలిగినప్పుడు లోకవ్యవహారం ఎలా ఉంటుంది?

ద : ముక్తులైన జ్ఞానులు మూడు రకాలుగా ఉంటారు.

1. ఆత్మస్వరూపం తెలిసినా ప్రారబ్దంవల్ల వచ్చిన విషయభోగాలతో ప్రతిక్షణమూ శతమతమయ్యేవారు అధములు.

2. ప్రారబ్దంవల్ల భోగాలనుభవిస్తూకూడా, నిరంతరం సమాధిస్థితిలోనే ఉంటూ ఆత్మానందాన్ని అనుభవించేవారు మధ్యములు. వీరుపైకి మాత్రం సామాన్యులవలె కనిపిస్తారు.

3. కర్మఫలాన్ని అనుభవిస్తూ, సమాధిలోనే మనస్సు ఉంచి సుఖదుఃఖాలకు అతీతులుగా ఉంటూ లోకంలోని అందరినీ సమానంగా చూచేవారు ఉత్తములు.

ఈ విధంగా వారి బుద్ధి, ప్రారబ్ధ కర్మలలో తేడాలను బట్టి వారు వ్యవహరిస్తుంటారు" అని చెప్పాడు అని చెబుతూ పద్దెనిమిదో అధ్యాయాన్ని పూర్తిచేశాడు రత్నాకరుడు.

## 31. జ్ఞానభేదాలు - మోక్షసాధనాలు

గురువుగారూ ! ముక్తి కలిగినప్పుడు లోకవ్యవహారము ఏ విధంగా ఉంటుందో వివరించాడు కదా దత్తాత్రేయుడు. దాంతోనైనా పరశురాముడి అనుమానం పూర్తిగా తీరిందా ? ఆ తరువాత ఏం జరిగింది ? అంటూ అడిగాడు కృష్ణశర్మ. చెప్పటం మొదలుపెట్టాడు రత్నాకరుడు.

దత్తాత్రేయుడు చెప్పిన మాటలతో పరశురాముడు తృప్తి చెందలేదు. మళ్ళీ ప్రశ్నిస్తున్నాడు. ఆచార్యదేవా ! బుద్ధి భేదాన్ననుసరించి జ్ఞానంలో తేడా ఉంటుంది అన్నారు. జ్ఞానము అంటే ఆత్మ ప్రకాశమేకదా ? ఇక మోక్షమే అందరూపొందదగినది. మరి అలాంటప్పుడు బుద్ధిభేదాన్ననుసరించి జ్ఞానంలో తేడా ఎలా ఉంటుంది ? జ్ఞానసాధనాలలో కూడా తేడాలుంటాయి ? వివరించండి అన్నాడు. ఆ మాటలు విన్న దత్తాత్రేయుడు, తన శిష్యుని అనుమానం తీర్చటానికి ఉద్యుక్తుడౌతున్నాడు.

జ్ఞానసాధనాలలో ఉండే తేడాని బట్టి ఫలప్రాప్తిలో తేడా ఉంటుంది. సాధన పరిపూర్ణమైతే ఫలితం తేలికగా వస్తుంది. అసలు జ్ఞానమనేది సత్యసిద్ధమే. కాబట్టి దానికి సాధనాపేక్ష ఏ మాత్రం లేదు. జ్ఞానమనేది ఎప్పుడూ సాధ్యంకాదు. అది విజ్ఞాన చైతన్యము. ఎల్లప్పుడూ స్వప్రకాశమే. నిత్యప్రకాశమైన దానికి సాధనతో పనేమిటి ? స్ఫటికతో చేసినపెట్టెలో పద్మరాగమణి ప్రకాశించినట్లుగా, స్వచ్ఛమైన చిత్తంలో చైతన్యం ఎప్పుడూ ప్రకాశిస్తూ ఉంటుంది. కాని స్ఫటికం మీద మట్టిపడితే, లోపల మణి కనపడదు. అలా వాసనలు, మనసును కమ్మితే చైతన్యం ప్రకాశించదు.

తుప్పు పట్టిన పెట్టె మూత అతుక్కుపోయినట్లుగా దేహంతో తాదాత్మ్యం చెందటంతో చిత్తం మూసుకుపోతుంది. అప్పుడు మనోనిరోధము అనే నీటిధారతో అజ్ఞానమనే బురదను కడిగి వెయ్యాలి. శ్రవణము మననము అనే పదునైన సానరాయితో దేహ తాదాత్మ్య భావం అనే తుప్పును వదిలించాలి. తరువాత యుక్తి అనే తాళం చెవితో చిత్తమనే పెట్టెను తెరవాలి. అప్పుడు పద్మరాగమణిలాగా చైతన్యం స్వచ్ఛంగా ప్రకాశిస్తుంది. అందుకని సాధన అనేది వాసనలను అరికట్టటానికే. అంతేకాని జ్ఞానానికి సాధన అవసరం లేదు. వాసనల ప్రభావం ఎక్కువగా ఉంటే సాధన ఎక్కువ కావాలి.

**ప :** గురువర్యా ! వాసనలు అన్నారు కదా ! వాటిని వివరించండి.

**ద :** వాసనలు ముఖ్యంగా మూడు రకాలు. వీటినే త్రివిధ వాసనలు అంటారు. అవి వరుసగా 1) లోకవాసన 2) శాస్త్రవాసన 3) దేహవాసన ఇవే కాకుండా అపరాధము, కర్మ, కామము అని మూడు రకాలున్నాయి.

**1. అపరాధము :** గురువుయొక్క మాటలలో విశ్వాసం లేకపోవటమనేది అపరాధం. ఇది ఆత్మవినాశనము.

విపరీత గ్రహణమనేది కూడా అపరాధవాసనే. విపరీత గ్రహణం మూడు రకాలు అవి

1. నిర్విశేషమైన బ్రహ్మము లేదు. అది ఉండటం అసంభవం.

2. నిర్విశేష బ్రహ్మ ఉన్నది. కాని దాన్ని తెలుసుకోవటం సాధ్యం కాదు.

3. శ్రవణమననాలద్వారా కొందరికి తత్త్వదర్శనం కలుగుతుంది. కాని అది యదార్థమైన పరతత్త్వం కాదు.

**2. కర్మవాసన :** పూర్వంచేసిన కర్మలవల్ల మనసులో మాలిన్యం ఏర్పడుతుంది. అందువల్ల గురువు ఎంత బోధించినా బుద్ధికి ఎక్కదు. దీన్నిజయించటం కష్టం. ఇవి

అనంతముగా ఉంటాయి. కాబట్టి వీటిలో కొన్ని నశించినా ఇంకా కొన్ని కొత్తగా వస్తుంటాయి. ఆకాశంలోని నక్షత్రాలను లెక్కపెట్టవచ్చు కాని ఈ కర్మవాసనలను అధిగమించటం మాత్రం కష్టము.

**3. కామవాసన :** ఇది చాలా పెద్దది. ఆకాశంకన్న విశాలంగా ఉంటుంది. పర్వతంకన్న నిశ్చలంగా, ఎత్తుగా ఉంటుంది. ఇదే 'ఆశ'. ఈ ఆశాపిశాచివల్లనే లోకంలో అంతా పిచ్చివారవుతున్నారు. కేవలం వైరాగ్యంతో మాత్రమే దీన్ని జయించగలము.

పరశురామా ! ఈ వాసనాత్రయం మనసుకు ఆక్రమించినందువల్ల ఆత్మతత్త్వం కలగదయ్యా వీటిలో మొదటివాసన అయిన.

1. అపరాధాన్ని - గుర్తించి సరిచేసుకోవాలి.

2. కర్మవాసన - ఈశ్వరానుగ్రహంతో పోతుంది.

3. కామవాసన - వైరాగ్యంవల్ల నశిస్తుంది.

అన్ని సాధనలలోకీ మొట్టమొదటిది ముముక్షుత్వం మోక్షం పొందాలనే కోరిక. ఇది గనకలేకపోతే ఇంకా ఏ సాధనాలు ఉపయోగం ఉండవు. ముముక్షుత్వం లేని శ్రవణము, మననము మొదలైనవి శవానికి చేసే అలంకారాలవంటివి. కేవలం శ్రవణాదులవల్లనే మోక్షం రాదు.

ఆధ్యాత్మిక ప్రవచనాలు విన్నప్పుడు జగత్తు అంతా మిధ్య. బ్రహ్మ ఒక్కటే సత్యము అనిపిస్తుంది. మోక్షకాంక్ష కలుగుతంది. అది కేవలము తాత్కాలికము. దానివల్ల ఫలితముండదు. ఈ కోరిక ఎంత తీవ్రమైతే అంత త్వరగా ఫలితముంటుంది. మోక్షం కన్న ఇతరమైన వాటియందు ఆసక్తిలేని ఇచ్ఛనే 'తత్పరత్' అంటారు. అదే మోక్షఫలాన్ని సాధిస్తుంది.

ఆ మాటలు విన్న పరశురాముడు ఆలోచించాడు. అతడికి మళ్ళీ సందేహం కలిగింది గురువుకు నమస్కరించి గురుదేవా ! సత్సంగము, ఈశ్వరానుగ్రహము, వైరాగ్యము, ఈ మూడూ మోక్షానికి కారణము అన్నారు. వీటిలో ముఖ్యమైనది ఏది ? దాన్ని ఎలా పొందగలము ? అన్నాడు.

**ద :** నాయనా ! శ్రేయస్సుకు ముఖ్యమైన మొదటి కారణాన్ని గురించి వివరిస్తాను విను. ఆ పరాచితి, పరమేశ్వరియే తన స్వాతంత్ర్యేచ్ఛవల్ల ఈ జగత్తును సృష్టించింది. ఆమెయే హిరణ్యగర్భుడనే పేరుతో ఈ శరీరాన్ని ధరించింది. జీవులయొక్క కర్మలను, వారి కోరికలను అనుసరించి వారికి చిత్రవిచిత్రమైన ఫలితాలు ఇవ్వగల కర్మలను సృష్టించింది.

ప్రతి మనిషీ మంచి, చెడూ కర్మలు చేస్తూనే ఉంటాడు. వీటి ఫలితంగా ఉత్తర జన్మలు ఎత్తుతుంటాడు. ఒక్కొక్కసారి కామ్యకర్మలే చేస్తాడు. వాటిలో ఏ లోపం జరిగినా అవి ఫలితాన్ని ఇవ్వవు. పైగా ఒక్కొక్కసారి దుష్ఫలితాలు కూడా ఇస్తాయి. అందుకని సత్పురుషులనాశ్రయించి కర్మలు ఏ రకంగా చెయ్యాలో తెలుసుకుని ఆ రకంగానే వాటిని పూర్తి చెయ్యాలి.

సాధారణంగా సత్సంగం వల్లనే శ్రేయస్సు కలుగుతుంది. ఒక్కొక్కసారి గతంలో మనం చేసిన ఉత్కృష్టమైన తపస్సులాంటిది ఉంటే అనుకోకుండా శ్రేయస్సు కలుగుతుంది. వారికి అల్పసాధనతోనే సంపూర్ణ జ్ఞానం సిద్ధిస్తుంది. పూర్వపుణ్యంవల్ల వాసనలు లేనివారికి మనస్సు నిర్మలంగా ఉండి జనకుని లాగా అతిస్వల్పకాలంలోనే మహత్తర జ్ఞానం కలుగుతుంది. అధికవాసనలున్నవాడికి జ్ఞానం కలిగినా దానివల్ల ఫలితముండదు. జ్ఞానులలో కూడా స్థితి భేదాలున్నాయయ్యా ! త్రిమూర్తుల మనస్సులలో కర్మవాసనలు లేవు. అందుకే వారు స్వభావజ్ఞానులు, అయినప్పటికీ వారి స్వభావగుణ మహాత్మ్యాలలో తేడా ఉంది.

పరశురామా నేను, దూర్వాసుడు, చంద్రుడు ఒక తల్లి బిడ్డలమే అయినా మాలో తేడా కనపడుతున్నది.

| | | |
|---|---|---|
| దుర్వాసుడు | - | కోపిష్టి |
| చంద్రుడు | - | కాముకుడు దక్షుని కుమార్తెలందరిని వివాహం చేసుకున్నాడు. |
| ఇక నేను | - | సర్వసంఘపరిత్యాగిని విరాగిని |

అదే విధంగా

| | | |
|---|---|---|
| వశిష్ఠుడు | - | కర్మిష్ఠి |
| సనకసనందనాదులు | - | సన్యాసులు |
| నారదుడు | - | భక్తుడు |
| బృహస్పతి | - | దేవగురువు |
| శుక్రాచార్యుడు | - | రాక్షస గురువు |
| వ్యాసుడు | - | శాస్త్ర రచయిత |
| జనకుడు | - | రాజు |
| భరతుడు | - | త్యాగి |

వీరందరూ జ్ఞానులే ఇంకా ఇలాంటివారెందరో ఉన్నారు. వారిలో అనేక తేడాలు కనిపిస్తాయి. రామా ! నీకొక పరమ రహస్యాన్ని చెబుతాను విను.

వాసనాత్రయమును గురించి గతంలో వివరించాను. 1. అపరాధము 2. కర్మ 3. కామము. వీటిలో కర్మవాసన బలీయమైంది. దీనివల్ల మనస్సు అత్యంత మూఢమవుతుంది. మిగిలిన రెండు వాసనలు లేకపోయినా, కర్మవాసన ఒక్కటి ఉంటేచాలు. జ్ఞానం కలగదు. ఈ కర్మవాసనకొద్దిగా ఉన్నా చాలు. అజ్ఞానము పెరిగిపోతుంది. మిగిలిన రెండు వాసనలు ప్రతిబంధకాలవుతాయి. అపరాధ, కర్మవాసనలు లేనివారికి కామవాసనలు ప్రతిబంధకాలు కావు. అందుచేతనే కర్మవాసనలు ఏ మాత్రం లేనివారిని 'మేధావులు' అంటారు. వారికి విషయాన్ని ఒకసారి విన్నంత మాత్రంచేతనే, అప్పటికప్పుడే మననము, ధ్యానము కలుగుతాయి. ఆ వెంటనే ఆత్మదర్శనమవుతుంది. జనకమహారాజు లాంటివారు ఈ కోవకు చెందినవారే. వీరు జీవన్ముక్తులు. వీరి విషయంలో కామక్రోధాలు ప్రతిబంధకాలు కావు. అందుకనే వారు వాటిని నిరోధించటానికి ప్రయత్నంకూడా చెయ్యరు. అందుకనే జ్ఞానోదయమైన తరువాతకూడా వారిలో కామాదులు పుడుతూనే ఉంటాయి. కాని వాటివల్ల ఏ రకమైన మాలిన్యము వారికి అంటదు. వారిని 'ముక్తులు' అంటారు.

పరశురామా ! కర్మవాసనలతో బాగా మలినమై పోయినవారికి సాక్షాత్తూ పరమేశ్వరుడు వచ్చి ఉపదేశం చేసినా జ్ఞానం కలగదు.

అపరాధము, కర్మ తక్కువగా ఉండి కామవాసన ఎక్కువగా ఉన్నవారు చాలా కాలం శ్రవణమననాలు, ధ్యానము చేస్తే, అతికష్టం మీద జ్ఞానం కలుగుతుంది. వారు ఎక్కువగా సమాధిలోనే ఉంటారు. సమాధిఅభ్యాసం వల్ల వాసనలు నశిస్తాయి. వీరి మనస్సు నశిస్తుంది వీరిని "నష్ట మానసులు" అంటారు. వీరు మధ్యములు.

యోగసాధన చేసేవారిలో కొందరు సోమరితనంతో తీవ్రసాధన చెయ్యరు. అప్పుడు మనస్సు నశించదు. వారిని "సమనస్కులు" అంటారు. వీరే 'మందజ్ఞానులు" "కేవలజ్ఞానులు" వీరు ప్రారబ్దానికి లొంగిపోతారు. సుఖదుఃఖాలను అనుభవిస్తారు. చనిపోయిన తరువాత మోక్షాన్ని పొందుతారు. నష్టమానసులు ప్రారబ్దాన్ని జయిస్తారు. వీరికి మనసుండదుకాబట్టి వీరి వాసనలు గాదె అడుగున ఉండే విత్తనాలలాగా తప్పలు అయిపోతాయి. అంతేగాని మొలకెత్తవు.

జీవన్ముక్తులు ఉత్తమజ్ఞానులు. వీరి దృష్టి ఆత్మానందంమీదనే ఉంటుంది. ఒక్కొక్కసారి బాహ్యప్రపంచం వైపుకూడా వీరురావచ్చు. వీరు మేధావులు. ఏకకాలంలో అనేక పనులు

చెయ్యగలరు. అందుకే వీరిని "బహుమానసులు" అంటారు. వీరికి కూడా ప్రారబ్ధ ఉండచ్చు. కాని అది మొలకెత్తగానే జ్ఞానాగ్నితో దాన్ని దగ్ధం చేస్తారు. కాబట్టి ప్రారబ్ధకర్మ ఫలితాలు వారికి ఉండవు.

ఉత్తమ జ్ఞానులు తమకు సహజంగా లేకపోయినా, తాము కల్పించుకుని తెచ్చుకున్న భావాలతో లోకవ్యవహారం చేస్తారు. వీరి మనస్సు వికారం పొందదు. ఉత్తమ జ్ఞానికి తన విషయంలోగాని, ఇతరుల విషయంలోగాని కలిగే సుఖదుఃఖాలు కల్పితాలే. అవి వారి మనస్సునంటవు.

మేధావులైన జ్ఞానులు తమ మనస్సులో ఉన్న పూర్వవాసనలను నాశనం చెయ్యటానికి ప్రయత్నించరు. అందువల్ల అవి వారిలో పని చేస్తాయి. ఆ కారణంగా వారు కోపిష్టులుగానో, కాముకులుగానో అవుతారు. ఆ కర్మవాసనలు వారికి ప్రతిబంధకాలు కావు. అందుచేతనే ఉత్తమజ్ఞానులలో రకరకాల ఆచారవ్యవహారాలు కనపడుతుంటాయి.

సమనస్కులైన వారిని మందజ్ఞానులంటారు. వీరు అల్పజ్ఞానులు వీరికి కూడా సమాధిస్థితిలో ఆత్మతత్త్వం గోచరిస్తుంది. స్వరూపవిమర్శన లేనివారికి ఆత్మతత్త్వం గోచరించదు.

హఠయోగికి వికల్పనిరోధంవల్ల కలిగే స్వరూపస్ఫూర్తియే సమాధి. హఠయోగులు రెండు రకాలు.

1. పతంజలి చెప్పిన అష్టాంగయోగంలో సిద్ధి పొందినవారు

2. ధౌతి, వస్తి మొదలైన షట్కర్మలు, ప్రాణాయామం బాగా చేసి, షట్చక్రభేదనం చేసి సుషుమ్న ద్వారా కుండలిని సహస్రారం చేర్చేవారు.

మొదటి పద్ధతిలో ముందుగా ఆలోచనలు వదలివేస్తాడు. తరువాత ఆలోచనలను నిరోధిస్తాడు. తరువాత సంకల్పాన్నికూడా వదిలేస్తాడు. ఇప్పుడు అన్నీ పోయినాయి. ఇక తానొక్కడే ఉంటాడు. రెండవ పద్ధతిలో ప్రాణాయామం చేస్తాడు. అది చాలా శ్రమతో కూడినది. కాని ప్రాణవాయువు సుషుమ్నలో ప్రవేశించిన తరువాత హాయిగా ఉంటుంది.

ఈ రెండు పద్ధతులలోనూకూడా, సిద్ధి కలిగినప్పుడు, సుషుప్తిలో కలిగే సుఖం కలుగుతుంది.

**ప:** హఠయోగికీ, జ్ఞానయోగికీ తేడా ఏమిటి ?

**ద:** జ్ఞానయోగికి అజ్ఞానము యొక్క ఆవరణము, విక్షేపము అనే రెండు అంశాలూ తొలగిపోతాయి. ఆత్మతత్త్వం గోచరిస్తుంది. హఠయోగికి అజ్ఞానం పోదు.

ప : హఠయోగికి వచ్చే సుషుప్తికీ, సమాధికీ తేడా ఏమిటి ?

ద : సుషుప్తిలో మనస్సు తమోగుణరూపంగా పరిణమిస్తుంది. అది మూఢావస్థ. సమాధిస్థితిలో మనస్సు ప్రకాశించినా, అజ్ఞానంతో అది మేఘాలు క్రమ్మిన సూర్యుడిలా ఉంటుంది. అదే జ్ఞానయోగికి నిర్మలాకాశంలోని సూర్యునిలా మనస్సు ప్రకాశిస్తుంది. అని దత్తాత్రేయుడు పరశురాముడికి జ్ఞానభేదాలు. మోక్షసాధనాల గురించి వివరించాడు అంటూ పంథొనిమిదో అధ్యాయాన్ని పూర్తిచేశాడు రత్నాకరుడు.

## 32. విద్యాగీత

గురువుగారూ ! జ్ఞానులలో ఉండే వివిధరకాలు, మోక్షసాధనాలు గురించి తెలుసుకున్న తరువాత పరశురాముడు ఇంకా ఏమడిగాడు ? అంటూ ప్రశ్నించాడు నారాయణభట్టు చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

దత్తాత్రేయుడు చెప్పిన విషయాలను పూర్తిగా విన్న పరశురాముడు "గురుదేవా జ్ఞానుల వ్యవహారాలు ఏ విధంగా ఉంటాయో వివరించండి" అన్నాడు. ఆ మాటలు విన్న దత్తాత్రేయుడు చెప్పటం ప్రారంభించాడు.

పూర్వకాలంలో ఒకసారి సత్యలోకంలో జ్ఞానయజ్ఞం జరిగింది. దానికి సనక సనందనాదులు, వసిష్ఠుడు, వామదేవుడు, పులస్త్యుడు, పులహుడు, చ్యవనుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, నారదుడు మొదలైన మహానుభావులంతా విచ్చేశారు. యజ్ఞం కేవలం ప్రవచనాలు, చర్యగా సాగింది. చివరలో అక్కడ చేరిన మహానుభావులంతా విధాతనడిగారు. "ప్రజాపతీ, ఇక్కడ చేరినవారందరూ జ్ఞానులే. అయినప్పటికీ, గతజన్మ కర్మవల్ల కొందరు సమాధిలో ఉంటున్నారు. కొందరు శాస్త్రాలు చర్చిస్తున్నారు. కొందరు భక్తులు, కొందరు కరిష్టులు అయినారు. వీరందరిలోకీ ఎవరు శ్రేష్ఠులు ఎవరికివారు తమ అభిప్రాయాలే మంచివి అనుకుంటున్నారు. కాబట్టి మాలో శ్రేష్ఠులెవరో నువ్వే తేల్చవలసినది" అన్నారు.

ఆ మాటలు విన్న బ్రహ్మ తీవ్రంగా ఆలోచించాడు. వీళ్ళెవరికీ తమమీద నమ్మకం లేదు. కాబట్టి నేను చెప్పిన మాటలు మాత్రం నమ్ముతారనే నమ్మకమేముంది ? అనుకుని "మహర్షులారా ! ఈ విషయం చెప్పటం నాక్కూడా కష్టంగానే ఉన్నది. అందుకని మనమంతా ఈశ్వరుడి దగ్గరకు వెడదాం రండి" అన్నాడు. మహర్షులందరూ కలిసి కైలాసం చేరి విషయం శివుడికి వినిపించారు. ఆయనకు కూడా బ్రహ్మకు వచ్చిన అనుమానమే వచ్చింది. దాంతో శివుడు "మునీంద్రులారా ! ఈ విషయం నాక్కూడా

పూర్తిగా తెలియటంలేదు. మనమంతా పరమేశ్వరిని స్తుతి చేద్దాం. ఆమే మీ ప్రశ్నకు సమాధానం చెబుతుంది." అన్నాడు దాంతో ఋషీశ్వరులంతా ఆ పరమేశ్వరిని పరిపరివిధాల స్తుతి చేశారు.

కొంతసేపటికి ఆ పరమేశ్వరి వారి ఎదుట ప్రత్యక్షమై, ఏ కోరికలు లేని మీరు నన్నెందుకు పిలిచారు? మీకేం కావాలి ? అని అడిగింది. అలా ప్రత్యక్షమైన దేవిని పరిపరివిధాల స్తుతించినవారై చివరకు ఆమెతో "అమ్మా నీ రూపాలలో

1. ఏది పరము ?
2. ఏది అపరము ?
3. ఏది నీ ఐశ్వర్యరూపం ?
4. నీ జ్ఞానరూపం ఏమిటి ?
5. అజ్ఞానానికి ఫలమేమిటి ?
6. జ్ఞానానికి ముఖ్యసాధనం ఏది ?
7. ఎవడు సాధకుడు ?
8. ఎవడు సిద్ధుడు ?
9. అన్నిటికన్న ఉత్తమమైన సిద్ధి ఏది ?
10. సిద్ధులలో శ్రేష్ఠుడెవరు ?

ఈ ప్రశ్నలన్నింటికీ సమాధానాలు చెప్పవలసినది" అన్నారు. ఆ మాటలు విన్న పరమేశ్వరి "నాయనలారా ! మీ ప్రశ్నలన్నింటికీ, ఒక్కొక్కదానికి విడివిడిగా సమాధానం చెబుతాను వినవలసినది. అంటూ ప్రారంభించింది.

**1. ఏది పరారూపం :** పరాప్రతిభయే నా పరారూపం. అందులోనుంచి ఈ జగత్తుయొక్క సృష్టిస్థితిలయాలు జరుగుతున్నాయి. ఈ ప్రతిభకే జ్ఞానము అని కూడా పేరు. అది స్వయంప్రకాశము. అది లేదు అని చెప్పటానికి వీలు లేదు. అదే లేకపోతే ప్రశ్నించేవాడంటూ ఉండడు. అసలు ప్రశ్నలు సమాధానాలే ఉండవు అయితే అది కంటికి కనిపించదు. అన్నింటియందు అఖండంగా ఉంటుంది. అదే నా పరారూపము. మాయతో కప్పబడిన అజ్ఞానులకు జగత్తు ఆకారంలో భాసిస్తుంది. జ్ఞానులకు తమయందే దర్శనమిస్తుంది. ద్వైతబుద్ధి లేనివారు ఆమెను సేవిస్తారు. ఇక్కడ సేవిస్తారు అంటే యజమాని సేవకుడు ఇద్దరున్నారు కదా ? అది ద్వైతం కదా అనుకుంటారేమో ?

జ్ఞానియైనటువంటి వాడికి అద్వైతరూపం తెలిసినా, ద్వైతబుద్ధినే కల్పించుకుని, దాన్ని సేవిస్తుంటాడు. జనాకాది మహానుభావులు అద్వైతులయినా, జ్ఞానులైనా, పూర్వజన్మలో వచ్చిన సంస్కారబుద్ధితో రాజ్యాన్ని పాలించారు. ఈ రకంగా వారు దేవిని సేవించి అద్వైత స్థితి పొందుతారు. చరాచర జగత్తుకూ సూత్రం ఏదైతే ఉన్నదో, అదే నా పరారూపం.

**2. ఏది అపరారూపం :** అనేక బ్రహ్మాండాలకు అవతల క్షీరసాగరంలో, నవరత్నమణి ద్వీపంలో, కందభవనంలో, చింతామణి గృహంలో పంచప్రేతాసనాసీనగా దర్శనమిచ్చే కామేశ్వరీ, కామేశ్వర మిధునరూపమే, భక్తులను అనుగ్రహించటం కోసం ఆవిర్భవించిన అపరారూపం. అదే సగుణబ్రహ్మ, సదాశివుడు, ఈశానుడు, త్రిమూర్తులు, గణపతి, కుమారస్వామి, దిక్పాలురు, కుమారి, లక్ష్మి, అష్టవసువులు, సురలు, నాగులు, యక్ష, కిన్నెర, కింపురుష, సిద్ధ, సాధ్యగణాలన్నీ ఆ దేవి రూపమే. అంతా అపరాస్వరూపులే. అయినప్పటికీ, నా మాయకు లోనైనవారు నన్ను గూర్చి తెలుసుకోవటం లేదు. భక్తుల పూజలంది, వారి కోరికలు తీర్చేది నేనే. ఎవరు ఏ రూపంలో ధ్యానిస్తే, వారికి ఆ రూపంలో ప్రత్యక్షమవుతాను.

**3. ఐశ్వర్యరూపం :** నా ఐశ్వర్యము అనంతము. జ్ఞానమయమయిన నేను ఏ కారణాన్నీ అపేక్షించకుండానే జగదాకారంగా ప్రకాశిస్తుంటాను. అయినప్పటికీ నా అసలు రూపానికి హాని ఉండదు. అసాధ్యమైన దానిని సాధించటమే నా ఐశ్వర్యము. నేనే అన్నిటికీ మూలాధారము. నేను అన్నిటిలోనూ ఉన్నాను. కేవలము చిద్రూపిణిని. నా మాయచేతనే నన్ను తెలుసుకోలేక, అనాదినుండి జనన మరణరూపమైన సంసార సాగరంలో పడి, నీచ ఉచ్ఛజన్మలు ఎత్తుతూ, గురుశిష్యులుగా మారి, శిష్యరూపంలో గురువునుండి మళ్ళీ ఆ తత్వాన్ని తెలుసుకుని ముక్తిని పొందుతున్నాను.

సంసార బంధము సత్యం కాదు. అందుచేత నేను నిత్యముక్తనే. అయినప్పటికీ ఎన్ని పర్యాయములో ముక్తి పొందుతున్నాను. కారణ సామాగ్రి లేకుండానే ఈ జగత్తును సృష్టిస్తున్నాను. నా ఐశ్వర్యము యొక్క అల్పాంశవల్లనే ఈ జగత్తు సత్యమైనట్లు గోచరిస్తున్నది.

**4. జ్ఞానస్వరూపం :** నా జ్ఞానం అనేక విధాలుగా ఉన్నది. ఉపాసనారూపము. ద్వైతరూపము, అద్వైతరూపము, అపరోక్షానుభవము, తనకన్న ఇతరమైన దేవత, మంత్రము ఏదో ఒకటి ఉన్నది అనుకోవటమే ద్వైతము. అదికూడా అసత్యమే. అయినప్పటికీ భగవంతుణ్ణి స్మరించినంత మాత్రం చేతనే ఫలితము వస్తుంది కాబట్టి అవికూడా ఫలితాన్నిస్తాయి.

అయితే అన్ని ధ్యానాలలోకీ కామేశ్వరీ కామేశ్వర ధ్యానం శ్రేష్ఠమైనది. దీన్నే అపరబ్రహ్మ ధ్యానం అంటారు. ఇది మోక్షసాధనం. నేనే శ్రీవిద్యను. నన్ను ధ్యానించనిదే అద్వైతాన్ని ఎవరూ పొందలేరు. 'ఆత్మ అంటే దేహం కాదు'. అనే జ్ఞానం శాస్త్రాలవల్లగాని, తర్కంవల్లగాని కలగదు. అది కేవలము గురూపదేశం వల్లనే కలుగుతుంది.

**5. జ్ఞానానికి ఫలం :** విజ్ఞానంవల్ల శారీరక, మానసిక దుఃఖాలన్నీ నశిస్తాయి. సుషుప్తిలో కూడా ఈ భావన కలుగుతుంది. కాని సుషుప్తి తరువాత మళ్ళీ దుఃఖం కలుగుతుంది. భయం కలుగుతుంది. అందుకే అది సమాధి స్థితి కాదు. సమాధిస్థితి కలిగిన తరువాత దుఃఖము, భయము ఉండవు. అద్వైతము పూర్తిగా తెలిస్తే ఇది పాము, ఇది తేలు అనే తేడాలుండవు. అద్వైతం అవిద్యను నాశనం చేస్తుంది. ఎప్పుడైతే అవిద్య నశించిందో, అప్పుడు ద్వైత భావాలు రావు. భయమనేది ఉండదు. ద్వైతాన్ని వదలివేయటమే మోక్షము. ఆత్మస్వరూపానికి వేరైనదంతా భయం కలిగిస్తుంది. సృష్టిలో ప్రతిదానికీ అంతమున్నది. ఏదైనా సరే పుట్టింది అంటే గిట్టకమానదు. అటువంటివే భయానికి హేతువులు. ఇవన్నీ అజ్ఞానం వల్లనే కలుగుతాయి. అద్వైతభావన వీటన్నింటినీ పోగొడుతుంది. ఎప్పుడైతే బంధనాలనుంచి విముక్తి లభించిందో, అదే ముక్తి మోక్షము అదే జ్ఞానానికి ఫలితము.

**6. మోక్షానికి సాధనము :** మోక్షం సాధించాలంటే తత్పరత్వము కావాలి. అది ఉంటే ఇతర సాధనలు ఏవీ అవసరం లేదు. 'తత్పరత్వము' అంటే – దానియందు శ్రద్ధ, మోక్షాన్ని సాధించి తీరుతాను అనే పట్టుదల. సాధించాలి అనే తీవ్రజిజ్ఞాస. అది ఉన్నవాడికి, బుద్ధిలోని నిర్మలత్వాన్నిబట్టి కొంచెం ముందు వెనుకలుగా ఫలితం లభిస్తుంది. బుద్ధికి అనేక దోషాలున్నాయి. అవే పురుషార్థాలను నాశనం చేస్తాయి. అందువల్లనే మానవుడు సంసారబంధనాలలో పడిచిక్కుకుపోతున్నాడు. ఈ దోషాలలో ముఖ్యమైనవి.

1. గురువాక్యం మీద శ్రద్ధ లేకపోవటం (అవిశ్వాసము)

2. కామవాసన 3. చిత్తమౌఢ్యము.

**1. అవిశ్వాసం :** ఇది రెండు రకాలు : 1) సంశయము, 2) విపర్యయము

మోక్షమున్నదో, లేదో అనేది సంశయం. మోక్షం లేనే లేదు అనేది విపర్యయం. తత్పరత్వం రావాలంటే ఈ రెండూ ఉండకూడదు. ఇక్కడ నిశ్చయ జ్ఞానమే కావాలి. మోక్షమున్నది. అంతే అసలు తర్కమే అవిశ్వాసానికి మూలం. అందుకు తర్కాన్ని వదిలిపెట్టాలి. అప్పుడు నిశ్చయబుద్ధి కలుగుతుంది. శాస్త్రాలయందు విశ్వాసం కలుగుతుంది.

**2. కామవాసన :** ఇదే ఐహిక వాంఛ. ఇహలోక సుఖాలమీద కోరికలున్నప్పుడు మోక్షంమీద అపేక్ష ఉండదు. అందుచేతనే వాసనలు జ్ఞానానికి ప్రతిబంధకాలు. లోకంలో పురుషుడు ధనధాన్యాలను, తాను కోరుకున్న స్త్రీనే తప్ప ఇతరాలను గమనించడు. అతనికి ఏ ఉపదేశం తలకెక్కదు. దీన్ని కేవలము వైరాగ్యంతోనే జయించాలి.

**3. చిత్తమౌఢ్యం :** బుద్ధిలేకపోవటం. దీనికి కేవలము సాధన ఒక్కటే మార్గం. సాధన ద్వారానే మనసుకు ఏకాగ్రత సాధించాలి.

**7. ఎవడు సాధకుడు :** తత్పరత్వం ఉన్నవాడే సాధకుడు. సాధకులలో కూడా నా భక్తుడు సర్వపూజ్యుడు. ఉత్తముడు. అతని సాధన ఫలించి తీరుతుంది.

**8. సిద్ధుడు :** దేహమే ఆత్మ అనే భావన అందరికీ సహజంగా ఉంటుంది. ఆ రకంగా 'దేహాత్మభావన' లేకపోవటమే సిద్ధి. సుషుప్తిలో కూడా దేహాత్మభావన అనేది ఉండదు. కాని అది తమోగుణ ప్రధానము. మూఢస్థితి. దేహము, ఆత్మ వేరు వేరని తెలుసుకోలేకపోవటమే ఈ అనర్థానికి కారణం. అన్నింటికీ కారణం ఆత్మ ఒక్కటే అనే భావన రావాలి. ఈ విషయం తెలిసిన తరువాత సాధించే సిద్ధులు ఇంక ఏవీ లేవు.

**9. ఉత్తమమైన సిద్ధి :** అణిమాది అష్టసిద్ధులు సాధించటం జరుగుతుంది. అవి

1. అణిమ - శరీరాన్ని అతిచిన్నదిగా చెయ్యటం
2. మహిమ - శరీరాన్ని అతిపెద్దదిగా చెయ్యటం
3. గరిమ - శరీరం బరువు విపరీతంగా పెంచటం
4. లఘిమ - శరీరం బరువు పూర్తిగా తగ్గించి వెయ్యటం.
5. ప్రాప్తి - కావలసిన వస్తువులు పొందటం.
6. ప్రాకామ్యము - ఆకాశ సంచారము
7. ఈశిత్వము - సమస్తానికీ అధికారము పొందటం
8. వసిత్వము - సమస్త భూతాలను లోబరచుకోవటం

ఇవన్నీ దేశకాలములచే పరిచ్ఛిన్నమైనవి. ప్రళయందాకానే ఉంటాయి. కాని ఆత్మజ్ఞానము అలా కాదు. ఇది సంపూర్ణ చిదానందస్వరూపము. మిగిలిన సిద్ధులన్నీ ఇందులోని చిన్న చిన్న అంశాలు మాత్రమే. అందుకే ఉత్తమమైన సిద్ధి ఆత్మజ్ఞానము తప్ప వేరు కాదు.

**10. సిద్ధులలో శ్రేష్ఠుడు :** జ్ఞానసిద్ధిలో ఉత్తమ, మధ్యమ, అధమ అని మూడు రకాలు ఉన్నాయి. ఉత్తములు తమ పని తాము చేస్తూనే మిగిలిన పనులు కూడా చెయ్యగలుగుతారు.

అంటే ఒకేసారి అనేకమైన పనులు చేస్తారు. మధ్యములు ఏ పనీ లేకుండా ఉన్నప్పుడు మాత్రమే తమ మనసుకు ఒక పనిమీద లగ్నం చెయ్యగలుగుతారు. అధములు ఏ పనీ లేకపోయినా ఒక పనిమీద ఆసక్తి ఉంటేనే ఆ పని చెయ్యగలుగుతారు.

ఆత్మవిజ్ఞాన సిద్ధికూడా ఇలాగే మూడు రకాలుగా ఉంటుంది. రాజ్యపాలనలో మునిగిపోయినా, ఆత్మజ్ఞానమందు ఏకాగ్రత లేకపోయినా జనకాదులకు కలిగినది ఉత్తమసిద్ధి. లోకవ్యవహారాలలో లేనప్పుడు, ఏకాగ్రమైన మనస్సు లేకపోయినా కలిగేది మధ్యమసిద్ధి. లోకవ్యవహారాలు లేనప్పుడు మాత్రమే కలిగేది అధమసిద్ధి.

వీటన్నింటిలోనూ ఉత్తమసిద్ధియే జ్ఞానస్థితిలో చివరి దశ. స్వప్నదశలోను, బాహ్య వ్యవహారదశలోను కూడా 'పరమాత్మను నేనే' అనే జ్ఞానం గనక ప్రకాశించినట్లైతే, అది పరమోత్తమ దశ. లోక వ్యవహారంలో అతనికి సహజమైన సంకల్పం కలగదు. అతడికి పూర్వవాసనలుండవు. అయినప్పటికీ ప్రయత్న పూర్వకంగా సంకల్పాలను తెచ్చుకొని ప్రవర్తిస్తాడు. ఆ స్థితియే పరాకాష్ఠ. అటువంటివాడు లోకవ్యవహారంలో అద్వైత భావన చూస్తున్నా చూడనట్లే లెక్క. అప్పుడు అతడి జ్ఞానసిద్ధి పరిపూర్ణమయిందన్న మాట. ఇటువంటి స్థితి పొందినవాడు ఉత్తమ సిద్ధుడు. అటువంటి సిద్ధుడికి నాకు తేడా ఉండదు అంటూ పరమేశ్వరి మహర్షుల సంశయాలను తీర్చింది.

పరశురామా ! భగవద్గీతను చెప్పిన శ్రీకృష్ణుడు కూడా శరీరధారియేనయ్యా ! కాని ఈ విద్యాగీతను సాక్షాత్తూ పరబ్రహ్మ స్వరూపమయిన పరమేశ్వరి చెప్పింది. అన్నాడు దత్తాత్రేయుడు అంటూ ఇరవైయవ అధ్యాయం ముగించాడు రత్నాకరుడు.

## 33. జ్ఞానుల లక్షణాలు

గురువర్యా ! విద్యాగీతను విన్న తరువాతైనా పరశురాముని సంశయాలు తీరినాయా? ఆ తరువాత ఏం జరిగింది ? అంటూ ప్రశ్నించాడు కృష్ణశర్మ చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

దత్తాత్రేయుని మాటలు విన్న పరశురాముడు అజ్ఞానబంధనాల నుండి విడివడినట్లుగా భావించాడు. అయినా చిన్న అనుమానం వచ్చింది. అప్పుడు గురువర్యా ! సులభము, సారభూతము, నిశ్చలము, సాక్షాత్తూ ఫలాన్ని ఇచ్చే విజ్ఞానసాధనం ఏమిటో తెలపండి. జ్ఞానులను గుర్తించటం ఎలా ? జ్ఞానుల లక్షణాలు ఏవి ? వారు దేహభావన ఉన్నప్పుడు ఎలా ఉంటారు ? లేనప్పుడు ఎలా ఉంటారో తెల్పండి. అన్నాడు. ఆ మాటలు విన్న

దత్తాత్రేయుడు "రామా ! జ్ఞానసాధన రహస్యాన్ని తెలియచేస్తున్నాను వినవలసినది అంటూ ప్రారంభించాడు.

**ఉత్తమ జ్ఞానసాధనం :** పరశురామా ! సాధనలన్నింటిలోకి దేవతానుగ్రహమే ఉత్తమ జ్ఞానసాధనం. దేవత "వీడు నా భక్తుడు. ఇతడి కోరిక తప్పక తీర్చాలి" అనుకుని, అతణ్ణి తనవాడుగా గ్రహిస్తుంది. అందుకనే ఇది సర్వోత్కృష్టమైనది. మానవుడు త్రికరణశుద్ధిగా నిరంతరము జపము, ధ్యానము, కర్మ మొదలైనవాటితో దేవతను గనక ధ్యానించినట్లైతే, అతడికి తేలికగా జ్ఞానం కలుగుతుంది. ఇది సర్వోత్తమమైన సాధనము. అయితే 'తత్పరత్వం' ఉన్నప్పుడే జ్ఞానం కలుగుతుంది.

సర్వసాధనాలకు ఫలితము విజ్ఞానమే. విజ్ఞానము అంటే – సర్వాన్నీ ప్రకాశింపచేస్తూ సర్వానుగతంగా ఉన్న సామాన్యమైన చితి. ప్రకాశరూపమైన ఆ చితికి ఆవరణ కల్పితమైనది. అయితే శ్రవణము, మననము మొదలైన వాటివల్ల 'దేహమే ఆత్మ' అనే ఆవరణ, భ్రాంతి తొలగిపోతుంది. అప్పుడు 'సోఽహం' అతడే నేను అనే జ్ఞానం కలుగుతుంది. దానివల్లనే ఆత్మ దర్శనమవుతుంది.

స్త్రీ వ్యామోహము, సిరిసంపదల మీద ఆసక్తి గలవాడికి అంటే – బహిర్ముఖుడైన వాడికి ఈ జ్ఞానం కలగదు. దేవతా తత్పరుడైనవాడు వైరాగ్యాన్ని అంతగా అపేక్షించడు. అయితే పరోక్షజ్ఞానం మాత్రం సంపాదిస్తాడు. తాను పొందిన దానిని ఇతరులకు నిరూపిస్తాడు. ఎప్పుడూ ఇలా నిరూపిస్తూ ఉండటంవల్ల అతని మనస్సు చిదాకారాన్ని పొందుతుంది. ఇతరులకు చెబుతున్న కొద్దీ, అది అతడిలో గట్టి పడుతుంది. అతని చిత్తం శివమయమవుతుంది. అతడు ఈ జగత్తునంతా శివరూపంగానే చూస్తాడు. అతడికి హర్షోద్వేగాలుండవు. అతడు జీవన్ముక్తుడౌతాడు. ఈ రకంగా భక్తి రూపంతో కూడిన జ్ఞానము మోక్ష సాధనమవుతుంది.

**జ్ఞానుల లక్షణాలు :** జ్ఞానం యొక్క లక్షణం ఏమిటి అంటే శుద్ధ చిన్మాత్రరూపంగా ఉండటం అందుకే జ్ఞానము అనేది కళ్ళకు కనపడదు. చెవులకు వినపడదు. కాబట్టి జ్ఞానుల లక్షణం ఇదీ అని తెలుసుకోవటం కష్టం. కేవలము వేషము, భాష, అలంకారము, మొదలైనవాటివల్ల ఎవరి పాండిత్యాన్నీ తెలుసుకోలేము. నిజంగా చెప్పాలంటే ఎవరి విద్వత్తు వారికే తెలియాలి. పదార్థంలో తీపి ఎంత ఉన్నది అంటే – అది తిన్నవారికే తెలుస్తుంది. అలాగే జ్ఞానియొక్క లక్షణం జ్ఞానులకు మాత్రమే తెలుస్తుంది. వారి మాటలు, చేష్టలద్వారా జ్ఞానులు గుర్తించబడతారు.

జ్ఞానులు కాని వారు కూడా ప్రసన్నంగా మాట్లాడటము, వైరాగ్యం ప్రదర్శించటము, మొదలైన లక్షణాలను వారి వేషభాషల్లో చూపుతారు. నిర్మలమైన అంతఃకరణ లేనివారు కూడా కొంత ప్రయత్నం చేసి పై లక్షణాలు చూపిస్తారు. అవి వారికి సహజ లక్షణాలు కావు. కేవలము ప్రయత్నం మీద అబ్బేవే.

జయాపజయాలు, మానావమానాలు పొందినప్పుడు వికారం పొందనివాడు, ఆత్మ సాక్షాత్కారం పొందినప్పుడు వెంటనే చెప్పగలవాడు, ఉత్తమజ్ఞాని. జ్ఞాన సంబంధమైన ప్రసంగాలలో ఉత్సాహము ప్రదర్శించటము, జ్ఞానక్రమాన్ని నిరూపించటము, సహజంగా ఏ పనికీ పూనుకోకపోవటము, సంతోషము, దుఃఖము లేకపోవటము, అరిషడ్వర్గాలను జయించటము, పెద్దపెద్ద ఆపదలు వచ్చినా సరే ప్రశాంతంగా ఉండటము, ఇవన్నీ ఉత్తమజ్ఞానుల లక్షణాలు. తనను తాను పరిక్షించుకోవటానికి ఇవన్నీ ఉపయోగిస్తాయి. సాధకుడు ఎప్పుడూ తనను తాను పరిక్షించుకుంటూ ఉండాలి. ఈ లక్షణాలు అలవరచు కోవటానికి ప్రయత్నించాలి. ముందుగా తనను తాను పరిక్షించుకుని, ఆ తరువాత ఆ లక్షణాలు ఇతరులలో ఉన్నాయో లేదో చూడాలి. అయితే ఇతరుల గుణదోషాలు ఎంచే కన్న తన గుణదోషాలనే ఎక్కువగా ఎంచుకోవాలి. అప్పుడే అతనిలోని దోషాలు పోయి, మంచి లక్షణాలు నిలుస్తాయి.

**ఇతర జ్ఞానులను పరిక్షించటం :** పరశురామా ! ఇతరులకు ఈ లక్షణాలు ఉన్నాయో, లేదో పరిక్షించటం సాధ్యం కాదు. ఎందుకంటే కొంతమందిలో ఈ లక్షణాలున్నా అవిపైకి కనిపించవు.. కొంతమంది అవి లేకపోయినా, ఉన్నట్టుగా నటిస్తారు. అపరాధము, కర్మ, కామము అనే వాసనలు లేనివారికి సాధన ప్రారంభంలోనే జ్ఞానం సిద్ధిస్తుంది. కాని వారి పూర్వవాసనలు పూర్తిగా పోకపోతే వారుకూడా సామాన్యులలాగానే కనిపిస్తారు. వారిలో ఈ లక్షణాలు కనపడవు.

అందుచేతనే జ్ఞానులు కానివారు జ్ఞానులను పరిక్షించలేరు. ఇక జ్ఞానులు, తాము జ్ఞానులై ఉండి కూడా అజ్ఞానులులాగా ప్రవర్తించటం సహజం కాబట్టి, వారు ఇతరులను గుర్తించగలుగుతారు.

**జ్ఞానుల వ్యవహారం :** అధమ స్థితిలో ఉన్నవారికి, ఉత్తమ జ్ఞానులకున్నట్లుగా నిరంతర సమాధిస్థితి ఉండదు. సోఽహం అనే భావన ఉంటేనే వారికి ఆ స్థితి కలుగుతుంది. అప్పుడే దేహాత్మభావన నశిస్తుంది. మిగిలిన సమయాలలో దేహాత్మభావన ఉంటుంది. ఆ సమయంలో వారుకూడా మూఢులలాగానే ప్రవర్తిస్తారు. మధ్యమధ్య వారు సంపూర్ణ సమాధిస్థితి పొందుతారు. ఆ స్థితిలో సంసార బంధనాలుండవు.

**ఇక మధ్యమశ్రేణి జ్ఞానులు :** వీరికి ఏ విధమైన దేహసంబంధము ఉండదు. దేహమే ఆత్మ అనే భ్రాంతి అసలే ఉండదు. నిరంతరము అభ్యాసం చెయ్యటంవల్ల వారి మనస్సు ఎప్పుడూ లయ స్థానంలోనే ఉంటుంది. అందువల్ల అతడు ఎప్పుడూ సమాధిస్థితిలోనే ఉంటాడు. మనస్సు సంకల్పరహితంగా ఉంటుంది. లోకవ్యవహారాలుండవు. శరీర సంబంధముండదు. శరీరం నిలవాలి కాబట్టి అన్నపానాదులు తీసుకుంటాడు. అంతే వాటివల్ల అతడికి ఏ బంధనాలు అంటవు. సుషుప్తిలో ఉన్నవాడు ఏం మాట్లాడినా వాడికి తెలియదు. అలాగే లోకజ్ఞానం లేని ఈ యోగి ఏం మాట్లాడినా, ఏం చేసినా అతనికి తెలియదు. ఇతడు కేవలము ప్రారబ్ధంవల్ల మాత్రమే దేహయాత్ర సాగిస్తాడు.

ఉత్తమజ్ఞానికి కూడా దేహసంబంధముండదు. దేహం చేసే పనులు నావే అని అభిమానము ఉండదు. అయినా రథసారథిలాగా ఈ దేహాన్ని నడిపిస్తూనే ఉంటాడు. రథం నడుస్తూ ఉంటే నేనే ఈ రథము, నేను నడుస్తున్నాను అనుకోడు. ఈ రకంగా ఉత్తమజ్ఞాని దేహం కలవాడూ కాదు. దేహవ్యాపారీ కాదు. అతడు శుద్ధచిన్మాత్రుడు.

**ఉత్తమ, మధ్యమ జ్ఞానులలో భేదం :** సాధనలో భేదంవల్లనే వారిలో కూడా భేదం వచ్చింది. మనస్సును బాగా నిగ్రహించినందున మధ్యమయోగికి ఆ స్థితి వచ్చింది. నిరంతరం సోఽహం అనటంవల్ల ఉత్తముడికి ఆ స్థితి వచ్చింది.

అని జ్ఞానుల యొక్క లక్షణాలను దత్తాత్రేయుడు పరశురాముడికి వివరించాడు అన్నాడు రత్నాకరుడు.

## 34. బ్రహ్మరాక్షసుడు

"గురువర్యా ! జ్ఞానుల లక్షణాలు, వారి మధ్య తేడాలను దత్తాత్రేయుడు వివరించాడు కదా ! ఆ తరువాత ఏం జరిగింది?" అంటూ ప్రశ్నించాడు నారాయణభట్టు. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

ఇంత చెప్పినా పరశురాముడి సందేహాలు తీరలేదు. అందుకని ఒక చిన్నకథ చెప్పటం మొదలుపెట్టాడు దత్తాత్రేయుడు.

పూర్వకాలంలో నిపాశా నదీ తీరంలో అమృతము అనే నగరం ఉండేది. ఆ నగరాన్ని రత్నాంగదుడు అనే రాజు పరిపాలిస్తున్నాడు. అతనికి రుక్మాంగదుడు, హేమాంగదుడు అని ఇద్దరు కుమారులున్నారు. వీరిలో పెద్దవాడు పండితుడు. చిన్నవాడు మహాజ్ఞాని.

ఒకసారి వసంతకాలంలో వీరిద్దరూ వేటకి వెళ్ళారు. అలా పోయిపోయి కీకారణ్యంలో ప్రవేశించారు. అక్కడ అనేక జంతువులను వేటాడి బాగా అలసిపోయారు. బాగా దాహం

వేసింది. దూరంగా ఒక సరస్సు కనిపించింది. నీరు త్రాగుదామని ఆ సరస్సు దగ్గరకు వెళ్ళారు రాకుమారులు. దాని వడ్డున ఒక పెద్ద మర్రిచెట్టున్నది. దానిని ఆశ్రయించుకుని బ్రహ్మరాక్షసుడు ఒకడున్నాడు.

ఆ రోజుల్లో మగధదేశం పండితులకు పెట్టింది పేరు. అందులో వసుమంతుడు అనే పండితుడుండేవాడు. అతడు సర్వశాస్త్ర పండితుడు. అహంకారి. శుష్కతర్కంలో మహానిపుణుడు. అనేక సభలలో పండితులను జయించాడు. దానితో మహాగర్విష్టి అయినాడు. ఒక రోజు రాజుగారి ఆస్థానానికి వెళ్ళాడు. రాజాస్థానంలో అష్టకుడు అని ఒక పండితుడున్నాడు అతడు వేదవేదాంగవిదుడు. శాస్త్రవేత్త. ఉత్తముడు. నిగర్వి. అతన్ని వాదనకు ఆహ్వానించాడు వసుమంతుడు. ఇద్దరికీ వాదన మొదలైంది. అష్టకుడు చెప్పిన శాస్త్ర ప్రమాణమైన విషయాలను వసుమంతుడు తనకు తర్కంతో ఖండించటం మొదలుపెట్టాడు. అష్టకుణ్ణి అనేక విధాల అవమానపరచాడు. నిందించాడు. అయినప్పటికీ అతడు ఏ మాత్రం చలించలేదు. కాని అష్టకుని శిష్యుడైన కాశ్యపుడు, తన గురువుగారికి జరిగిన అవమానం భరించలేక కోపించి వసుమంతుణ్ణి బ్రహ్మరాక్షసిగా పుట్టమని శపించాడు. దాంతో వసుమంతుడు తన తప్పు ఒప్పుకొని, శాపవిమోచనం చెప్పమని ప్రాధేయపడగా నీ ప్రశ్నలకు ఎవరైనా సమాధానం చెప్పినప్పుడు నీకు శాపవిమోచనం కలుగుతుంది అన్నాడు కాశ్యపుడు. ఆ విధంగా బ్రహ్మరాక్షసి అయిన వసుమంతుడు ఇప్పుడు ఆ మర్రిచెట్టు మీద ఉన్నాడు.

ఆ చెట్టు దగ్గరకు రాగానే రుక్మాంగదుణ్ణి తనతో వాదించి గెలవమన్నాడు బ్రహ్మరాక్షస రూపంలో ఉన్న వసుమంతుడు. సహజంగానే పండితుడైన రుక్మాంగదుడు వాదనకు దిగాడు. కాని అతని కుతర్కం ముందు నిలవలేక ఓడిపోయాడు. ఓడిపోయినవాణ్ణి చంపి తినటం ఆ రాక్షసుని ఆచారం. అందుకని రుక్మాంగదుణ్ణి తినటానికి ఉపక్రమించాడు. అప్పుడు అతని తమ్ముడే హేమాంగదుడు రాక్షసుణ్ణి వారించి మేమిద్దరం కలిసి నీతో వాదనకు వచ్చాం. ఒకడు ఓడిపోయాడు అంటే సగం ఓడినట్టు. అంతేకాని పూర్తిగా కాదు. నన్ను కూడా ఓడించి మా ఇద్దరినీ కలిపి భక్షించు అన్నాడు. దానికి రాక్షసుడు దొరికిన ఆహారం పోతుంది కాబట్టి ఒప్పుకోలేదు. చివరకు తను అడిగిన ప్రశ్నలకు హేమాంగదుడు గనక సమాధానం చెప్పగలిగితే, అతడి అన్నను చంపకుండా వదిలేస్తాను అన్నాడు. సరే అన్నాడు హేమాంగదుడు. ప్రశ్నలు అడగటం ప్రారంభించాడు రాక్షసుని రూపంలో ఉన్న వసుమంతుడు.

1. రా: ఆకాశం కన్న విశాలమైనది, పరమాణువుకన్న సూక్ష్మమైనది ఏది ?

హే: బ్రహ్మరూపమైన సామాన్యచైతన్యము

2. రా: దాని స్వరూపమేది ?

హే: స్ఫురణ

3. రా: అది ఎక్కడ ఉంటుంది.

హే: తనలోనే, తన స్వరూపంలోనే

4. రా: ఒకే వస్తువు అతి విశాలము, అతిసూక్ష్మము ఎలా అవుతుంది.

హే: అన్నిటికీ ఉపాదాన కారణము. అన్నింటా వ్యాపించి ఉంటుంది కాబట్టి అతివిశాలము గ్రహించటానికి వీలులేనిది కాబట్టి అతిసూక్ష్మము

5. రా: స్ఫురత్వమంటే ఏమిటి ?

హే: చైతన్యము

6. రా: ఆత్మ అంటే ఏమిటి ?

హే: చిన్మాత్ర

7. రా: చైతన్యం ఎక్కడ ఉన్నది ?

హే: బుద్ధిలో

8. రా: దాన్ని పొందటానికి సాధనమేమిటి ?

హే: ఏకాగ్రచిత్తము

9. రా: దానిని పొందితే కలిగే ఫలితమేమిటి ?

హే: జన్మరాహిత్యము

10. రా: బుద్ధి అంటే ఏమిటి ?

హే: అవ్యక్తమనే జడశక్తి ఆవరించిన చైతన్యము

11. రా: దాని ఏకాగ్రత అంటే ఏమిటి ?

హే: దృశ్యానికి విముఖ్యమై, స్వాత్మలో విశ్రమించటము.

12. రా: జన్మ అంటే ఏమిటి ?

హే: దేహమే ఆత్మ అనే బుద్ధి

13. రా: చైతన్యప్రాప్తి ఎందుకు కలగటం లేదు ?

హే: అవివేకం వల్ల

14. రా: దేనితో చైతన్యం పొందవచ్చు ?

హే: ఆత్మతో

15. రా: దేహాత్మరూపమైన జన్మ ఎందుకు కలుగుతుంది ?

హే: కర్తృత్వాభిమానంవల్ల

16. రా: అవివేకం అంటే ఏమిటి ?

హే: దేహమే ఆత్మ అనే భావం

17. రా: ఆత్మ అంటే ఏమిటి ?

హే: నీ స్వరూపమే ఆత్మ

18. రా: కర్తృత్వాభిమానమంటే ఏమిటి ?

హే: నేనే కర్తను అనే అభిమానము.

19. రా: అవివేకం దేనితో నశిస్తుంది ?

హే: ఆలోచనతో

20. రా: ఆలోచన ఎలా కలుగుతుంది ?

హే: వైరాగ్యంతో

21. రా: వైరాగ్యానికి కారణం ఏమిటి ?

హే: విషయాలయందు దోషదృష్టి

22. రా: విచారమంటే ఏమిటి ?

హే: జిజ్ఞాసతో కూడిన దృక్, దృశ్యాల పరిక్ష

23. రా: వైరాగ్యమంటే ఏమిటి ?

హే: దృశ్యముల యందు రాగాన్ని వదలటం

24. రా: దోషదృష్టి అంటే ఏమిటి ?

హే: దృశ్యమే దుఃఖ సాధనమని తెలుసుకోవటం

25. రా: దేనివలన ఇవి కలుగుతాయి ?

హే: దేవతానుగ్రహంవల్ల

26. **రా:** దేవతానుగ్రహం దేనివల్ల కలుగుతుంది ?

**హే:** భక్తివల్ల

27. **రా:** భక్తి ఎందుకు కలుగుతుంది ?

**హే:** సత్సంగంవల్ల

28. **రా:** దేవత ఎవరు ?

**హే:** జగత్తును నియమించే పరాచితి

29. **రా:** భక్తి అంటే ఏమిటి ?

**హే:** త్రికరణాలను దేవతపై లగ్నం చెయ్యటం

30. **రా:** సత్పురుషులు ఎవరు ?

**హే:** శాంతము, దయగలవారు

31. **రా:** లోకంలో ఎప్పుడూ భయంతో ఉండేవాళ్ళు ఎవరు ?

**హే:** ధనవంతులు

32. **రా:** ఎప్పుడూ దుఃఖించే వారెవరు ?

**హే:** పెద్దకుటుంబీకులు

33. **రా:** ఎప్పుడూ దీనంగా ఉండేవారెవరు ?

**హే:** ఆశగలవారు

34. **రా:** భయం లేని వాడెవరు ?

**హే:** సంఘ రహితుడు

35. **రా:** దుఃఖం లేనివాడెవరు ?

**హే:** మనసును జయించినవాడు

36. **రా:** దీనుడు కాని వాడెవడు ?

**హే:** జ్ఞాని

37. **రా:** ఎవరిని లోకంలో గుర్తించలేము ?

**హే:** జీవన్ముక్తుని

38. **రా:** విదేహుడైనా కనపడే వాడెవరు ?

**హే:** జీవన్ముక్తుడు

39. **రా :** నిష్క్రియుడైనా సక్రియుడెవరు ?

**హే :** జీవన్ముక్తుడు

40. **రా :** ఉన్నదేది ?

**హే :** దృక్కు

41. **రా :** లేనిదేది ?

**హే :** దృశ్యము

42. **రా :** అత్యంతము అసంభవమేది ?

**హే :** లోకవ్యవహారము. దృశ్యమే లేదు కాబట్టి దృశ్య వ్యవహారం కూడా లేదు.

ఈ రకంగా రాక్షసుని ప్రశ్నలన్నింటికీ హేమాంగదుడు సమాధానం చెప్పాడు. ఆ సమాధానాలు విన్న వసుమంతుడికి శాపవిమోచనం జరిగింది. అని దత్తాత్రేయుడు చెప్పాడు అంటూ ఇరవై ఒకటవ అధ్యాయాన్ని పూర్తి చేశాడు రత్నాకరుడు.

## 35. వసుమంతుని సందేహాలు

గురువర్యా ! బ్రహ్మరాక్షసుని ప్రశ్నలకు హేమాంగదుడు సమాధానాలు చెప్పాడు. అతడికి శాపవిమోచనం కూడా జరిగింది కదా ! తరువాత ఏం జరిగిందో వివరించండి అన్నాడు కృష్ణశర్మ. చెప్పటం మొదలుపెట్టాడు రత్నాకరుడు.

శాపవిమోచనం పొందిన వసుమంతుడు హేమాంగదునితో "రాజపుత్రా ! నిన్నొక విషయం అడుగుతాను తత్త్వాన్ని తెలుసుకున్న నువ్వు లోకవ్యవహారాన్ని ఏ విధంగా నిర్వర్తించగలుగుతున్నావు?" అన్నాడు ఆ మాటలు విన్న హేమాంగదుడు చెప్పటం ప్రారంభించాడు. "బ్రాహ్మణోత్తమా ! నిన్ను అజ్ఞానం ఇంకా వదలలేదు. అసలు జ్ఞానం రెండు రకాలుగా ఉంటుంది. 1. ఆత్మ స్వరూపమైనది 2. అజ్ఞానాన్ని నాశనం చేసే 'సోఽహం' రూపమైన ప్రత్యభిజ్ఞా రూపమైనది. లౌకిక వ్యవహారము ఆత్మజ్ఞానానికన్న వేరైనదా? లేక ప్రత్యభిజ్ఞానానికన్న వేరైనదా? ఒకవేళ లోక వ్యవహారంవల్ల ఆత్మరూపజ్ఞానం గనక నాశనమైతే, అది కలలో కలిగే జ్ఞానంలాంటిదే అవుతుంది. అటువంటి జ్ఞానము మోక్షసాధనం కాలేదు. లోకవ్యవహారం ఆత్మజ్ఞానాన్ని నాశనం చెయ్యలేదు.

**వ :** సోఽహం జ్ఞాన ప్రామాణ్యానికి వ్యవహారం బాధకం కావచ్చును కదా ?

**హే :** ఒకపేరు కలిగి, ఒక రూపంతో ప్రకాశించే స్వరూపమే సంకల్పం. ఈ సంకల్పంవల్లనే ఇవ్వటం, పుచ్చుకోవటమనేది జరుగుతుంది. శ్రవణాది సాధనాలవల్ల

పరోక్షజ్ఞానం కలుగుతుంది. నిధిధ్యానరూపమైన సంకల్పంవల్ల సాక్షాత్ జ్ఞానం కలుగుతుంది. వెంటనే ఒక్కక్షణం సోఽహం అనే ప్రత్యభిజ్ఞారూప విశేషజ్ఞానం కలుగుతుంది. దీనితో అవిద్య నశిస్తుంది. నేను, నాది అనే భావాలు కలగవు. అందువల్ల "సోఽహం రూప ప్రత్యభిజ్ఞానము అప్రమాణము" అనే జ్ఞానంకూడా కలగదు. అంటే - లౌకిక వ్యవహారజ్ఞానమనేది ప్రత్యభిజ్ఞారూప జ్ఞానానికి విరుద్ధం కాని, బాధకంగాని కాదు. అలాంటప్పుడు జ్ఞాని వ్యవహారాలలో ఉన్నా ముక్తుడుగానే ఉంటాడు.

**వ :** రాకుమారా ! భిన్నసంకల్పాలు లేని స్వరూపాన్నే చితి అంటున్నారు. ఆ సంకల్పాలు లేనిదే వ్యవహారాలు కుదరవు అప్పుడు స్వరూపంలో లేనివి, స్వరూప విరుద్ధమైన సంకల్పాలు స్వరూపంలో భాసిస్తాయి. అనగా భ్రాంతి కలుగుతుంది. భ్రాంతి అంటే జ్ఞానస్వరూపమైన చితి, తద్విరుద్ధమైన సంకల్పంగా మారి భాసించటమే. త్రాడు పాములాగా కనపడటం భ్రాంతి. అందువల్ల జ్ఞానికూడా వ్యవహరిస్తున్నాడు. అంటే తిరిగి భ్రమలో పడ్డట్లే కదా ?

**హే :** బ్రాహ్మణోత్తమా ! భ్రమకూ, అభ్రమకూ మధ్యగల భేదం నీకు తెలియటం లేదయ్యా! జ్ఞానుల వ్యవహారం భ్రమకాదు. ఆకాశం నీలం రంగు కాదు అని దానితత్త్వం తెలిసిన వాళ్ళకి కూడా అది నీలంగానే కనిపిస్తుంది. అంతమాత్రాన ఆకాశం నీలం అన్నవారి జ్ఞానము భ్రమకాదు. ఆకాశతత్త్వం తెలియని అజ్ఞానికిఅది భ్రమ. తత్త్వవేత్త "ఆకాశము నీలము" అంటే అది యదార్థమే అవుతుంది. ఎందుకంటే తత్త్వవేత్తకు దానిలో ప్రామాణ్యబుద్ధి లేదు. చచ్చిన పామువలన ఏ అపకారము జరగనట్లే, ప్రామాణ్యబుద్ధి లేని వ్యవహారమువల్ల ఏ దోషము అంటదు. జ్ఞాని ఆ వ్యవహారము సత్యము కాదు అని తెలిసికూడా అది సత్యమన్నట్లుగా ప్రవర్తిస్తాడు. ఈ వ్యవహారము అతడికి బంధకము కాదు. తత్త్వజ్ఞుడు కానివాడికి వ్యవహారము బంధకమవుతుంది. ప్రతిబింబమైన ఏనుగును చూసి అది నిజం ఏనుగు అనుకుంటాడు.

ఈ విధంగా జ్ఞాని, అజ్ఞాని ఇద్దరూ లోకవ్యవహారాలు చేస్తున్నా, వారి జ్ఞానంలో భేదమున్నది. జ్ఞాని అయినవాడు వ్యవహారం జరుపుతున్నా, అది అతన్నంటదు. అతడు నిమిత్తమాత్రుడు. అయితే అజ్ఞానంవల్ల కలిగిన భ్రమ, జ్ఞానంవల్ల నశిస్తుంది. కర్మఫలం వలన వచ్చిన అజ్ఞానము, కర్మక్షయం అయ్యేవరకు ఉంటుంది. కర్మక్షయం కాగానే వ్యవహార భావనకూడా పోతుంది. అప్పుడు ఈ జగత్తు కనిపించదు. అంతా పరబ్రహ్మ స్వరూపమే ఉంటుంది. కాబట్టి జ్ఞానులకు భ్రాంతి అనేది ఉండనే ఉండదు.

వ : జ్ఞానులకు కర్మ ఉండటం అసంభవం కదా ? జ్ఞానాగ్ని ఈ కర్మను దగ్ధం చేస్తుంది కదా ?

హే : జ్ఞానులందరికీ 1. అపక్వము 2. పక్వము 3. హతోదికము అని మూడు రకాల కర్మలుంటాయి.

1. పరిపక్వం పొందని కర్మను అపక్వ కర్మంటారు. 2. కాలక్రమంలో పూర్తిగా పండిన కర్మను పక్వ కర్మ అంటారు. 3. జ్ఞానం కలిగిన తరువాత చేసిన హితోదికము వీటిలో అపక్వము, హతోదికము అనేవి జ్ఞానంవల్ల నశిస్తాయి. ఇంతకాలానికి పూర్తి అవుతాయి అని భగవంతుడు సంకల్పిస్తాడు. ఆ సంకల్పాన్నే 'నియతి' అంటారు. క్రమంగా ఉండే క్రియల సమూహమే కాలము ఈ కాలము కర్మలను పరిపక్వం చేస్తుంది. కాలక్రమంలో పూర్తిగా పండిపోయిన కర్మను పరిపక్వ కర్మ అంటారు. పరిపక్వ దశకు రాని దాన్ని అపక్వకర్మ అంటారు. జ్ఞానం కలిగిన తరువాత చేసిన కర్మ హతోదికము. ఆ కర్మకు ఫలితాన్ని ఇచ్చే శక్తి ఉండదు. అందుకే అది హతమైనది. అంకురం మాడిపోయిన బీజంలాంటిది. మొలక ఎత్తదు. విత్తనంపైకి వచ్చినందున ఉదితము. హతమై ఉన్నది. కాబట్టి హతోదితము. ఇక్కడ కర్మ జరుగుతుంది. కాని ఫలితం మాత్రం రాదు.

పక్వమైన కర్మనే ప్రారబ్ధకర్మ అంటారు. ఇది లాగి విడిచిన బాణం లాంటిది. లక్ష్యాని ఛేదించి తీరుతుంది. అలాగే పక్వమైన కర్మ ఫలితాన్ని ఇచ్చి తీరుతుంది. ఆ కర్మ ఫలంగానే ఈ జగత్తు ప్రవర్తిల్లుతున్నది. అయితే జ్ఞానంలోని భేదాన్ని బట్టి వారి వ్యవహారాల్లోకూడా భేదం కనిపిస్తుంది. మందజ్ఞానులకు సుఖదుఃఖాలు ఉంటాయి. మధ్యజ్ఞానులకు కూడా సుఖదుఃఖాలు ఉంటాయి కాని అవి అంతతీవ్రంగా ఉండవు. అస్పష్టంగా ఉంటాయి. ఇక ఉత్తమజ్ఞానుల సంగతి చూస్తే వారి దృష్టిలో సుఖదుఃఖాలు అన్నీ అసత్యాలే. కాబట్టి అవి కర్మఫలం కాదు.

**కర్మఫలం :** కర్మఫలం పైన చెప్పిన ముగ్గురికీ వేరుగా ఉంటుంది.

**1. అజ్ఞానుల కర్మఫలం :** సుఖదుఃఖాలు గాకముందే ఫలానా సుఖం లేదు దుఃఖం నాకు వస్తుంది అనుకుంటాడు. వచ్చినతరువాత వాటిని అనుభవించాను అనుకుంటాడు. ఈ భావనలే అతని ప్రారబ్ధకర్మఫలానికి సృష్టినిస్తాయి. వాటినే ఎప్పుడూ ఆలోచించటంవల్ల అవి పెరిగి పోషింపబడి, మనస్సులో నిలిచి రాగద్వేషాలను పుట్టిస్తాయి.

అజ్ఞానులకు ఆత్మస్వరూపం తెలియదు. దేహమే ఆత్మ అనుకుంటారు. ఈ జగత్తే సత్యము అని నమ్ముతారు. సుఖదుఃఖాలు సత్యము అని నమ్మి వాటిని అనుభవిస్తారు.

**మధ్యమజ్ఞానులు :** వీరు మధ్యమధ్య ఆత్మానుసంధానం చేసుకుంటారు. అందువల్ల వారి భావాలు ఎల్లప్పుడూ సాగవు. ఆ కారణంగా వారి ప్రారబ్ధకర్మకు అంత బలం ఉండదు. అందుకనే వారికర్మ ఫలం తక్కువగా ఉంటుంది.

మధ్యమజ్ఞాని బ్రహ్మ ఒక్కటే సత్యమని ఈ జగత్తు అంతా మిధ్య అని మధ్యమధ్యలో అనుకుంటాడు. ఆ భావన పూర్తిగా ఉండదు కాబట్టి దేహమే ఆత్మ అనుకుంటాడు. అయితే బ్రహ్మ ఒక్కటే సత్యము అనే భావన అతనికి పూర్వం నుంచీ ఉన్నది కాబట్టి అది మధ్యమధ్యపైకి వచ్చి ఈ జగత్తే సత్యము అనే మిధ్యాజ్ఞానాన్ని తొలగిస్తుంది. ఈ రకంగా సత్యజ్ఞానము, మిధ్యాజ్ఞానము ఒక్కొక్కటిగా పైకి కనిపిస్తాయి. సత్యజ్ఞానం వచ్చినపుడు కర్మఫలం కనపడదు. మిధ్యాజ్ఞానం ఉనప్పుడు కర్మఫలం కనిపిస్తుంది. సాధనవల్ల సత్యజ్ఞానం ఎక్కువై, మిధ్యాజ్ఞానం తగ్గిపోతుంది. అయినా లోకవ్యవహారం కోసం మిధ్యాజ్ఞాన వాసనను కోరి తెచ్చుకుని దానితో వ్యవహరిస్తాడు.

**ఉత్తమ జ్ఞానులు :** వీరికి జ్ఞానం కలగకముందు ప్రారబ్ద కర్మ సంపూర్ణంగా ఉన్నా, జ్ఞానం కలిగిన తరువాత కర్మఫలం నాశనం అవుతుంది. అది బయటకు సుఖదుః ఖాలుగా కనిపించినప్పటికీ, కాలిపోయిన బట్టలాగా ఉపయోగం ఉండదు. జ్ఞానికి సుఖదుః ఖాలు అంటవు. రంగస్థలంమీది నటుడులాగా అభినయిస్తాడు. అంతేకాని అవి అతన్నంటవు.

ఉత్తమజ్ఞానికి స్వరూప స్మృతి ఎప్పుడూ నిరవధికంగా ఉంటుంది. అందువల్ల అతనిదృష్టిలో సమాధి స్థితికీ, వ్యవహారస్థితికీ తేడా ఉండదు. మధ్యమజ్ఞాని విషయంలో ఇది కొంచెం తక్కువ ఉంటుంది.

ప్రతి కారణానికీ ఒక కార్యం ఉంటుంది. అలాగే ప్రాణులు అనుభవించే సుఖదుః ఖాలకూడా ఒక కారణం ఉండి తీరాలి. మనకి ప్రత్యక్షంగా కనపడని ఆ కారణాన్నే కర్మ అంటున్నాము. జ్ఞానులు కూడ అందరిలాగే ఈ లోక వ్యవహారంలో ఉంటున్నారు. కాబట్టి వారుకూడా కర్మఫలాన్ని అనుభవించి తీరాల్సిందే. అయితే ఈ విషయం మంద జ్ఞానులకు మాత్రమే వర్తిస్తుంది. సుఖదుఃఖాలవల్ల వారి అంతఃకరణలో మార్పు వస్తుంది. అలా మార్పు కలిగించేదే కర్మఫలము. అంటే సుఖదుఃఖాలు తనవిగా భావించినప్పుడే ఆ కర్మఫలాలు అందుతాయి. ఒకవేళ సుఖదుఃఖాలను తమవిగా భావించకపోతే అవి అంతః కరణలో మార్పు తేలేవు. కాబట్టి అది కర్మఫలం కాదు. జ్ఞానుల అంతఃకరణలో ఈ మార్పు ఉండదు. అందువల్లనే వారికి కర్మఫలాలుండవు.

